# క్షేత్రయ్య పదసాహిత్యం

**1973 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ**
**బహుమతి పొందిన గ్రంథం**

డాక్టర్ ఎస్. గంగప్ప, ఎం. ఏ., పిహెచ్. డి.

**క్షేత్రయ్య పదసాహిత్యం**

[పరిశోధన గ్రంథం]

ఆం. ప్ర. సాహిత్య అకాడమీ బహుమతి పొందిన గ్రంథం

*రచయిత :*
**డా. ఎస్. గంగప్ప**, ఎం. ఏ., పిహెచ్. డి.,
తెలుగు శాఖాధ్యక్షులు,
నూతన ప్రభుత్వ కళాశాల,
చింతలబస్తీ, ఖైరతాబాద్,
హైద్రాబాద్ - 500004.

ప్రథమ ముద్రణ: సెప్టెంబరు, 1974



ముఖపత్ర రచన :
శ్రీ ఎమ్. కృష్ణమూర్తి

**వెల :**
సాదా ప్రతి : రూ. 10-00
మేలు ప్రతి : రూ. 15-00

*ప్రకాశకులు :*
**'శశి' ప్రచురణలు,**
హైద్రాబాద్.

# అంకితం



ఆంధ్రప్రదేశ్
విద్యా సాంస్కృతిక శాఖామాత్యవర్యులు
ఉత్తమ కళాపోషకులు, సహృదయవతంసులూ
మాన్యశ్రీ
**మండలి వేంకటకృష్ణారావు**
మహోదయులకు.

# విషయ సూచిక

# కృతజ్ఞతలు

ఈ సిద్ధాంత వ్యాస రచనకు ప్రోత్సహించి వలసిన గ్రంథాలు, అమూల్యమైన సలహాలూ ఇచ్చి, నామీద అవ్యాజానురాగాన్ని ప్రదర్శించిన ప్రొఫెసర్ తూమాటి దోణప్పగారికీ,

క్షేత్రయ్య పదసంకలన గ్రంథమిచ్చి ప్రోత్సహించిన ప్రొఫెసర్ జి. ఎన్. రెడ్డిగారికీ,

క్షేత్రయ్యకు సంబంధించిన అనేకాంశాలు తెల్పి, ప్రవేశిక వ్రాసిచ్చిన శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారికీ,

కోరినంతనే తమ అభిప్రాయాలు తెల్పిన సర్వశ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు, తాండవకృష్ణ, మొవ్వ వేంకటకృష్ణారావు, కీ. శే. రెండుచింతల నాంచారయ్య, పసుమర్తి వేణుగోపాలశర్మ గార్లకూ,

పుస్తకాలిచ్చి సహకరించిన మిత్రులు సర్వశ్రీ యార్లగడ్డ బాలగంగాధరరావు, శ్రీనివాసచక్రవర్తి, కాటూరి విజయసారథి, మొవ్వరాజారావు గార్లకూ,

అన్నివిధాలా సహకరించిన మిత్రులు శ్రీ కొత్త దేశపతిరావు, ముఖపత్రరచనచేసిన మిత్రులు శ్రీ ఎమ్. కృష్ణమూర్తి గార్లకూ,

ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, డా. వి. ఎస్. కృష్ణమెమోరియల్ గ్రంథాలయం, వాల్తేరు, అధిపతులకూ,

బహుమతిద్వారా నాయీ గ్రంథ ప్రకాశనకు చేయూత నొసగిన సాహిత్య అకాడమీ వారికీ,

చక్కగా ముద్రించి ఇచ్చిన నాట్యకళ ప్రెస్ వారికీ,

నాకృతజ్ఞతలు.

హైదరాబాద్
సెప్టెంబర్ 1974. రచయిత

# ప్రవేశిక

క్షేత్రయ్య పదములను గూర్చిన డా. గంగప్పగారి యీ సిద్ధాంత గ్రంథము తెలుగు సాహిత్య రసికుల స్వాగతమునకు తగినది. ఇంతకుముందు ఎందరో యీ విషయమును చెదరు మదరుగా చర్చించినారు. వారిలో కీ. శే. విస్సా అప్పారావుగారి పరిశోధన గణనీయమైనది. ఆయా విమర్శలను అభిప్రాయాలను అన్నింటినీ సంగ్రహించి పరిశీలించి తమ యభిప్రాయాలను మోమోటములేక సవినయముగా వివరించింది గంగప్పగారి యీ రచన. ఇందులో నా యభిప్రాయాలను ఎక్కువగా గమనించి ప్రాయికంగా అంగీకరించినారు రచయిత. ఆ పక్షపాతము కొంత మితిని మీరిందనుకొన్నా తగును. ఈ విశ్వాసమునకు ప్రతీకారమే నా యీ ప్రవేశిక. అదీ వారి నిర్బంధవిశ్వాసమును కాదనలేక వ్రాసినదే.

క్షేత్రయ్య పదాల పరిశీలన యిప్పటికెంతో జరిగిందిగాని యింకా జరగవలసింది ఎంతో నిలబడింది. అతని రచనలోని సారమంతా శృంగారమే. మధురభక్తి యని, సగౌరవంగా మనం పేరొకొన్నా, అంతరార్థాలు పైకి తీసిచూపినా, దానిరూపరేఖలూ సౌరభమూ శృంగారందే. మరి నేటి పరిశీలకులు ఆ పరిధిని దాటి ఇతర విషయాలను ఎక్కువగా పరామర్శించ లేదంటే అది చింతనీయమైనా సహజమే. శ్రీ గంగప్పగారు ఇందు ఆధోరణిని కొంత మార్చుకొన్నారని సంతోషిస్తాను.

అసలు పదాల సంగ్రహణమూ, వివేచనమూ పూర్తిగా, తృప్తికరంగా సాగలేదనిపిస్తుంది. పిఠాపురం వారి ప్రచురణలో ఎక్కువ లెక్కగల పదాలున్నవట. నేను దానిని చూడలేదు. కాని "బొట్టు కట్టిన వాని యింటికి పోయివచ్చెద" అనే పదం ఆ సంగ్రహంలో ఉన్నదట [క్షే. ప. సా.- పు. 75]. అది 'వేణుగోపాల' ముద్ర గలది. ఆ ముద్ర సారంగపాణిది. దాని అర్థభావాలూ, భాషా క్షేత్రయ్య తలకు కట్టదగినవికావు. ఇది సహృదయవేద్యం. ఇట్లే పిఠాపుర సంకలనంలో ఉన్నవని గంగప్పగారుదాహరించిన [పు. 150, 173] "ఇద్దరి హృదయము లేకహృదయములైతే", "ఇంత విరహము? - పలుక వెరపగు" అనే రెండు పదములూ క్షేత్రయ్యవని భావించడం కష్టం. మొదటిదానిలో కంచివరదుడున్నాడు గాని మువ్వ గోపాలునికి చోటులేకపోయింది. రెండవ పదంలో స్పష్టమై తోచే మిశ్రజాతి-ఏడు మాత్రల నడకలో-శ్రీ వీరరాఘవుడూ, శ్రీ మువ్వ గోపాలుడూ బలవంతాన ఒత్తుకొని దూరి నిలచినారు! రెండు పదాల శైలీ, అర్థాన్వయాల సామరస్యం చాలనిదని పైచూపుకే తెలుస్తుంది. విస్సావారి కూర్పులోనున్న 'ఎవతెతాళునమ్మా' అనే అఠాణారాగ పదంలో అనుపల్లవిలో "సవతి మువ్వగోపాలు కెక్కువేమో" అని యతిలేని పాఠమూ, గ్రాంథికంగానూ, గ్రామ్యంగానూ గతిలేని 'గోపాలుకు' అనే ప్రయోగమూ, క్షేత్రయ్య రుచిమరగిన చెవికి కంటగింపులు. "సవతి గోపాల సామికెక్కువేమో" అని నా పరిచిత పాఠము. ఈ పదం కడపటి చరణంలోనూ 'మువ్వ' లేని గోపాలుడే కానవస్తాడు. గనుక ఇది క్షేత్రయ్యదే అనగలమా? అర్థభావభాష లేమో ఆతనికై వాడమే అనదగినంత సరసముగా నున్నది. కాని 'వరదగోపాల', 'రాజగోపాల' ముద్రలు గల పదాలు కొన్ని క్షేత్రయ్యను చక్కగా అనుకరించినవి వ్యాప్తిలోనున్నవి. "ఏలనే అలవాని చెలిమి", 'ఏ మాటలాడిన నీ మాటలే కాని', 'దారిజూచు

చున్నది నీదుప్రియ' మొదలైనవాటిని గమనించవచ్చును. పై అఠాణా పదం గూడా అట్టిదే కావచ్చునేమో! పైగా సావద్ది 1878-1879 వ్రాత కూర్పులలో ఈ పదం చేరలేదు.

చాలా యేండ్లక్రిందనే నేనుమధురకుపోయి అక్కడి సౌరాష్ట్ర సభవారి గ్రంథాలయములోని వ్రాతప్రతినుండి [B-46] అప్పటికి వ్యాప్తిలో లేని క్షేత్రయ పదాలు ఏడింటిని వ్రాసుకొని వచ్చినాను. ఆ ప్రతిలో వుండినవి 236 పదాలని నేను వేసుకొన్న గుర్తు. అన్నీ క్షేత్రయ్యవే అవునోకాదో ఇప్పుడు చెప్పలేను. ఆ యేడు పదాలలో నాలుగు పదాలు - 'మనవిసేయనేలే మగువా' [శంకరాభరణం - త్రిపుట]; 'రాయబార మంపినాడేమో రాను నేను రానుపొమ్మనవే' [శంకరాభరణం - చాపు]; 'చాలుచాలు యీ చిన్నెలతో నా సరస జేరకురా' [ముఖారి - ఆది]; 'ఎవ్వరి ననబనియేమున్నదమ్మలార' [ముఖారి-త్రిపుట] -అనేవి విస్సావారి సంకలనంలోవున్నవి. కాని చిన్నపన్న పాఠాంతరాలు గలవు. కొన్ని అసమంజసపాఠాలూ వున్నవి. ముఖ్యమైనవి ఒకటిరెండుదాహరిస్తాను.

'ఎవ్వరి ననబనియేమున్నది' అనేపదం ఝంపతాళమని విస్సావారి ప్రతిలో. కాని 'యేమున్నదమ్మలార' మొదలైన ఖండాలను పదిమాత్రల ఝంప తాళంలో తుదికేది సాధ్యమైనా అసహ్యంగా వినిపిస్తుంది. మధుర వ్రాతప్రతిలో దీనిది త్రిపుటతాళం. అదే సరియైనదని పాడేవారు గమనింపగలరు. ఈ పదంలోనే మొదటి చరణంలో 'మగువలందరు వాని చేలాంచలమునకాసించి' అని యున్నది. ఇక్కడ 'మగువలు' నాయికకు మిత్రద్రోహంచేసి నాయకుని వెలికి తీసినారు. వారికి నాయకుని 'చేలాంచలము' పై ఆశఅర్థంలేనిది. మధుర ప్రతి 'వానిచే లంచమున కాసించి' అని సరస పాఠమిచ్చింది.

దీనివల్ల విస్సావారు మధురప్రతిని చూడలేదని తేలుతుంది. మరి పిఠాపురం కూర్పులో ఈ పదాలు చేరించే అందలి పరిశోధన యింతకంటే మేలై యుంటుందని ఊహించేది కష్టం.

మధురప్రతినుండి నేను వ్రాసుకొన్న మరి మూడు పదాలను ఇక్కడ పూర్తిగా ఉల్లేఖిస్తాను. ఇతర సంగ్రహణాలలో ఇవి చేరిన వేమో, పాఠాంతరాలున్న వేమో, పరిశీలించవచ్చును.

(౧) సావేరి రాగం - ఆదితాళం.

ప. మగువ ఊరు దూరమైతే-మనసు దూరమా,

అ. తగవు మాలినదైవము-పగసాధించితే నేమాయ॥

చ. (i) కూడియాడి యుండలేదా-కోరిక లీడేర్చలేదా,
జోడుగూడి కొన్నాళ్లైనా-సొగసు మీరినదే చాలు॥

(ii) సొక్కిసోలి యుండలేదా-సురత పనులీడేర్చలేదా
మక్కువ కొన్నాళ్లైనా-మనసుగూడినదేచాలు॥

(iii) కలసిమెలసి యుండలేదా-కౌగిట జేర్చుకోలేదా,
చెలియ మువ్వగోపాలుడు-చేరికూడినదే చాలు॥

(౨) బిలహరి - త్రిపుట.

ప. పొయ్యేనంటాడా నాసామి పోపొమ్మనవే

అ. అయ్యయ్యో యెవరు వద్దన్నారో అవురా తన
వుద్ధరింపు॥

చ. (i) వెరచేనంటాని మెల్లని వింతలు సేయ వచ్చినాడా,
తరుణి తా తనకంటె కోపచారులే యువతలివారు॥

(ii) ఇంత పైపై యున్నవాడు ఇంటికి మునుపు
రాన్యాలే
ఇంతి తానుండేనన్నాగాని ఇక నాకు సైసదుపోవే॥

(iii) నేడు దెలిసె మువ్వ గోపాలు రీతిగాదుర నన్నెపుడు
కూడితే నీతో కూడేనని ఆడే మాటలింతగాదు॥

(౩) మోహన - [తాళం వ్రాయలేదు].

ప. ముద్దు-కులుకుచు నడిచే చిలుకల కొలికీ పలుకవె
నాతోను

అ. నిలిచి నిలిచి తలవూచుచు మెల్లన అలివేణి
మదహస్తి వలెనే॥

చ. (i) భామలు గుంపులు గుంపులు గూడుక బ్రమసి
చూడను ఓ
కోమలిరో నీ సొగసు పయ్యెద కొంగు విసరగను,
కాముని బాణముబోలు నీ కడ గంట చూచుచును
రామ పున్నమ చంద్రుని వలె యీ రాతిరివేళను॥

(ii) కాళ్లనందెలు గజ్జెలు గొలుసులు - ఘల్లుఘల్లు
మనగా, పది
వేళ్ల కెంపుటుంగరములు వెలుగగఇరుగడల, వేయి
మాళ్లు నీకిచ్చేనని విటులు వెంబడి తిరుగగను॥

(iii) శంకరాభరణ రాగమున సంచున బాడుకొని
శంక లేక నడివీధిలో చిటికలు జడియక వేయగను,
ఇంతకు మువ్వగోపాలుని గుణములు ఎంచదగనో॥"

ఈ మూడు పదాలూ సంస్కారసాపేక్షములు. ముఖ్యముగా
౩ వ పదం. దాని ౨-౩ చరణాలలో ఒక్కొక్క పంక్తే లోపించిందని

తో స్తుంది. ఇవి కన్నదికన్నట్లు వ్రాసుకొన్నవి. 3 వ దాని 3 వ పంక్తియంతూ ఏమీ అతుకదు. వ్రాతప్రతులు నమ్మి దొరకినట్లు అచ్చువేయుట సంపాదకుని పనిగాదు; నకలు వ్రాయువానిదది. మూలమును కవి, భాష, సంకేతం, సంప్రదాయం మొదలైన వాటిని గమనించి అవిరుద్ధముగా సంస్కరించేది సంపాదకుని ధర్మం, కర్మం ఇంతవరకూ వెలువడిన పదాల కూర్పులలో ఆ విధమైన సంపాదింపు కావలసినంత చాలదనిపిస్తూందనక తప్పదు.

ఈ సందర్భం పురస్కరించుకొని చాల కాలంక్రింద నేను మైసూరులోని ఒక సంగీతవిదునిచే విని గుర్తు చేసుకొన్నదీ, ఇందాకా అచ్చులో నాకంటపడనిదీ అయిన యీ క్రింది పదమును ఇక్కడ వ్రాసి పెట్టుతాను. లభించినది పల్లవి, అనుపల్లవి ఒక చరణం మాత్రమే. తక్కిన చరణాలను రసికపరిశోధకులు సంపాదించే ప్రయత్నం చేయుదురుగాక. ఇది మేలుకోట చెలువరాయస్వామి మీదిది.

నీలాంబరి – త్రిపుట తాళం.

ప జలజనేత్రి విరహ వేదన, పలుకనోరాడదురా,

అ. చెలులు కనుగొని మూర్ఛపోయిరి, చెలువరాయడ
మువ్వగోపాల ॥

చ. నిలదు జీవము మారుబారికి, ఘనుడ నీకిది మేరగాదుర,

అలదాని వార్తలివిగో, అవల నీదయ దాని భాగ్యము;
అది యోగ్యము ॥ జలజ ॥*

క్షేత్రయ పదాల మూల స్వరూపాన్ని నిర్ణయించి పరిష్కరించేది సామాన్య కార్యంకాదు. అవిటిరాగాల లాక్షణిక రూపాలు, ధాతుఖండాల అచ్చుకట్లు, భాషలోని జాతీయాలు, భావార్థాల

---

* దీని ధాతువు నాకబ్బినది ఇట్లున్నది –

ప॥ ౘౘౘ ససని। సమగ రి గా మా॥ గమ పా మా। గమ గ రి రి పమా॥
జలజనే త్రి వి ర హా వే ద న
॥ ౘౘౘ మ గ మ । పా ౘౘ పా మగ ॥ రి గ రి ప మ గ। రి ప మ గ రి గా స॥
పలుకనో రా డ దు రా

అ॥ ౘౘౘ స స స । సాసాసాసా ॥ సా ౘౘ స ని । ధ ని స ని ప ధ మా
చెలులు కనుగొని మూర్ఛ పో యిరి
॥ ౘౘౘ మ గ మ । పానిధధపమా ॥ మాగపమ। మగరిపమగగస॥
(ౘౘౘ జలజ)

చెలువరా యడ మువ్వ గోపా ల

చ ॥ ౘౘౘ ససరి । సా ౘౘ స ని స ॥ సామ గ మా । మ గ మ రి రి ప మా ॥
ని లధు జీ వ ము మా రు బా రి కి
॥ ౘౘౘ మ గ మ । పా ౘౘ ప మ గా॥ రి గ రి ప మ గ । రిపమగరిగసా॥
ఘ ను డ నీ కిది మేర గా దు ర
॥ ౘౘౘ స సా । సా ౘౘౘౘ స ని ॥ సా ౘౘ స ని । ధ ని స ని ని పపా॥ ౘౘౘ
మగమ । పానిధ ధధపమా॥
అల దా ని వా ర్త లివిగో అవలనీదయ
॥మ గ మ ద ప మ।మ గ మ గ గ రి ప మ॥ ౘౘౘౘౘ । మ గ గా ౘ గ మా॥
దా ని భా గ్య ము అది
॥ పా ని ప మ గ । రి ప మ గ గా ౘ స॥ (ౘౘౘ జలజ)
యో గ్య ము

యేర్పాట్లు, తాళాలకు వాటితోడి పొందికలు, బహుప్రియావ్రతం గల ఆ కాలపు శృంగారోపాసకుల సహవాసంలో స్త్రీల సుఖదుఃఖాలు ఆపసోపాలు, విప్రలంభ-ప్రలంభాల విషయంగా - కవుల ఉపకారం కొరకు-ప్రాచీన లాక్షణికులు చేసిపెట్టిన సాంకేతిక సమయాలు - ఈ అన్నిటా క్షేత్రయ్య చూపిన ప్రతిభను, చేసిన మార్పులనూ గమనింపగలిగిన లక్ష్య వ్యుత్పత్తి ఆ పని కావశ్యకం. వట్టి రక్తిగాని, భక్తిగాని చాలదు.

శ్రీ గంగప్పగారు పై విషయాలన్నిటా ఎంతో విరివిగా పరిశ్రమ చేసినారనుట పునరుక్తి. ఇంతటితో చాలుచేసుకోక ఇంకా విపులంగా లోతుగా క్షేత్రయ్య సూక్తులను అప్పటి-తరువాతి పద సాహిత్యంలో కలిగిన పెంపుమంపులను పరిశోధించి చూపగలరని నాయాశ, నా యాశంస.

శ్రీ గంగప్పగారి ఈ గ్రంథాన్ని ఉత్తమమైనదిగా ఎన్నిక చేసి బహుమతినిచ్చి, ముద్రణమునకై చాలా సహాయపడిన ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారు గుణపక్షపాతమునకై ఔదార్యమునకై అభినందనార్హులు.

బెంగుళూరు
30 - 9 - 1974

(సం) **రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ.**

# అవతారిక

0.1 క్షేత్రయ్య పదసాహిత్యాన్ని గూర్చిన సమగ్ర పరిశోధన ఇంతవరకు జరగలేదనే చెప్పాలి. మొట్టమొదట క్షేత్రయ్యను పరిచయం చేసినవారు సుబ్బరామదీక్షితులు; పరిశోధించి వివరించిన; వారు విస్సా అప్పారావుగారు; తమ గ్రంథాల్లో ప్రస్తావించినవారు చాగంటి శేషయ్య, బాలాంత్రపు రజనీకాంతరావు, ఆరుద్రగార్లు; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు కొన్ని ఉపన్యాసాలను సంపుటీకరించారు; ప్రకటిత వ్యాసాల్లో శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారి వ్యాసం మిక్కిలి విలువైంది. క్షేత్రయ్య సంగీతాభినయాల్ని గూర్చి కృషిచేసినవారు మంచాళ జగన్నాథరావు, నటరాజ రామకృష్ణ గార్లు. అయినా క్షేత్రయ్య పదసాహిత్య సంబంధి వివిధాంశాలు సమగ్రంగా విస్పష్టం చేయబడలేదు.

0.2 పైలోటును తీర్చడానికి ఉద్దిష్టమైనదే ఈ సిద్ధాంత వ్యాసం. మొదటి ప్రకరణంలో క్షేత్రయ్య జీవిత తత్వాన్ని తెలిపి, అతని జీవితం రక్తి, మధురభక్తులతో ద్విధావిభక్తమైన రహస్యాన్ని సిద్ధాంతీకరించడం జరిగింది.

రెండో ప్రకరణంలో పదకవితావిర్భావ వికాసాలు స్పష్టంచేయబడ్డాయి. ఇది క్షేత్రయ్య పదసాహిత్య పరిశీలనకు నేపథ్యంగా ఉపకరించగలదు.

మూడో ప్రకరణం ఈ వ్యాసానికి హృదయస్థానం. ఇందులో మహాకావ్యశిల్పికి తగిన లక్షణాలతో పాటు ప్రతిభావ్యుత్పన్నతలనూ, నిసర్గమనోజ్ఞమై, తియ్యందనాలతో ఒప్పు తెలుగు నుడికారపు సొంపులతోనూ కూడిన భాషా మర్మజ్ఞతలనూ సోపపత్తికంగా నిరూపించి, క్షేత్రయ్య పదసాహిత్యచక్రవర్తిత్వం స్థాపించడం జరిగింది.

శృంగారం, మధురభక్తి రెండు ఎలా సమ్మిళితమై క్షేత్రయ్య పదాల్లో చోటు చేసుకొన్నాయో తెలిపి, క్షేత్రయ్య మధురభక్తి తత్వం వివరించబడింది నాలుగో ప్రకరణంలో.

ఐదో ప్రకరణం క్షేత్రయ్య సంగీతాభినయాల వివరణకై ఉద్దేశించబడింది.

పై ఐదు ప్రకరణాలలోని సుదీర్ఘవిషయ సింహావలోకనమే ఆరో ప్రకరణం.

0.3 నా ఈ వ్యాసరచనకు 'శిష్టవ్యావహారికభాష'ను ఎన్నుకొన్నాను. ఉపయుక్త గ్రంథ సూచికలోనే ఆయా రచయితల నామ సంకేతాలివ్వబడ్డాయి. అధోజ్ఞాపిక [Foot notes]ల్లో మొదటి అంకె తరువాత మరో అంకె ఉంటే, ఏకకర్తృకాలైన అనేక గ్రంథాలలోని ఆ గ్రంథాన్ని సూచిస్తుంది. స్వీ, ప, సా; 1,2,3 ల తరువాత సంఖ్యలుంటే స్వీయ, పరకీయ, సామాన్యలను, అందులోని పదసంఖ్యలను తెలుపుతాయి.

0.4 ఈ సిద్ధాంత వ్యాసంలో క్షేత్రయ్య జీవితానికి, ఆతని పదాలకు సంబంధించిన అనేక అజ్ఞాత విషయాలను అన్వేషించి ఆవిష్కరించడం జరిగింది. విశేషించి క్షేత్రయ్య మహాకావ్య శిల్పి, మధురభక్తి భాష్యకారుడూ, ఇతర వాగ్గేయకారులకు మార్గదర్శి అయిన విధం విశదీకరించడంలో మౌలికతనిరూపితం!.

రచయిత

# ఉపయుక్త గ్రంథాలు

**తెలుగు గ్రంథాలు :—**


1. అ. అక్షరార్చన: డా. పాటిబండ మాధవశర్మ షష్టి పూర్తి సమ్మాన సంచిక - 1966

2. అ. కృ. శ. రా.— అనంతకృష్ణశర్మ, రాళ్లపల్లి : వేమన—1945

3. ” ” : సారస్వతాలోకము - 1956

4. అ. తా. — అన్నమయ్య, తాళ్లపాక : శృంగార సంకీర్తనములు — సం 1-10. (1947)

5. అ. పో. శ్రీ.- అప్పారావు, పోణంగి, శ్రీరామ : నాట్యశాస్త్రము - 1959

6. ” ” : తెలుగు నాటక వికాసము - 1967

7. అ. వి.-అప్పారావు, విస్సా : క్షేత్రయ్య పదములు - 1950

8. ” ” : వ్యాసావళి — 1956

9. ” ” : నృత్య, సంగీత వ్యాస రత్నావళి - 1966

10. ఆ. ఆరుద్ర : సమగ్ర ఆంధ్ర సాహిత్యం - సం. 10, 11. (1967)

11. ఆం. గా. ప -ఆంధ్రగాన కళాపరిషత్; రాజమండ్రి : త్యాగరాజకీర్తనలు - 1948

12. ” ” : సారంగపాణి పదాలు –

12A ఆం. చ. -ఆంధ్రచంద్రాలోకము

13. ఆం. ప. – ఆంధ్రపత్రిక - 1940-65

14. ఆం. ప్ర. - ఆంధ్రప్రభ –

15. ఆం. ప. ప. - ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక - 1922-38

16. ఆం. సా. అ - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ : సాహిత్యోపన్యాసములు - 3 క్షేత్రయ్య పదసాహిత్యము—1963

17. ” ” : దక్షిణభారత సాహిత్యములు - 1962

18. ” ” : సారస్వతవ్యాసములు - సం.1 -1969

19. ” ” ” - సం.3 -1969

20. ” ” ” - సం.4 -1971

21. ఆం. సా. ప. – ఆంధ్రసారస్వత పరిషత్తు : తెలుగులో పద కవిత — 1973

22. ఏ. రా. - ఏకాంబరేశ్వరరావు: క్షేత్రయ్య—నవల 1671

23. కి. – కిన్నెర – 1949 – 54

24. కు. బి. – కుమారస్వామి, బి. : క్షేత్రయ్య పదములు – స్వర సాహిత్యములు – 1968

25. గు. ప్ర. – గురుబాలప్రబోధిక – 1953

26. గో. కృ. వ. – గోపాలకృష్ణయ్య, వడ్లమూడి : శృంగార పదములు – 1972

27. ” ” : శ్రీ గీతగోవిందము, శ్రీగీత శంకరము — 1972

28. ” ” : జానుతెనుగు - 1972

29. గో. కూ. వే. - గోపాలస్వామి, కూర్మా, వేణు: తెలుగు వాఙ్మయము—సంగ్రహచరిత్ర — 1960

30. జ. మం. — జగన్నాథరావు, మంచాళ : స్వరకల్పన-క్షేత్రయ్య పదములు [ఆం. గా. ప.] 1954

31. ” ” : క్షేత్రయ్య పదములు [ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ] 1973.

32. జో. రా. ఎ. — జోగారావు, ఎస్వీ : ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర - 1961

33. తి. తా. చి. — తిరుమలయ్య, తాళ్లపాక, చిన : సంకీర్తన లక్షణము — 1935

34. ధ. రా. తా. — ధర్మారావు, తాపీ : సాహిత్య మొర్మొరాలు - 1971

34A. న. — నన్నెచోడుడు: కుమారసంభవము — 1968

35. న. కుం. వేం. — నరసయ్య, కుందుర్తి, వేంకట నవవిధ భక్తులు — 1962

36. న. కా. వేం. —నరసింహం, కాకర్ల, వేంకట : దక్షిణాంధ్ర యుగ వాఙ్మయ చరిత్ర — 1955

37. నా. రా. కా. - నాగేశ్వరరావు, కాశీనాథుని : ఆంధ్ర వాఙ్మయ సూచిక - 1926

38. నా. క. - నాట్యకళ 1967, '68, '73, '74.

39. నా. పు. - నారాయణాచార్యులు, పుట్టపర్తి : ప్రబంధ నాయికలు — 1944.

40. నా. రె. సి. — నారాయణరెడ్డి, సి.: ఆధునికాంధ్ర కవిత్వము

41. పో. - పోతన : శ్రీమదాంధ్ర మహాభాగవతము - సప్తమ దశమస్కంధాలు - 1968

42. ప్ర. శా. వే.- ప్రభాకరశాస్త్రి, వేటూరి: తంజావూరి ఆంధ్ర రాజుల చరిత్ర — 1914

43. " " : చాటుపద్యమణి మంజరి - 1922

44. " " : మీఁగడ తఱకలు - 1951

45. " " : సింహావలోకనము - 1955

46. " " : అన్నమాచార్య చరిత్రపీఠిక-1966

47. " " : సుభద్రా కల్యాణము -

48. బా. రా. అ. - బాపిరాజు, అడవి : నారాయణరావు (నవల) 1967

49. భ. రా. చ. - భద్రాచల రామదాను చరిత్ర -

50. భా. - భారతి - 1949, '64, '73

51. మా. ప్ర. — మాణిక్య మొదలారిప్రతి— క్షేత్రయ్య పదములు — 1886

52. యా. శి. ప్ర — యార్లగడ్డ శివరామ ప్రసాద్ బహద్దర్ షష్ట్యబ్ది పూర్తి సమ్మానసంచిక — 1966

53. ర. రా. బా. — రజనీకాంతరావు, బాలాంత్రపు : ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము — 1958

54. రా. కృ న. — రామకృష్ణ, నటరాజ : ఆంధ్రులు—నాట్యకళ

55 రా. మూ. మి.— రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని : ఆంధ్ర నాటకరంగ చరిత్ర — 1969

56. రా. రా. దే. — రామానుజరావు, దేవులపల్లి : సారస్వత నవనీతము — 1955

57. రా. రా. బి.-రామరాజు, బిరుదురాజు: తెలుగు జానపద గేయ సాహిత్యము-1958

58. రా. రా. భూ -రామరాజభూషణుడు: వసుచరిత్ర- 1954

59. రా. సు. మ.-రామసుబ్బయ్య, మట్టిబోయిన: బ్రహ్మ జిజ్ఞాస-1969

60. ల. పిం.-లక్ష్మీకాంతం, పింగళి: పల్నాటి వీరచరిత్ర- 1961

61. ,, ,, : గౌతమవ్యాసములు - 1964

62 ,, ,, : సాహిత్య శిల్పసమీక్ష —1966

63. ,, ,, : ద్విపద భారతము

64. ల. రం. ఖం.-లక్ష్మీరంజనం, ఖండవల్లి: ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము—1965

65. వ. ధ.-వరదాచార్యులు, ధనకుధరం: ఆళ్వారులు దివ్య ప్రబంధములు—1970

66. వ. మ.-వసుంధర, మల్లాది: తంజావూరు పతనము —1967

67. వా. ప్ర.-వావిళ్లప్రతి: క్షేత్రయ్యపదములు— 1950

68. వి. స. విజ్ఞాన సర్వస్వము: తెలుగు సంస్కృతి సంపుటి-3 1959

69. వేం. క చే -వేంకటకవి, చేమకూర: విజయవిలాసము—1966

70. వేం. నే.-వేంకటరమణయ్య, నేలటూరి: మధుర తంజావూరి నాయక రాజులనాటి దక్షిణాంధ్ర వాఙ్మయ చరిత్ర

71. ,, ,, : వాఙ్మయ వ్యాసమంజరి— 1967

72. వేం. ది.- వేంకటావధాని, దివాకర్ల: ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము—1967

73. వేం. ది.-వేంకటావధాని, దివాకర్ల: సాహిత్య సోపానములు—1970

74. వేం. రా. కా. -వేంకటేశ్వరరావు, కాటూరి: మువ్వగోపాల నాటిక—1961

75. వేం. ని.-వేంకట్రావు, నిడదవోలు: రాజగోపాల విలాసము—1951

76. ,, ,, : దక్షిణదేశీ యాంధ్రవాఙ్మయము—1960

77. ,, ,, : ఉదాహరణ వాఙ్మయ చరిత్ర —1968

78. శే. చా.- శేషయ్య, చాగంటి: ఆంధ్రకవి తరంగిణి సం. 6,7,8 —1961

79. శ్రీ.-శ్రీనాథుడు: క్రీడాభిరామము —1953

80. ,, ,, : భీమఖండము —1958

81 శ్రీ. చ.-శ్రీనివాసచక్రవర్తి: క్షేత్రయ్యపదాలు —1966

82. సం. ఆం. వి.-సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము సం. —3

83. స కొ.- సత్యవతి, కొక్కొండ: తంజాపురాంధ్ర సాహిత్య చరిత్ర—1965

84. స నా. యం -సత్యనారాయణ, యండమూరి, 'శ్రీవాత్సవ' శారదా ధ్వజము—1965

85. సా. వా. -సాహిత్య వాల్లభ్యము: ముళ్ళపూడి తిమ్మ రాజుగారి అభినందన సంపుటి—1968

86. సీ. కు.- సీతారామయ్య, కురుగంటి: తంజావూరు ఆంధ్ర నాయక రాజుల చరిత్ర—1932

87. సీ. గి. వేం.- సీతాపతి, గిడుగు, వేంకట: క్షేత్రయ్య పదములు—1952

88 సీ. రా. తు -సీతారామరావు, తుమ్మలపల్లి: దక్షిణ దేశము లో నాట్యము—1956

89. సీ. రా. బ -సీతారామాచార్యులు, బహుజనపల్లి: శబ్ద రత్నాకరము—1969

90 సుం. ఆర్. వి, ఎస్ - సుందరం, ఆర్. వి ఎస్: తెలుగు సాహిత్యంలో దేశికవిత—1970

91. సు. దీ -సుబ్బరామదీక్షితులు: సంగీత సంప్రదాయ ప్రదర్శిని—1973 [ప్రథమ ముద్రణ-1904]

92. సు ము.-సుబ్రహ్మణ్యకవి, మునిపల్లె: అధ్యాత్మరామాయణ కీర్తనలు

93 సూ. మూ. జో.- సూర్యనారాయణమూర్తి, జోస్యుల: క్షేత్రయ్య—1968

94. ,, ,, : అన్నమయ్య ,,

95. ,, ,, : త్యాగయ్య ,,

96. సూ. శా. స.-సూర్యనారాయణశాస్త్రి, సన్నిధానం: కావ్యాలంకార సంగ్రహము—1959

97. సో. పా.-సోమనాథుడు, పాల్కురికి: బసవపురాణము—1952

98. ,, ,, : పండితారాధ్య చరిత్రము

99. సో. శ. మ.-సోమశేఖరశర్మ, మల్లంపల్లి: రఘునాథ నాయకాభ్యుదయము

100 స.-స్రవంతి —1958

101. హ. పి. వేం -హనుమంతరావు, పిల్లలమర్రి, వేంకట: సాహిత్య సమాలోచనము—1946

## సంస్కృత గ్రంథాలు :

102. జ.-జయదేవుడు: గీతగోవిందము

103. నా. తీ.-నారాయణతీర్థులు: కృష్ణలీలాతరంగిణి

104 భ. గీ.-భగవద్గీత—1966

105. భ. ము.-భరతముని: నాట్యశాస్త్రము—1967

106. లీ.-లీలాశుకుడు: శ్రీకృష్ణకర్ణామృతము

107. శా. దే.-శార్ఙ్గదేవుడు: సంగీత రత్నాకరము

## ఆంగ్ల గ్రంథాలు:

108. A. I. T. - An Alphabetical Index of Telugu manuscripts in the oriental manuscripts Library, Madras - 1932.

109. A. O. M. - Annals of oriental Research, University of Madras - 1941.

110. Au. - Aurobindo :- The Foundations of Indian Culture.

111. D. C. T. - A Descriptive Catalogue of the Telugu Manuscripts in the Tanjore Surphoji's Saraswati Mahal Library - 1933.

112. G. B. - Goswamy, Bhagavat Kumar: - Bhakticult in Ancient India - 1922.

113. G. O Goswamy, o : The story of Indian Music 1961.

114. J. A. S. Journal of Andhra Historical Research Society, Rajahmundry-

115. J. M. A. Journal of the Music Academy of Madras 1955 -'68.

116. J. V. I. Journal of Venkateswara Oriental Research Institute, Tirupati - 1950.

116 (A) K. V. R.-Prof : K. V. Ramaswamy Ayyangar commemoration volume - 1940.

117. L. V. M. List of Villages of Madras Presidency-1924.

118. M. R. G. Moulton, R. G.: Methods and Materials of Literary Criticism.

119. ,, ,, The Modern study of Litereture- 1915.

120. P. I. C. Proceedings of India Philosophical Congress - 1953.

121. R. S. A. Rangaswamy Aiyangar Commemoration Volume -1940.

122. R. V. Raghavan, V : The Great Integrators Saint singers of India - 1966.

123. S. C. S. Srinivasachari, C. S : History of Gingi and its rulers

124. S. G. V. Sitapati, G. V. : History of Telugu Literature - 1968.

125. S. M. P. Sambamurty, P:South Indian Music. Parts 1, 2, 3, 4- (1935).

126. ,, ,, Syamasastry and other famous figures of South Indian Music - 1934.

127. V. G. V. Vridhagirisan, V : The Nayaks of Tanjore -1942.

128. V. K. C. Varadachari, K. C. : Alwars of South India-

129. ,, ,, : Bhakticult in South India - 1957

ఇతర గ్రంథాలు :

130. ప్ర. క.—ప్రబుద్ధ కర్ణాటక—(కన్నడం)1952, 1964—65.

131. రా. చౌ.—రామస్వార్థ చౌధరి : మధురరస్—స్వరూప్ ఔర్ వికాస్ (హింది)

132. వి. ప.—విద్యాపతి పదావళీ — ఏక్ అధ్యయన్ (హిందీ)

# క్షేత్రయ్య జీవిత సంగ్రహం

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం।
ఏకమాపాత మధురం అన్యదాలోచ నామృతమ్ ॥"

అంటే సంగీత సాహిత్యాలు సరస్వతీదేవి స్తనాల జంట; మొదటిదైన సంగీతం విన్న వెంటనే ఆనందాన్ని కలిగిస్తుంది; రెండోదైన సాహిత్యం ఆలోచించినకొలదీ అమృతమయాలైన అర్థ ఫలాల్నిస్తుందని అర్థం. పై శ్లోకంలో స్పష్టం చేయబడినట్లు సంగీత సాహిత్యాలకు ప్రతీకలైన సరస్వతీదేవి రెండు స్తనాలను గ్రోలిన దిట్ట రామరాజభూషణుడని శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు చక్కగా స్పష్టంచేశారు.[1] "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసంఫణీ"-అంటే శిశువులు, పశువులు, పాములు సైతం విని ఆనందించదగినది గాన రసం. అట్టి గాన మర్మమెరిగినవాడు రామరాజభూషణుడు. అందుకే "సంగీత కళారహస్య నిధి"నని అతడే చెప్పుకొన్నాడు.[2] ఇలా సంగీతంలోనేగాక సాహిత్యపు టవధుల్ని చూచిన రామరాజ భూషణుడు తెలుగు కవులలో మేటి. కాని అంతకంటే మరో మెట్టు

---

1. నా. పు.—పుట ౭.
2. రా. రా. భూ. ప్రథమాశ్వాసం — ప 16.

ముందుకు కరిగినవాడు క్షేత్రయ్య. సరస్వతీదేవి రెండు స్తనాలను గ్రోలి సంగీత సాహిత్యాలను బాగా జీర్ణించుకొని అభినయంలో గడితేరినవాడు క్షేత్రయ్య. అంటే సంగీత సాహిత్యాలకు అభినయం జోడించి రాణించిన మహా రసికావతంసుడైన భక్తాగ్రేసరుడు క్షేత్రయ్య. రసరాట్టు శృంగారం. శృంగారాధి దేవత శ్రీకృష్ణుడు. అట్టి శ్రీకృష్ణుని తన పద కవితా మూలంగా ఆరాధించి, తరించిన ధన్యజీవి క్షేత్రయ్య. అట్టి క్షేత్రయ్యకూ, క్షేత్రయ్య పదకవితకూ తెలుగు సాహిత్యంలో ఒక ప్రత్యేక స్థానముందంటే అత్యుక్తికాదు. పదకవితా చక్రవర్తి అయిన క్షేత్రయ్య పదకవితా స్రవంతిని తెలుగు కేదారాల్లో ప్రవహింపజేసి ఆనందాపాది అయిన పంటలు పండించి తరించాడు. అట్టి క్షేత్రయ్య పదకవితా వైశిష్ట్యం ఎంతటిదో, తెలుగు సాహిత్యానికి అతడు గావించిన సేవ ఎలాంటిదో పరిశీలించడమే ప్రస్తుత సిద్ధాంత వ్యాసోద్దేశం.

క్షేత్రయ్య పదాల సంగీత సాహిత్యాభినయాల వైశిష్ట్యం పరిశీలించే ముందు అతని జీవితచరిత్ర క్లుప్తంగా తెలుసుకోవడం అవసరం. క్షేత్రయ్య జీవితచరిత్రకు తగిన చారిత్రకాధారాలు తక్కువ; ఊహాపోహలే ఎక్కువ. క్షేత్రయ్యనుగూర్చి ప్రప్రథమంగా చెప్పినవారు సుబ్బరామ దీక్షితులవారు.[3] మిక్కిలి పరిశోధించి జీవిత విశేషాల్ని వివరించిన వారు శ్రీ విస్సా అప్పారావుగారు.[4] వీటిని సమన్వయించి చెప్పినవారు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు.[5] కానీ విస్సా వారికి ముందే శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు క్షేత్రయ్య జీవిత విశేషాలను, పదకవితనుగూర్చి రాసిన వ్యాసం

3. సు. దీ.—పు. 9, 10. 4. 7. అ. వి. పీఠిక. పు. 1—34.

5. ర. రా. బా.—పు 225-256.

చాల విలువైంది.[6] క్షేత్రయ్య జీవితాన్నిగూర్చి రాళ్ళపల్లి వారు చెప్పిన విధమే చాలవరకు సబబుగానూ, సర్వజనామోద యోగ్యం గానూ ఉందనడానికి సహృదయాలే సాక్షి. తదనుగుణంగా, నేను గావించిన పరిశీలనా, పరిశోధనల మూలంగా, క్షేత్రయ్య జీవిత చరిత్రను సంగ్రహంగా, సోపపత్తికంగా చెప్పడానికి ప్రయత్నిస్తాను.

## 1. 1 క్షేత్రయ్య-నామం :

ఈ నాడు 'క్షేత్రయ్య పదా'లని ప్రసిద్ధికెక్కిన పదాలను రచించిన వాగ్గేయకారుని అసలు పేరేమిటో స్పష్టంగా తెలియ రాలేదు. క్షేత్రయ్యనుగూర్చి మొట్టమొదటిసారిగా లోకానికి తెలిపిన సుబ్బరామ దీక్షితులవారు 'క్షేత్రజ్ఞులు. ఇతడు తైలింగ్య బ్రాహ్మణుడు'.అని తెలిపి 'క్షేత్రయ్య' అనిగూడా పేర్కొన్నారు.[7] 1886లో అచ్చైన మాణిక్య మొదలారి ప్రతిలో "మువ్వ గోపాలపదంబులని పేర్కొనంబడుచున్న క్షేత్రయ పదంబులు" అని గలదు. పి. పి. ఎస్. శాస్త్రిగారు 1933 లో "క్షేత్రయ్య" అనే చెప్పారు.[8] ఆ కేటలాగు లోనే "429. క్షేత్రయ్య పదములు [Kshetrayya Padamulu]"[9] అనిఉంది. అంటే 'క్షేత్రయ్య' అన్నదప్పటికే వ్యవహారంలో ఉండేదని విశదమవుతుంది. కానీ 1932సం. వ్రాత ప్రతుల అకారాది పట్టికలో మాత్రం "మువ్వ గోపాల పదము"లని మాత్రమే పేర్కొనబడింది[10] అంతకు ముందే 1926 లో కాశీనాథుని నాగేశ్వరరావుగారు "క్షేత్రయ్యగారి మువ్వ గోపాల పదము"లనే రాశారు.[11] ప్రా. సాంబ

---

6. ఆ. కృ. శ. రా.—ఆం. ప-చిత్రభాను సంవత్సరం (1942-'43)
7. సు. దీ.—పు. 8.
8. D. C. T. — Introduction — P. viii.
9. పైదే. 10. A. I. T.-
11. నా. రా. కా.—పీఠిక—పు. 95

మూర్తిగారు 1934 లో "క్షేత్రజ్ఞ" అనే వాడారు.[12] 1938 లో టి. ఎస్. వాసుదేవన్‌గారు "క్షేత్రయ్య" అనే పేర్కొన్నారు.[13] వృద్ధ గిరీశన్‌గారు 1942 లో "క్షేత్రజ్ఞ" అనే వ్యవహరించారు.[14] చాల పూర్వుడైన మండ లక్ష్మీనరసింహ కవి తన (అముద్రిత) ఆంధ్ర కౌముదిలో "మువ్వ గోపాల భక్తేన క్షేత్రజ్ఞకవి నా ఉక్తత్వాచ్చ"—అని ఉల్లేఖించినట్లు తెలియవస్తూంది. ఈ మండ లక్ష్మీ నరసింహ కవి క్రీ. శ. 1700 ప్రాంతం వాడని నిడదవోలు వారు తెల్పి, సంస్కృతంలో రచించిన అతడు "క్షేత్రయ్య"నే "క్షేత్రజ్ఞ" అని పేర్కొన్నాడనీ,సుబ్బరామదీక్షితులు గౌరవార్థం "క్షేత్రజ్ఞులు" అని వ్యవహరించారనీ నిర్ణయించారు.[15] అంటే క్షేత్రయ్య కాలం నుంచీ సైతం "క్షేత్రజ్ఞ" పదం ప్రయోగంలో ఉండేదని స్పష్ట మవుతుంది.

అనేక పుణ్యక్షేత్రాల సందర్శనంవల్ల క్షేత్రయ్య కీ పేరు కలిగినట్లు తెలుస్తూంది. "అట్లు పలుక్షేత్రములలో ప్రత్యక్షమగుచు పదములు పాడుచుండుటచేత ఇతనికి అసలుపేరుపోయి "క్షేత్రయ్య" అను పేరాయెనట." "కాని ఇతని అసలు పేరేమో యే కథయును, ఎవరును ఇప్పటికి చెప్పలేదు. వీరభద్రుని పేరుగా "క్షేత్రపాలయ్య" అని కొందరు అపురూపముగా పేరుంచుకొనుట కలదు.దాని సంగ్రహము "క్షేత్రయ్య" ఐనను కావచ్చును. కాని అరవదేశ మందితనికి వాడబడు "క్షేత్రజ్ఞుడు" అను పేరు మాత్రము తెలుగువారి శక్తికి, రక్తికిమించిన మడిని గట్టుకొన్నది. అసలుపేరు ఇట్లు ఆనుషంగికముగా మఱుగుపడుట ఆశ్చర్యమేమియును కాదు. తానె కంఠోక్తముగా

12. 126. S. M. P.—P. 87.
13. Karnatak Composers—Madras University Magazine-1938.
14. V. G. V.—P. 160.
15. వేం ని.—భా. (సెప్టెంబరు 1963) పు. 7, 78.

చెప్పుకొన్నను భవభూతిని "శ్రీకంఠయ్య"గా నేటివఱకెవరు గుర్తింపగలిగినారు?"-అని శ్రీ రాళ్ళపల్లివారి తీర్మానం.[16] ఇదెంతో సముచితంగా ఉంది. "దక్షిణాదిని క్షేత్రయ్యకు చాల గౌరవము కలదు. అతనిని వారు క్షేత్రజ్ఞుడు అని వ్యవహరించెదరు. భగవద్గీతలోని పదమూడవ అధ్యాయమందలి మొదటి రెండు శ్లోకముల[17] ననుసరించి క్షేత్రజ్ఞుడనిపించుకో గలిగినవారు మహానుభావులని వేరే చెప్పనవసరములేదు. అట్టి స్థితిని క్షేత్రయ్య పొందియుండెనేమో!" అని విస్సావారు 'క్షేత్రజ్ఞ' శబ్దాన్ని గూర్చి వివరించారు.[18] భగవద్గీతా శ్లోకాలవల్ల శరీరం క్షేత్రమనీ, ఆ క్షేత్రాన్ని తెలుసుకొన్నవాడు క్షేత్రజ్ఞుడనీ అర్థమవుతుంది. అంటే శరీరజ్ఞుడని స్పష్టం. నిడదవోలువారు నైఘంటికార్థాలని తరచి "క్షేత్రియః అనగా పారదారికుఁడు - విటుఁడు. ఈ క్షేత్రయ్యయు 'విటరాయని'గా గోపాలుని సంబోధించి యున్నాఁడు, అని వేఱొక కొందఱూహించిరి. క్షేత్రజ్ఞః అనఁగా ప్రవీణుఁడు. పదకవిత్వమునందు ప్రవీణుఁడు - అని మఱికొందఱు."[19] — అని తెలిపారు. అందులోనే వారు "అమరమున 'పుంస్యాత్మని ప్రవీణేచ క్షేత్రజ్ఞో వాచ్యలింగః'" — అని మాత్రం పేర్కొన్నారు. దాని వ్యాఖ్య ఇట్లుంది. "క్షేత్రజ్ఞ శబ్దము ఆత్మకు పేరైనపుడు పు. నేర్పరికి పేరైనపుడు త్రి. ఆత్మపక్షే - క్షేత్రం శరీరం స్వభోగ సాధనత్వేన జానాతీతి క్షేత్రజ్ఞః. జ్ఞా అవబోధనే. శరీరమును తనకు భోగ సాధనముగా నెఱుఁగువాఁడు. నిపుణపక్షే - క్షేత్రం స్థాన

---

16. అ. కృ. శ. రా.—ఆం. ప. (1942-43) పు. 4. 5.
17. భ. గీ.—అధ్యా 13, శ్లో. 1, 2.
18. 7. అ. వి—పు. 31.
19. వేం. ని. - భా. - పు. 78.

విశేషం జానాతీతి క్షేత్రజ్ఞః. స్థాన విశేషము నెఱుఁగువాఁడు."[20] అంటే క్షేత్రయ్య ఆత్మజ్ఞాని అని గాని, అనేక క్షేత్ర సందర్శనచే వాటి మహిమల గుర్తించినవాడనిగాని మనం తెలుసుకోవచ్చు.

ఈ క్షేత్రయ్య మొదటి పేరేమిటో తెలియదు గనుకనే రాళ్ళపల్లివారు "కాని ఇతని అసలు పేరేమో యే కథయును, ఎవరును ఇప్పటికిని చెప్పలేదు"[21] — అని ముక్తకంఠంగా చెప్ప గలిగారు. "క్షేత్రయ్య అనేది పదరచన చేస్తూ క్షేత్రాటనం చేసినందువల్ల వచ్చిన ప్రజ్ఞా నామమనీ, అతని అసలు పేరు మొవ్వ వరదయ్య అని శ్రీ విస్సా అప్పారావు పంతులుగారి పరిశోధనల ద్వారా వెల్లడి అయింది."[22] — అని బాలాంత్రపురజనీ కాంతరావు గారూ, "క్షేత్రయ్య అసలు పేరు మువ్వ వరదయ్య అనే సంగతిని ప్రతిపాదించి, అతడు కృష్ణాజిల్లా దివితాలూకాలోని మువ్వ కాపురస్తుడని ప్రచారంచేసినవారు విస్సా అప్పారావుగారు"[23] — అని ఆరుద్రగారూ, ఇంతకంటే "క్షేత్రజ్ఞుని అసలు పేరు 'మువ్వ వరదయ్య' అని కీర్తిశేషులు శ్రీ విస్సా అప్పారావు పంతులు గారు ఊహించి, ఒక చక్కని అందమయిన కథను కల్పించినారు."[24] — అని సముచితంగా మంచాళ జగన్నాథరావు గారూ పేర్కొన్నారు. నిజమే. విస్సావారే క్షేత్రయ్య పేరు 'మువ్వ వరదయ్య' అని తెలుసుకొన్నప్పుడు "క్షేత్రయ్య పూర్వపు నామము 'మువ్వ వరదయ్య.' ఇది ఇంతవరకు నెరుగని విషయము."[25] — అని పేర్కొన్నారు. వీరు మొవ్వ గ్రామంవెళ్ళి అనేక విషయాలు

---

20. గు. ప్ర. – పు. 73.

21. అ. కృ. శ. రా.—ఆం. ప. (1942–43) పు. 14.

22. ర. రా. బా.—పు. 226. 23. ఆ.—సం. 11, పు. 77.

24. జ. మం—ఖా—(నవంబర్ 1970) పు. 32.

25. ౯. అ. వి.—పు. 9.

సేకరించారు. "మొవ్వ గ్రామములో క్షేత్రయ్య వంశీయులు ఐదు కుటుంబములవారున్నారు. క్షేత్రయ్య ఇంటి పేరు కూడ మొవ్వయే. ఈ కుటుంబములవారింటి పేరున్నూ మొవ్వయే. వీరిది రథీతరసగోత్రము. ఆపస్తంబ సూత్రము. యజుశ్శాఖ," అని తెలిపి వారు చెప్పిన అనూచానమైన కథ ననుసరించి క్షేత్రయ్య పూర్వ నామం మొవ్వ వరదయ్య అని అంగీకరించి, క్షేత్రయ్య పదాలలో అధికంగా 'వరద' ముద్రగలవి ఉండటంవల్ల అవి ఆత్మపరమైనవిగా ఎంచి 'వరదయ్య' అన్నది అసలు పేరని అప్పారావుగారు నిర్ధారణ చేశారు.[26] ఇది సర్వ జనామోద యోగ్యంగానైతముంది.[27] నేనూ 'మువ్వ' గ్రామం వెళ్ళి 'మువ్వగోపాలుని' దర్శించాను.[28] ఆ సందర్భంలో మొవ్వ వేంకట కృష్ణారావుగారు [ ప్రస్తుతం హెడ్మాష్టరు, మొవ్వ ఉన్నత పాఠశాల, మొవ్వ ] అప్పారావుగారు చెప్పిన — పైని పేర్కొనబడిన — వన్నీ సరైనవనే తెలిపారు. వీరు క్షేత్రయ్య తమ పూర్వుడని అంగీకరిస్తున్నారు. వరదయ్య అన్న అసలు పేరు మరుగున పడిపోయి, క్షేత్రయ్య అన్న పేరే నిలచిందని చెప్పిన రాళ్ళపల్లి వారి మాటలు అక్షరాలా సత్యం. కాబట్టి ఇందులో విప్రతిపత్తికి అవకాశం లేదు. ఇంక మొవ్వ వరదయ్య తలిదండ్రు లెవరో ఎవరు గూడా చెప్ప డానికి ప్రయత్నించలేదు. ఆ విషయం అజ్ఞాతంగానే ఉండి

---

26. 7. అ. వి.—పు. 7, 8, 25–31.

27. సీ. గీ. వే.—పు. ౬౩.

28. 2–3–'78 న మిత్రుడు శ్రీ యార్లగడ్డ బాలగంగాధర రావుగారు నేనూ మొవ్వ సందర్శించాం. శ్రీ మొవ్వ వేంకట కృష్ణారావుగారు, శ్రీ రెంటచింతల నాంచారయ్యగారు — అనేక విషయాలు వివరించారు క్షేత్రయ్య, మొవ్వలగూర్చి. వాటిని చాలవరకు నేను రికార్డుచేశాను.

పోయింది. ప్రస్తుతమున్న మొవ్వ కుటుంబాలవారికీ, క్షేత్రయ్యకు సంబంధించిన లిఖితపూర్వకమైన సాక్ష్యం [Recorded Evidence] మాత్రం లేదు. ఇది కేవలం జనశ్రుతిలోనిది మాత్రమే.

## 1 . 2 నివాసం :

ఇంక క్షేత్రయ్య నివాసస్థలం గూర్చి చర్చించవలసి ఉంది. మొట్టమొదటిసారిగా ప్రామాణికంగా క్షేత్రయ్యను గూర్చి రాసిన సుబ్బరామదీక్షితులు " క్షేత్రజ్ఞుఁడు. ఇతడు త్రైలింగ్య బ్రాహ్మణుడు. ఇతని యునికి మువ్వపురి. "[29] అని మాత్రం పేర్కొన్నారు ఈ మువ్వపురి ఎక్కడున్నదీ నిష్కర్షగా చెప్పలేదు. టి. ఎస్. వాసుదేవన్‌గారు ' క్షేత్రయ్య నివాసము కృష్ణామండల మందలి ఘంటసాల దగ్గరి ' మువ్వ ' యను గ్రామము " అని స్పష్టంగా 1938లో తెలిపినట్లు ఉల్లేఖించిన[30] రాళ్ళపల్లి వారు సైతం " మువ్వ ఇతని స్వగ్రామమనుమాట నిస్సందేహముగానున్నది. అక్కడనేటికిని గోపాలుని దేవళము గలదని, ఆ చుట్టుప్రక్కల క్షేత్రయ వంశము వారనఁబడు ఆంధ్ర బ్రాహ్మణులు గలరని విన్నాను. "[31] అని అంగీకరించారు. అంతకు ముందే వేటూరి ప్రభాకరశాస్త్రి గారు సైతం తెలిపారని " క్షేత్రయ్య మొవ్వ (కృష్ణాజిల్లాలోని) గ్రామము వారని మొట్టమొదట, నాకు తెలిసినంతలో శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వ్రాసియున్నారు "[32] అని విస్సా వారు పేర్కొని వారిచే రచితమైన ' కరుణక ' మన్న కథను ' క్షేత్రయ్య పదములు ' గ్రంథంలో పొందుపరచారు.[33] " అటుతరువాత [సుబ్బ

---

29. సు. ది.—పు. 9.
30. అ. కృ. శ. రా.—ఆం. ప. (1942–43) పు. 13
31. పై దే. 32. 7. అ. వి. – పీఠిక పు. 2, 3.
33. ప్ర. శా. వే. — ఖా. (రక్తాక్షి శ్రావణం).

రామదీక్షితుల తరువాత] సుమారు ఇరవై యేండ్ల క్రిందట కీర్తనాచార్య సి. ఆర్. శ్రీనివాస అయ్యంగారు క్షేత్రజ్ఞుడు ఉత్తరార్కాటు జిల్లాలోని మూవపురము [Moovapura] వారని వ్రాసియున్నారు. మరియు పదములకు మువ్వగోపాల, మూవగోపాల అను ముద్రలు గల" వని రాసినట్లు విస్సావారుల్లేఖించారు.[34] కానీ ప్రొ. సాంబమూర్తిగారు మాత్రం "Kshetraya, the immortal composer of Telugu Padas, was a Telugu Brahmin and lived in the 17th Century. He was born in MUVVA-PURI, a Village in Chandragiri Taluq of the Chittoor District."[35] అని స్పష్టంగా వ్యాఖ్యానించారు. కాని ఇది సముచితం కాదనీ, కృష్ణాజిల్లాలోని 'మొవ్వ' యే క్షేత్రయ్య నివాస స్థలమనీ విస్సావారు నిరూపించారు. 7. అ. వి. ప్రతిలోని 175 పదంలో 'మువ్వపురి సామి' అనీ, 280 పదంలో 'మువ్వపురి నిలయునితో కలిసి' అనీ, 59 పదంలో 'మువ్వపురి విభుడైన గోపాల' అని ఉండడంవల్ల సాంబమూర్తి గారన్నట్లు చంద్రగిరి తాలూకాలోని మువ్వపురి గాని, కార్వేటినగరం ఆస్థానకవి అన్నట్లు కార్వేటి నగరంలోని మువ్వల వేణుగోపాలస్వామిగాని కాదనీ విస్సావారు వివరించారు. మరి ఈనాడు 'మొవ్వ' అన్నదే వాడుక అయితే 'మువ్వ' కు 'మొవ్వ' కు సంబంధం ఏమిటి ? అన్న ప్రశ్నకు సమాధానంగా సి. ఆర్. శ్రీనివాస అయ్యంగార్ తెలిపినట్లు మువ్వ, మొవ్వ, మూవ అని కలదనీ, వ్రాతప్రతులలోను 'మొవ్వగోపాల పదము' లని కొన్నింట ఉందనీ, కొన్నింట 'మువ్వగోపాల' అని ఉందనీ, మొవ్వలో మొవ్వ క్షేత్రయ్య వంశీయులైనవారు కలరనీ, వారు చెప్పిన కథ వలనగూడా 'మొవ్వ' అని తెలిపి, 'మువ్వ, మొవ్వ,

---

34. పై 32 లోనిదే–పు. 1.
35. 126. S – M. P. – P 87.

'మొవ్వ' అని మారిందనీ కనుకనే క్షేత్రయ్య నివాసస్థలం 'మొవ్వ' అని సోపపత్తికంగా విస్సావారు నిరూపించారు.[36] తాళ్ళపాక తిమ్మక్క పేర్కొన్న 'మువ్వగోపాల'[37] అన్నదానిచే క్షేత్రయ్యకు పూర్వమే 'మొవ్వగోపాలుడు' ప్రసిద్ధిపొంది తిరుపతివరకు వ్యాపించి ఉండవచ్చునని విస్సావారు తలంచారు.[38] విస్సావారు మొవ్వ వెళ్ళినప్పుడు 'మొవ్వ క్షేత్రయ్య' వంశంవారు "ఇక్కడ గోపాల స్వామి ఆలయమున్నది. పూర్వమున్న ఆలయము సికస్తు పడిపోగా అక్కడనే తరువాత వారు ఏదో షుమారిగా చిన్న ఆలయమును కట్టించిరి. మొవ్వ గ్రామము పూర్వము మెరకగా ఉండేది. ఇప్పుడు పాటి దిబ్బలు చాల కలవు. కొన్నేళ్ళవరకు ఇళ్ళు దిబ్బలమీదే ఉండేవి. పాటిదిబ్బలు త్రవ్వుచున్నప్పుడు ప్రాత కుండలు దళసరివి దొరకుచుండును. నేటి ఆలయము చుట్టు ఊరున్నది. దీనికి రెండు మూడు ఫర్లాంగుల దూరములో రాళ్ళ చెరువు ప్రక్కన 'సానెం పాడు' ఉండేది. దీనిని 'సాని పేట' యని కూడ అందురు. అక్కడుండే ఇండ్లబాపతు పెద్ద పెద్ద రాళ్ళు నేటికిని ఒక గజము లోతు త్రవ్విన కనబడును. సానిపేటకు ఒక మైలు దూరమున కూచిపూడి అగ్రహారమున్నది." అనీ మొవ్వ వరదయ్య అన్న పేరుతో గొడ్లకాపరిగా ఉంటూ, భక్తితో గోపాలదేవుని ఆలయంలో కూర్చునేవాడనీ, ఆ సందర్భంలోనే ఒక దేవదాసిని ప్రేమించి నిరాకృతుడై పట్టుదలతో గోపాలదేవుని ధ్యానించి, ఆ దేవుని అనుగ్ర

---

36. 7. అ. వి. — పు. 1—11

37. "పుండరీకాక్షుడా — పురుషోత్తముడ
మురవైరి వందిత — మువ్వగోపాల
నారద వినుతయా — నంద ముకుంద
మత్స్యావతార నా — మనవిచేసుకొనుము".
సుభద్రా కల్యాణము — పు. ౬౭.

38. 7. అ. వి. — పు. 5, 6.

హంతో భక్తుడై, పదరచయితయై, ఆ స్త్రీయందలి ప్రేమభావం మారి, వారిద్దరు గోపాలదేవునిపై పదాలు పాడుతూ వెళ్ళారని తెల్పిన విషయాన్ని విశ్వసించారు,[39] దీని నిట్లు స్థాపించారు విస్సాప్రగడవారు. "మువ్వ గ్రామమున్న ప్రాంతము చాల ప్రాచీనమైనది. ఆంధ్ర విష్ణువు వెలసియున్న శ్రీకాకుళము, ప్రసిద్ధ బౌద్ధ స్తూపముగల ఘంటసాల ఈ గ్రామమునకు 5, 6 మైళ్ళలో ఉన్నవి. మరియు చినముత్తేవి, పెదముత్తేవి, పెదపూడి, కూచిపూడి గ్రామములున్ను దీనికి బహుసమీపమున యున్నవి. శ్రీకాకుళాంధ్ర దేవుని ఆలయమునకు చాల ప్రసిద్ధి కలదు. శ్రీకృష్ణదేవరాయలు ఈ ఆంధ్ర విష్ణువును సేవించి వసతుల నేర్పరచినాడు ............... ఆలయములో కేంద్రముగా భారతీయ విజ్ఞానము, వేదములు, శాస్త్రములు, కళలు, సంస్కృతి వెలయుచుండెననుట సుప్రసిద్ధము. ఈ ప్రాంతములయందు పండితులు, కళారాధకులు, ఎక్కువగా ఉండియుందురు. అందుచేత మువ్వ మొదలగు గ్రామములయందు ప్రాచ్య సంస్కృతి నిండియుండేదని నిరాక్షేపణగా చెప్పవచ్చును... మువ్వకు రెండుమైళ్ళలోపుననే కూచిపూడియను అగ్రహారమున్నది. అచ్చటివారు సంకేత, సాహిత్య, నాట్య, అలంకార విద్యలయందు ఆరితేరిన వారని ప్రసిద్ధికెక్కినవారు. 1502 క్రీ. శ. నాటికే వీరు సుప్రసిద్ధులుగ ఉండిరని 'మాచుపల్లి కైఫియత్'[40] లో ఉన్నది."[41] "కూచిపూడి వారందరకు పరంపరగా క్షేత్రయ్య పదములు పాడి, అభినయించుట, అందలి నాయికానాయక భేదముల గురించిన వివరములు తెలిసియుండుట కలదు. మరియొకచోట ఇట్టిసందర్భమే లేదు."[42] "ఏది ఎట్లైనను మువ్వగోపాలస్వామి, మువ్వపురి

39. పైదే – పు. 7. 8. 9

40. 6. అ. పో. శ్రీ. – పుట 133.

41. 7. అ. వి. – పు. 10. 11. 42. పైదే – పు. 3.

వాసి, అదే మువ్వ, అదే నేటి మొవ్వ. అదే క్షేత్రయ్య పుట్టిన చోటు."[43] ఇది విస్సా అప్పారావుగారి సిద్ధాంతం.

ఈ సిద్ధాంతాన్ని చాలవరకు పండితు లంగీకరించారు. "నావల్ల దుడుకులె-న్నటికైన గలవా?' [సీ. గి. వేం. - ప - పు 56] యను పదములోని యనుపల్లవి 'మోవనాడు కదిలిన - మువ్వగోపాల దేవా!' యని యుండుటచేత 'మోవ' శబ్దము పాకనాడు, వేగినాడు మొదలైన శబ్దములలోవలె నాడికకును, 'మొవ్వ' శబ్దమూరికిని బెట్టినపేళ్లుగా గనబడుచున్నవి." "క్షేత్రయ్య యింటిపేరు నాడు మువ్వగా నుండి యీనాటి కీతని కుటుంబమువారు చెప్పుకొన్నట్లు మొవ్వగా మారియుండవచ్చును."[44] అని గిడుగువారు వివరించారు. వీరి ననుసరించి క్షేత్రయ్య నివాస స్థలం 'మొవ్వపురి' అనీ దానినే 'మోవనాడు' అనికూడా అంటారని మల్లాది వసుంధరగారన్నట్లు తోస్తుంది.[45] కానీ మొవ్వపురిని గాని, ఆ ప్రాంతాన్నిగాని 'మోవనాడు' అనడానికి ఆధారాల్లేవు. రజనీకాంతరావుగారుకూడ పై సిద్ధాంతాల్ని విశ్వసించారు.[46] కానీ రాళ్ళపల్లివారు మాత్రం 'మోవనాడు' అన్నదొకనాడని అంగీకరించలేదు. "ఇట్లే క్షేత్రయ్యవాడిన 'మోవనాడు' అనే పలుకుబడిలో 'మువ్వనాడు' అనే ఎవ్వరూ కని విని యెరుగని క్రొత్త నాడు గాని, 'నారదగానలోల' అనే త్యాగయ్యగారి కృతిలో నారదస్తుతి పంచ రత్నాలకు కావలసిన నారదుని స్వరూపకం కాని నా చూపుకందని విషయాలు. మోవన్ + ఆడు = నా మీద తప్పు మోచునట్లుగా ఆడుము అని మొదటిదానికర్థం."[47] - అని రాళ్ళపల్లివారు వివరించారు. ఇదే సమంజసం.

43. పైదే - పు. 6. 44. సీ. గి. వేం, పు. 336, 337.
45. వ. మ.-పు. 226, 227. 46. ర. రా. బా. - పు. 226, 227.
47. పైదే - పుట 11.

విస్సావారి ప్రకారం క్షేత్రయ్య నివాసస్థలం మొవ్వ అని అంగీకరించటానికి వీల్లేదంటూనే "క్షేత్రయ్య మొవ్వవాడేనని అంగీకరించటానికి మనకు ఎలాంటి అభ్యంతరమూ లేదు. క్షేత్రయ్య వ్రాసిందేవిటి ?" — అని ప్రశ్నించుకొని "నిజానికి క్షేత్రయ్య ఈ పాటలలో యిచ్చిన భోగట్టా యావత్తూ దేవునికి సంబంధించిందీకాదు, దయ్యానికి సంబధించిందీ కాదు. ఇదంతా కేవలం సానిగూడెపు భోగట్టా. 'సానెంపాటి' లంజ దిబ్బల భోగట్టా. ఈ 'సానెంపాటి' లంజ దిబ్బలు మొవ్వగ్రామానికి కూత వేటు దూరంలో ఉన్నయ్. ఇది పూర్వం పెదభోగం గూడెం." "క్షేత్రయ్య మొవ్వవారంటే మనం అంగీకరించుతాం. కాని క్షేత్రయ్యకూ, ఆ వూరిగుళ్ళో ఉన్న దేవుడికీ పుస్తికడదామంటేమాత్రం పొసగదు." అని అంటూ భంగ్యంతరంగా 'సీరపాణి' గా రంగీకరించారు.[48]

ఇంక తాళ్ళపాక తిమ్మక్క పేర్కొన్న 'మువ్వగోపాలుడు' యాదృచ్ఛికంకావచ్చు. విస్సావారన్నట్లు క్షేత్రయ్య ఇష్టదైవమైన 'మువ్వగోపాలుడు' తిమ్మక్కనాటికే ప్రసిద్ధిపొంది, తిరుపతి వరకు ప్రాకి ఉండా[49]లనుకోవడంలో కొంత అతివ్యాప్తి గలదు. విస్సావారి సిద్ధాంతాల్ని అందరూ చర్చించకుండా అంగీకరిస్తున్నారనీ, అయినా ముఖ్యమైన సందేహాలున్నాయనీ, అవి తమ గురువుగారే అడిగారని 'ఆరుద్ర' గారు తమ అభ్యంతరాన్ని తెలిపారు.[50] ప్రొ. సాంబమూర్తిగారు పేర్కొన్న చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకా మువ్వలపురి కాదని ఖండించి, టి. ఎస్. వాసుదేవన్‌గారు పేర్కొన్న కృష్ణాజిల్లా మొవ్వను స్వీకరించి నిరూపించటానికి ప్రయత్నించిన విస్సావారు, సి. ఆర్. శ్రీనివాస అయ్యంగారు చెప్పిన

---

48. ఆం. ప. – (1953–54) – పు. 156, 157.

49. 7. అ. వి. – పు. 5, 6. 50. ఆ. – సం. 11 పు. 78.

ఉత్తరార్కాటు జిల్లా 'మోవపురం' ను గురించి ఖండించడానికి యత్నించలేదని ఆరుద్ర గారి ఫిర్యాదు.[51] నిజమే. ఇది చేసి ఉండవలసింది అప్పారావుగారు. కాని చేయలేదు. "కృష్ణా జిల్లాలోని మువ్వ తప్పించి ఇంకెక్కడా మువ్వపురి లేదు' అని విస్సావారు అభిప్రాయపడ్డారు," అని ఆరుద్రగారు తెలిపి దక్షిణాదిన గల మరి ఆరు 'మూవ' తో గూడిన ఊళ్ళ పేర్లిచ్చారు; అంతే గాదు. వాటిలో కొన్ని గ్రామాల్ని సందర్శించి 'మొవ్వ' తో సంబంధం లేదని తేల్చారు.[52] ఇది ప్రశంసించదగ్గ కృషి; ఆరుద్రవంటి సాహితీ వేత్తలకు, మేధావులకు సముచితమైంది. "క్షేత్రయ్య ఏ ఊరివాడో తేలకపోయినా అతని జీవిత చరిత్రను కొంతకాకపోతే కొంతయినా ఊహించవచ్చు." "అతడు దక్షిణాన ఉన్న ఏదో మోవూరులో పుట్టి పెరిగాడు."[53] అనీ, మరోచోట "క్షేత్రయ్య స్వగ్రామం చెంజి మండలానికి దగ్గరలో ఉండవచ్చు. అతడు విద్యాభ్యాసం ముగించుకొని, ఆ కాలంలో చెంజిని పాలిస్తున్న తుపాకుల వెంకటకృష్ణయ్య నాయకుని ఆశ్రయం సంపాదించుకొన్నాడు."[54]— అనీ ఆరుద్రగారు ఊహించారు. వీరి ఊహ చాలా బాగుంది. కానీ ఒకటిమాత్రం మనం గమనించాలి. క్షేత్రయ్య జీవిత చరిత్రకు సంబంధించిన అంశాలను ఎవరు చెప్పినా వారి వారి అభిమానాన్ని బట్టి, మేధాసంపత్తి ననుసరించి ఊహించడం జరుగుతూంది. చారిత్రకాధారాలు తక్కువన్నమాట సర్వజన విదితమే. సర్వజనామోద యోగ్యంగా సాధ్యంకాకపోయినా, అధిక పండితామోదం పొందేట్లు లభించిన క్షేత్రయ్యకు సంబంధించిన విషయాల ఆధారంగా ఊహించడమే సముచితంగాదా ? ఉన్న ఊహలకు మరికొన్ని ఊహలను జోడించటంకంటే, ఇంతకుముందే ప్రతిపాదిత విషయాలు, ఎంత

51. పైదే – పు. 79. 72. ఆ–సం. 11, పు. 79–81.
53. పైదే – పు. 81. 54. పైదే – పు. 85.

వరకు వాస్తవమై ఉంటాయో పరిశీలించి తక్కిన ఆధారాలతో వాటి ననుసరించి క్షేత్రయ్య జీవితచరిత్రను నిర్మించుకోవడం ఉచితమని నా భావన.

ఇది ఇలాఉండగా పైని పేర్కొన్నవారు గమనించారో లేక గమనించి ఊరకున్నారో తెలియదుగాని, మరో రహస్యముంది. క్షేత్రయ్య నివాసస్థలం గుంటూరు మండలంలోని దన్నవారు సైత మున్నారు. ఆ చెప్పినవారు సామాన్యులుకారు; ప్రసిద్ధ చరిత్ర కారులు; పైగా ఆంధ్రదేశ చరిత్రను తరచి నిగ్గుదేల్చినవారు. నిడదవోలువేంకటరావుగారి నుల్లేఖిస్తూ[55] "త్యాగయ్యవలె క్షేత్రయ్య దాక్షిణాత్యుడుకాదు; అతని జన్మదేశము గుంటూరు మండలము. సంగీతవిద్య యందభిరుచి గల రాజుల సంస్థానాలకెల్లిపోయి తన విద్యా కౌశలమును జూపి బహుమానములను బొందెను ... కావున క్షేత్రయ్య దేశద్రిమ్మరి. ఆంధ్రభాష వ్యవహారము నందుండిన దేశ మంతయు నతనికి గీర్వాణి యొసగిన యమరమాగాణము. తంజావూరి వాడనుట పొరపాటు".[56] అని డా. నేలటూరి వేంకట రమణయ్యగారు వివరించారు. ఇట్లే వారు తమ 'వాఙ్మయ వ్యాస మంజరి'లో సైతం "ఇతని జన్మస్థానము ఇప్పటికి గుంటూరు మండ లము లోని మొవ్వ యను గ్రామము; కాని ఇతని నాదరించి సత్క రించిన ప్రభువులు దక్షిణదేశమున నన్ని యెడలను గలరు"[57] అని పేర్కొన్నారు. వీరి ననుసరించియే కాబోలు డా. వి. రాఘవన్‌గారు సైతం "The Padas of Kshetrayya form one of the richest treasures of Raga and Bhava in Carnatic music; Kshetrayya,

---

55. 76. వేం. ని.—పు. 162.

56. 70. వేం. నే.—పు. 1. 2.

57. 71. వేం. వే.—పు. 346.

an Andhra musician composer of a place called Muvvapuri in Guntur District, composed heaps of Padas for the art of abhinaya in Bharatanatya." 58 అని క్షేత్రయ్య జన్మ స్థలము గుంటూరు మండలంలోని 'మువ్వపురి' అని నిర్ణయించారు. వారిద్దరూ సాహిత్యంలోనే గాక చరిత్రలోను నిష్ణాతులు. వీరి మాటలను ప్రామాణికంగా తీసుకోవలసి ఉంటుంది. కాని వీరు పేర్కొన్నట్లు గుంటూరు మండలంలో ప్రసిద్ధమైన మువ్వ పురి, మువ్వగోపాల ఆలయం మొదలైనవి ఉన్నట్లు సోపపత్తికంగా నిరూపిస్తేనేగాని వీటి నంగీకరించడం కష్టసాధ్యమనే తలంచాలి. పోతే ఒక విషయం మాత్రం వాస్తవం. నేలటూరి వారన్నట్లు క్షేత్రయ్య దాక్షిణాత్యుడు మాత్రంకాదు; అచ్చంగా ఆంధ్రుడు. "అతడు (క్షేత్రయ్య) దక్షిణాన ఉన్న ఏదో మోవూరులో పుట్టి పెరిగాడు. కంచిలో చదువుకొన్నాడు అని ఊహించవచ్చును" అనీ, "క్షేత్రయ్య స్వగ్రామం చెంజి మండలానికి దగ్గరిలో ఉండవచ్చు".59 అనీ ఊహించిన 'ఆరుద్ర' గారి ఊహలకు ఆధారంలేక పోతూంది. కాబట్టి క్షేత్రయ్య ఆంధ్రుడనడమే ఉచితం. వీటన్నిటినీ పరిశీలించాక క్షేత్రయ్య ఆంధ్రుడు; కృష్ణాజిల్లా మొవ్వ గ్రామవాసి; అనడమే సముచితంగా తోస్తూంది ఇప్పటి ఆధారాలనుబట్టి. పూర్వోక్తమైనట్లు సర్వజనాంగీకృతం కాకపోయినా, అధికసంఖ్యలో పండితులా మోదించదగినట్లుండమే దీనికి తార్కాణ.

## 1.3 జీవిత చరిత్ర

ఇంక క్షేత్రయ్య జీవితచరిత్రను క్లుప్తంగా తెలుసుకొందాం. ప్రప్రథమంగా క్షేత్రయ్యనుగూర్చి చెప్పిన సుబ్బరామ దీక్షితుల

58. R. V.—J. M. A,—Vol xvi—P 117.
59. ఆ,—సం, 11 పు. 8., 65.

కథనంలో క్షేత్రయ్య చిన్నతనంలోనే ఒకమహాయోగివలన గోపాల మంత్రోపదేశం పొంది, దానిని జపించి, ఆ శృంగార రసాధిదేవతకు అనుగ్రహపాత్రుడై "శ్రీపతి సుతుబారికి" అనే పదంతో ప్రారంభించి అనేక పదాలు రచించాడని తెలుస్తూంది.[60] "మహాపురుషుల కందఱికిని ఇట్టి విభూతికథలు సామాన్యములు. ఇంతకన్న అందమైన కథ మఱియొకటి నేనువిన్నాను."[61] అని రాళ్ళపల్లి వారు క్షేత్రయ్య దేవదాసి మూలంగా, మహాభక్తుడైనట్లు ఉట్టంకించిన కథ సముచితమైనదని తోస్తూంది.[62] ఇదీ చాలమంది ఊహించిన ఊహలాంటిదే; పలువురు చెప్పిన కథ లాంటిదే. కానీ ఇది క్షేత్రయ్య రక్తికీ, భక్తి ముక్తులకు సముచితమై ఆతని జీవితతత్త్వ ప్రకటనాక్షమమై ఒప్పుతూంది. క్షేత్రయ్య పదాలను పరిశీలిస్తే ఆతని జీవితం రెండు భాగాలుగా విడివడిపోతుంది. మొదటిది రక్తిపరుడైన క్షేత్రయ్య జీవితం; రెండోది భక్తిపరుడైన క్షేత్రయ్య జీవితం; ఇదే చివరికి ఆతనికి ముక్తిదాయకమైంది. "కామిగాక మోక్షగామికాడు" అన్న మహాకవి వేమన సూక్తి ఉండనే ఉందికదా? మొదట అనేక రాజాస్థానాల్లో సమ్మానితుడై శృంగారలోలుడై తరువాత మువ్వ గోపాలభక్తుడై పరమ భాగవతోత్తమునిలాగా పదాలు రచించాడనీ స్పష్టమవుతూంది. ఈ కథనే మౌలికమైన కారణంగా చేసుకొని ఇతర చారిత్రకాది — లభించినంతవరకు — ఆధారాలతో క్షేత్రయ్య జీవిత చరిత్రను ఇలా నిర్మించుకోవచ్చు.

పూర్వోక్తమైనట్లు క్షేత్రయ్య మొదటి పేరు వరదయ్య. జన్మస్థానం మొవ్వ; ఇతని తలిదండ్రు లెవరో మనకు తెలియరాలేదు. వరదయ్య గొడ్లకాపరి అయిన పామరు డెంత మాత్రమూ కాదు.

60. సు. దీ.—పు. 9.

61, 62. అ. కృ. శ. రా.—ఆం. ప.—(1942-43) పు. 13. 14.

ఈతని పదాలనుబట్టి చూస్తే సంగీత సాహిత్యాభినయాలలో ఆరితేరిన వ్యక్తిగా గోచరిస్తాడు. కాబట్టి సొంతంగా విద్యాభ్యాసం చేసిఉండాలి. మొవ్వ పరిసరప్రాంతాలైన శ్రీకాకుళం, ఘంటసాల, కూచిపూడి సమస్త కళలకు నిలయాలై వెలసినట్లు మనకు తెలిసిన విషయమే.[63] క్షేత్రయ్య సమస్త కళలను నేర్చిన ప్రోఢ అని విస్సా వారిలాగే గిడుగువారు సైతం తలంచుతున్నారు.[64] ఇలాంటి అభిప్రాయాన్నే వ్యక్తంచేశారు ఇ. వి. కృష్ణయ్యరుగారు. "His family and surroundings were highly cultured He himself was proficient in Sanskrit, Telugu, Music, Alankara Sastra, dance and Abhinaya and imbibed fully the culture of the neighbouring Kuchipudi Bhagavatas and out of the local Devadasi experts in music and abhinaya" [65]. ఇలాగా క్షేత్రయ్య సకలవిద్యా సనాథుడై, పదరచనా నిపుణుడై ప్రకాశించాడు. ఈ సమయంలోనే మొవ్వలోని 'సానెంపాడు' సానుల సావాసంకూడ క్షేత్రయ్యకు కుదిరిఉండవచ్చు.

సంగీత సాహిత్యాభినయాది కళల్లోను, అలంకారాది శాస్త్రాల్లోను అనన్య సామాన్యమైన నైపుణ్యం సంపాదించినాకూడా సరైన పోషణలేకపోయింది క్షేత్రయ్యకు. 'లతావనితా పండితుల'కు ఆశ్రయం ముఖ్యంగదా? అప్పటికే దేవరకోట మొదలైన సంస్థానాలు ఉచ్ఛస్థితిలో ఉండేవి. కానీ ఈ సంస్థానాల్లో క్షేత్రయ్యకు రాజాశ్రయం లభించలేదు. కారణం క్షేత్రయ్య ఈ సంస్థానాలను ఆశ్రయించలేదో, లేక పదకవితకంతగా ప్రాధాన్యం నాడు లేకపోవడం

63. 7. అ. వి.—పు. 11, 12.

64. సీ. గి. వేం.—పు. 88,

65. పైదే—పు. 16.

వల్ల పదకర్త అయిన క్షేత్రయ్య నిరాదరించబడ్డాడేమో. ఏదిఏమైనా క్షేత్రయ్యకు తగిన ఆశ్రయం లభించలేదన్న విషయం వాస్తవం. 16 శ. లో కృష్ణదేవరాయల ఏల్బడిలో సమస్త కళాకారులకు ఆదరముండేది.[66] రక్షస తంగడి యుద్ధానంతరం రాయల రాజ్యం వినాశంగాగా కవిగాయకులకు ఆదరం లేకపోయింది. తదనంతరం మధుర, తంజావూరు నాయకులు మొదలైనవారు రాజ్యాలు సంస్థాపించి, కవిగాయకులకు ఆశ్రయమిస్తూ, తమ వదాన్యతను ప్రకటిస్తూ సాహిత్యకళా పోషకులై క్షేత్రయ్య కాలానికి ప్రసిద్ధి కెక్కారు. అందుచేత విజయనగర పతనానంతరం నేల నాలుగు చెరుగుల నుంచి దక్షిణదేశానికి కళాకారులు వలసపోవడం తటస్థించింది; అక్కడ ఆశ్రయం సంపాదించడం జరిగింది. పైగా కూచిపూడివారే తంజావూరుకు వలసపోయినట్లు చరిత్ర చెబుతూంది. 15. శ. పూర్వం నుంచే ఈ కూచిపూడి భాగవతులు కూచిపూడి నాట్యంలో ప్రసిద్ధిపొందారు. 16 శ.లో విజయనగర సంస్థానాధీశ్వరులైన వీరనరసింహరాయలు కాలంలో సంబెట గురవరాజను సామంతుడు జరుపుతూండిన ఘోరాలను ఈ కూచిపూడి భాగవతులు తమ ప్రదర్శనవల్ల చూపించి రాజు మన్ననలకు పాత్రులయ్యారట. "వీరి (కూచిపూడి భాగవతుల) రాక నెరింగింపగానే రాయలవారు (వీరనరసింహరాయలు) 'కూచిపూడి భాగవతులు సుప్రసిద్ధులు. వారిచే ఈ రాత్రే రాణివాసమువారు మేముచూచునట్లు కేళిక యేర్పాటు చేయవలె'ననిరట. దీనినిబట్టి కూచిపూడి భాగవతులంతకు కొన్ని వందల యేండ్ల నుండియే దేశమందు ప్రసిద్ధి కెక్కియుండవలె నని యూహించనగును. అందుచేత 12,13 శ. నాటికే వీరు దేశమందు విద్యావంతులుగ పరిగణింపబడు చుండిరని ఊహించవచ్చును"; "కూచిపూడి భాగవతముల మేళములవారు ప్రదర్శనములిచ్చుచు

66. 71, వేం. నే.—పు. 341, 342.

దేశాటనముచేసి కాలము పుచ్చుచుండిరని చెప్పవచ్చును." "విజయ నగర సామ్రాజ్యపతనానంతరము ఆదరించు ప్రభువులు లేకుండుటచే ఆంధ్రదేశమందలి పండితులు, కళావేత్తలు తంజావూరు తరలి పోయిరి. 1561—1614 మధ్యకాలములో తంజావూరు నేలుచున్న అచ్యుతప్ప నాయకుడు ఈ (కూచిపూడి నుంచి) వలస వచ్చినవారి నాదరించి, వారి జీవనోపాధికై ఒక యగ్రహారము నిచ్చెను. దాని పేరు అచ్యుతపురము. ఇదే నేటి మేలటూరు. తెలుగు భాగవత మేళముల వారి యూరు మేలటూరుగా మారియుండెనేమో!" "ఇట్లు కూచిపూడి వారి నాట్యకళ తంజావూరు ప్రాంతమునకు వ్యాపించి వృద్ధి పొందెను."[67] క్షేత్రయ్యకంటే సుమారు 50 ఏండ్లు పూర్వుడైన నారాయణ తీర్థులు కూచిపూడి ప్రాంతం నుంచి తంజావూరుకు అనగా కూచిపూడి వారంతకు ముందే స్థిరపడిన 'అచ్యుతపురం' వెళ్ళినట్లు తెలియవస్తూంది.[68] సుప్రసిద్ధుడైన అలంకార శాస్త్రవేత్త జగన్నాథ పండితరాయల తాత కేశవభట్టు కూచిపూడి నాట్యవేత్త అనీ, శ్రీకృష్ణదేవరాయలను మెప్పించి 'ముంగండ' అనే గ్రామం అగ్రహారంగా పొందాడనీ విశదమవుతూంది.[69] ఇంతేగాదు, ఆశ్రయమూ, ఆదరణా స్వదేశంలో లభించనప్పుడు కళావేత్తలు వలసపోవడం సామాన్యంగానే ఉంది. "క్రీ. శ. 1265 — 1315 ప్రాంతపు కాలంలో గోపాలనాయకుడను ఆంధ్ర వాగ్గేయకారుడు అల్లాఉద్దీన్ ఖిల్జీ ఆజ్ఞ చొప్పున ఉత్తర హిందూస్థానానికివెళ్ళి ఖిల్జీని తన ప్రబంధ (ధువా) గానపద్ధతిలో మెప్పించాడట."[70] "1580 ప్రాంతంలో కర్ణాటక దేశీయుడైన పుండరీక విఠలుడు ఉత్తరహిందూ

67 (i) 8. అ. వి. — పు. 142, 143. (ii) సా. వా.—పు. 372.

68. ర. రా. జా. — పు. 176. 177, 180, 181, 199.

69. 6. అ. పో. శ్రీ. — పు. 117. 70. ర. రా. జా.—పు. 30.

స్థానంవెళ్ళి ఖాన్ దేశంలో గౌరవం పొందాడు ". [71] ఈ విధంగా రాజాశ్రయార్థం పండితులు వలసవెళ్ళడం సామాన్యమే. పైగా కూచిపూడి భాగవతులు దక్షిణాదికి వలసవెళ్ళడంగూడ క్షేత్రయ్యకు తెలిసిన విషయమే. సంగీత సాహిత్యాభినయాల్లో నిధి అయిన క్షేత్రయ్య రాజాశ్రయం పొందడానికీ, తద్ద్వారా తన కళాభిజ్ఞతను ప్రదర్శించి సమ్మానితుడు కావడానికీ వలసవెళ్ళడం జరిగిందనడంలో అసహజత్వం గోచరించదు.

## 1.4 దర్శించిన రాజులు :

క్షేత్రయ్య ఎప్పుడెప్పుడు ఏ ఏ రాజులను సందర్శించి సమ్మానం పొందాడో మనకు తెలియదు. కానీ కొంతవరకు ఊహించడానికి మాత్రం ఆధారాలున్నాయి. క్షేత్రయ్య దర్శించిన రాజులను, వారిపై చెప్పిన పదాల సంఖ్యలను తెలిపే ఈ క్రింది క్షేత్రయ్య పదం గమనించదగ్గది. దీన్ని మేరువ పదం అంటారు.

" పల్లవి : వేడుకతో నడుచుకొన్న—విటరాయడే !

అ. ప. ; ఏడు మూడు తరాలనుండి — ఇందున్న కాణాచట
గూడుకొని మా మువ్వ — గోపాలుడే విభుడు
॥ వేడుక ॥

1. మధుర తిరుమలేంద్రుడు—మంచి బహుమాన మొసగి
ఎదుట గూర్చుండుమని—ఎన్నిక ఇమ్మనెనే !
ఇదిగో రెండువేల పదము-లిపుడెంచుకొమ్మనిన
చదురు మీదనే ఉన్న సామికి—సంతోష మింతింతగాదే ॥
॥ వేడుక ॥

71, పైదే – పు. 40.

2. అళుకుదీరి తంజాపురి—నెలకొన్న విజయరాఘవుని
వెలయ మనుజుల వెంబడి—వేగమే పొడగాంచి
చలువ చప్పరమున నుండగ—చక్కగ వేయి పదముల
పలుకరించుకోగానె—బహుమాన మిచ్చెనా వేళ ॥వేడుక ॥

3. బలవంతుడా గోలకొండ—పాదుషా బహుమాన మిచ్చి
తులసిమూర్తితో వాదు—దలచె నా వేళ
వెలయ మువ్వ గోపాలుడు—వెయ్యిన్నె నూరు పదములు
నలువది దినములలోన-నన్ను గలసి వినుపించెనే. ॥వేడుక॥"[72]

ఇందులో పేర్కొనబడిన మధుర తిరుమలేంద్రుడు, విజయరాఘవుడు, గోలకొండ పాదుషా — అనే ముగ్గురు రాజులేగాక — తుపాకుల కృష్ణభూపతి, రఘునాథరాయలు అనే వారినిగూడ క్షేత్రయ్య దర్శించినట్లు స్పష్టంగా తెలుస్తూంది. చారిత్రకులు నిర్ణయించిన ప్రకారం ఈ రాజులు రాజ్యం పాలించిన కాలాలు ఇవి.[73]

చెంజి కృష్ణప్పనాయకుడు — క్రీ. శ. 1580—1620.[74]
తంజావూరు రఘునాథనాయకుడు — క్రీ. శ. 1614-1633.[75]
మధుర తిరుమలనాయకుడు — క్రీ. శ. 1623—1659.[76]
విజయరాఘవనాయకుడు — క్రీ. శ. 1633—1673.[77]
గోలకొండ పాదుషా (సుల్తాన్ అబ్దుల్లా కుతుబ్‌షా) } క్రీ. శ. 1626—1672.[78]

---

72. సీ. గి. వేం. — పు. 102, 103.
73. (i) సీ. గి. వేం.—పు. 31 (ii) 7. ఆ. వి.-పు. 20, 21.
74. జ. మం,—భా, (నవం. '70) పు. 88.
75. V. G. v.—P iv
76. 70. వేం. వే. — పు. 9. 77. 75. వేం. వి — పు. 1.
78. పా. వా. — పు. 605.

ప్రప్రథమంగా క్షేత్రయ్య రఘునాథనాయకుని దర్బారుకే వెళ్ళినట్లు ఊహించారు విస్సావారు.[79] కాని రాజ్య కాలాన్ననుసరించి చూడగా రఘునాథుని కంటే తుపాకుల వెంకటకృష్ణప్ప నాయకుడే పూర్వుడు. కనుక ఆరుద్రగారు చెప్పినట్లు క్షేత్రయ్య మొదట దర్శించిన రాజు కృష్ణప్పనాయకుడు.[80] కాని ఎప్పుడాశ్రయించిందీ చెప్పడం కష్టం. క్రీ. శ. 1595 ప్రాంతంలో రఘునాథనాయకుడు కృష్ణప్ప నాయకుని రాయ కారగారం నుంచి విడుదల చేయించినట్లు చెప్పబడుతూంది.[81] అతడు స్థిరపడ్డాక 1615 కు ముందుగాని లేదా తరువాతగాని క్షేత్రయ్య కృష్ణప్పనాయకుని ఆశ్రయించి ఉండ వచ్చునని తలంచడంలో అసహజత్వంలేదు. క్షేత్రయ్య ఇతనిపై ఎన్ని పదాలు రచించాడో చెప్పడం కష్టమే. కానీ ఇంతవరకు లభించినవి ముచ్చటగా మూడు. అవి ఇవి :

1. "ఏమనెనే సుద్దులే—మే ? బంగారు బొమ్మా !
ఏమనెనే మరుగేల దాచకే
రామ ! తుపాకుల రాయడు నీతో ॥ ఏమనెనే ॥"

2. " ఓ యమ్మ ! వీరెంత—యోర్వజాలరమ్మ !
సోయగమున తుపాకి కృ—ష్ణుడు నేను గూడి
యుంటే ॥ ఓ యమ్మ ॥"

3. " నేరమా ? కొమ్మా ! వాడెందుకే
చేర రాడమ్మా !............
గినిసి తుపాకుల కృష్ణునితో నే
దనివి తీరలేదని పలికితినట ॥ నేర ॥"[82]

---

79. 7. అ. వి. — పు. 21 80. అ. — 11. పు. 85—88.
81 పైదే — 86, 87. 82. 7 అ. వి. — పు. 215 - 21

ఇలాంటి క్షేత్రయ్య పదాభినయంతో సంతోషాంతరంగుడైన కృష్ణప్ప నాయకుడు క్షేత్రయ్యను మిక్కిలి సమ్మానించే ఉంటాడు.

చెంజి కృష్ణప్పనాయకుని మరణానంతరం క్షేత్రయ్య ఇతర రాజుల నాశ్రయించి ఉంటాడని ఆరుద్రగారి తలంపు.[83] బహుశః అప్పుడే రఘునాథ నాయకుని ఆశ్రయించి ఉండవచ్చు. రఘునాథునిపై చెప్పబడిన పదాలు మాత్రం లేవు. కానీ తదితర సాక్ష్యాలు ఇందు కుపకరించ గలవు. 1614 లో రఘునాథ నాయకుడు తంజావూరు రాజ్యానికి పట్టాభిషిక్తుడై, తద్రాజ్యాభ్యున్నత్యానికి కారకుడయ్యాడు. కృష్ణప్ప నాయకుడు 1620 లో గతించాకగాని, లేదా అంతకుముందే—అంటే ఒకటి రెండు సంవత్సరాలకు ముందే – రఘునాథనాయకుని వదాన్యతకూ, సంగీత సాహిత్యాది కళా పక్షపాతానికీ మురిసిపోయిన క్షేత్రయ్య రఘునాథుని ఆశ్రయించిఉండవచ్చు.పూర్వోక్తమైనట్లు 1595 ప్రాంతంలో రఘునాథుడు యువరాజుగా ఉండగానే కృష్ణప్పనాయకుని కారాగారం నుంచి విడిపించాడన్నది సత్యమైతే పూర్వవైరం మనస్సులో ఉండడంచేత కాబోలు క్షేత్రయ్య దర్శించినప్పుడు రఘునాథ నాయకుడు ఎందుకు వచ్చావ'ని ప్రశ్నించి ఉండవచ్చు. దీనికి సమాధానమే మండ లక్ష్మీనరసింహకవి తన "ఆంధ్రకౌముది" (అముద్రిత్రం)లో పేర్కొన్న క్షేత్రయ్య చాటు పద్యం.

"మువ్వ గోపాల భక్తేన క్షేత్రజ్ఞ కవి నా ఉక్తత్వాచ్చ—

క. తముదామెవత్తు రర్థులు
క్రమమెరిగిన దాతకడకు, రమ్మన్నారా

83. ఆ. – 11. పు. 88.

కమలంబు లున్నచోటికి
భ్రమరంబుల నచ్యుతేంద్ర రఘునాథ నృపా !"[84].

ఇంతకంటే రఘునాథుని ముద్రతోఁగల పదాలు మనకు లభించలేదు. కానీ మరో నిదర్శనం మాత్రముంది. రఘునాథనాయకుని ఆస్థానం అలంకరించిన వరకవి చేమకూర వేంకటకవి 'విజయవిలాసం'లోని "ఎగుభుజంబులవాఁడు..." (2–164) అనే పద్యాన్ని క్షేత్రయ్య "ఎంత చక్కనివాడే — నా సామివీ — డెంత చక్కనివాడే"[85] అనే పదంలో అనుకరించాడని అంటారు.[86] ఈ విషయం నిజమైతే, సమకాలికుడైన పద్యకవిని, ఈ పదకవి అనుకరించాడనుకొంటే క్షేత్రయ్య రఘునాథుని దర్శించి ఉంటాడని తలంచవచ్చు. సంగీత సాహిత్యాది కళలలో స్వతఃగా నిధి రఘునాథుడు. అనేక కవి గాయకులు ఆతని ఆస్థానంలో వర్ధిల్లారు. కవులేగాక కవయిత్రులు సైతం ఉండేవారు. ఈ విషయాలన్నీ గోవింద దీక్షితులు రాజు పేర రచించిన 'సంగీత సుధ' అనే సంస్కృత గ్రంథంలో స్పష్టంగా ప్రశంసించబడ్డాయి.[87] ఇంతేగాదు. రఘునాథుని ఆస్థానంలో ప్రముఖ వాగ్గేయకారులుగూడ ఉండేవారట.

---

84. (i) 7. అ. వి. - 18. (ii) 76. వేం. ని. - పు. 162.
కానీ సాళువ తిమ్మరుసుమీద ముక్కుతిమ్మన్న చెప్పినదనబడు చాటుపద్య మిలాంటిదే కలదు—

"ఏతెంతురు తముఁదామే
దాతల సన్నిధికి నర్థతతులుర్వీశుక
వ్రాతమునకుఁ జాతమహీ
జాతమ్మంపినదె కమ్మ। సాళతిమ్మా"—

43. ప్ర. శా. వే.—పు. 09

85. 7. అ వి. – పు. 83
86. (i) పైదే – 89, 90. (ii) 76. వేం. ని. పు. 163
87. సీ. కు. పు 240,

"వాగ్గేయకార ప్రముఖై రనేకై
ర్వి చిత్రగీతాది కళాప్రవీణైః
తథైవ వీణాదిమ వాద్య విద్యా
విచక్షణైః క్వాపి నిషేవ్య మాణః

నానా విధాశా నరపాలక వర్గ
సందేశ కృ ద్భిస్సము పాస్యమానః
తనూభవః శ్రీరఘునాథ భూపః" (సంగీతసుధా.)[88].

రఘునాథనాయకుని ఆస్థానమలంకరించిన "వాగ్గేయకార ప్రముఖుల"లో వేంకటమఖి మొదలైనవారిలో క్షేత్రయ్యగూడా ఒకరని తలంచవచ్చు.

క్షేత్రయ్య రఘునాథనాయకుని ఆస్థానంలో ఎంతకాల మున్నాడో చెప్పడానికి ఆధారాలులేవు. నాయకుని మరణానంతరం (క్రీ.శ. 1633 తరువాత)గాని, లేదా అంతకుముందేగాని క్షేత్రయ్య తంజావూరును వదలి మధురనుచేరి ఉండవచ్చు. కవులు, గాయకులు, పండితులు కొత్త ఆశ్రయాలు కోరడం సహజమే కదా? ఆ సమయంలో మధుర అధిపతిగా తిరుమలనాయకు డుండేవాడు. అతడు క్షేత్రయ్యను మిక్కిలి ఆదరించాడు. "ఆదినుంచీ చెంజి, మధుర నాయకులకు ప్రాణస్నేహం. ఈ రెండు రాజ్యాలవారూ కలసికట్టుగానే రాయసింహాసనంపై తిరుగుబాట్లుచేస్తూ వచ్చారు.[89] చెంజి కృష్ణప్ప పోషణలో కొన్నాళ్లున్న క్షేత్రయ్యను తిరుమలనాయకుడు గౌరవించడంలో ఆశ్చర్యంలేదు."[90] తిరుమలనాయకుని దర్శించిన వెంటనే అతడు క్షేత్రయ్యను అపూర్వంగా సత్కరించి అర్ధాసనంపై కూర్చుండ నియమించి ఆనంద నిష్యందులైన చక్కని పదాలను

---

88. సీ. కు. – పు. 241.
89. V. G. V.—P. 132.
90. 7. అ. వి. – పు. 90.

రచించి ఇమ్మని కోరాడట. యథారీతిని అక్కడే వెంటనే రెండువేల పదాలు రచించి ఎంచుకొమ్మని చదురుమీదఉన్న తిరుమలనాయకునికి క్షేత్రయ్య ఇవ్వగా అత్యంత సంతోషం పొందాడట! కానీ తిరుమలనాయకుని ముద్రగల పదాలు మాత్రం మనకింతవరకు లభించలేదు.

మధురలో క్షేత్రయ్య ఎంతో కాలమున్నట్లు తోచదు. కారణం 1633 లో విజయరాఘవ నాయకుడు తంజావూరి నాయకుడుగా తండ్రి అనంతరం రాజ్యానికి వచ్చాడు. "తండ్రికి దగిన కుమారుడు విజయరాఘవుడు. ఆంధ్ర సాహిత్యమునే దృష్టియందుంచుకొని చూచిన తండ్రిని మించినవాడని చెప్పక తప్పదు. విజయరాఘవు దక్షభాషాధురీణుడు, ఆంధ్ర గీర్వాణములు రెంటియందును ఆరితేరిన విద్వాంసుడు, చతుర్విధ కవితా నిర్వాహక సార్వభౌమ బిరుదాంగద విరాజమాన చరణాంభోజుడు, గానకళా విశారదుడు, రసజ్ఞుడు, వదాన్యుడు; విద్వత్ప్రియుడు, కవిజనకల్ప భూజము ... రాజ్యమేలిన నలుబది యేండ్లును నిరంతరము భాషా సేవయందు కాలము గడపెను. కావ్యములు, నాటకములు, కీర్తనలు, పాటలు, పదములు పెక్కింటిని రచించెను. సోమశేఖరశర్మగారు వచించినట్లు విజయరాఘవుని కాలమున తంజావూరి రాజు కొలువుకూటము నిజంగా కనులపండుగ సేయు శారదా నాట్యమందిరమే. సంగీత నాట్యములందు సైతము విజయరాఘవుని దందెవేసిన చేయి. అతడు నవరసరసికులకెల్ల నాయకుడు! [91]. కావున కవిపండితజనమునుబోలి, సంగీత నాట్యవిద్యలలో గడిదేరిన కళావిశారదులెల్ల తమ విద్యా కౌశలమును జూపి సాహిత్యరాయని మెప్పించి సత్కారమును బడయుట కా కొలువుకూటమునకు మూగువారు."[92] కనుకనే

91. సో. శ. మ. – పు. 39 92. 70. వేం. నే. – పు. 13, 15.

మధురను వదలి సైతం తంజావూరికివెళ్లి విజయరాఘవుని ఆశ్రయించి ఉంటాడు క్షేత్రయ్య. కారణం విజయరాఘవుడు పద్యంకంటె మధురపదకవితకే అధిక ప్రాధాన్యమిస్తూండిన విషయం తెలుసు కొన్నాడు.

"ఆళుకుదీరి తంజాపురి—నెలకొన్న విజయరాఘవుని
వెలయ మనుజుల వెంబడి—వేగమె పొడగాంచి
చలువ చప్పరమున నుండగ—చక్కగ వేయి పదముల
పలుకరించుకోగానే—బహుమానమిచ్చె నావేళ"—

అన్నదానిలో 'విజయరాఘవునకు అళుకుదీరి' అని పేర్కొనబడింది. తనను కాదని తన ప్రతిపక్షులైన మధుర తిరుమల నాయకుని ఆశ్రయించాడు క్షేత్రయ్య అని కోపగించుకొన్నాడు విజయరాఘవుడు. తరువాత క్షేత్రయ్య ఇతరుల సాయంతో విజయరాఘవుని దర్శించాడన్నది 'వెలయ మనుజుల వెంబడి వేగమే పొడగాంచి' అనడంవల్ల ద్యోతకమవుతుంది.[93] లేదా "క్షేత్రయ్య కీర్తివిని అతణ్ణి విజయరాఘవుడు రప్పించుకొని ఉంటాడు."[94] — అని ఆరుద్రగారు తలంచినట్లు 'అళుకుతీరిన' తరువాతనే పిలిపించుకోగా ఆ 'మనుజుల వెంబడి వేగమే పొడగాంచాడేమో క్షేత్రయ్య! 'చలువ చప్పరం'లో విజయంచేసిన విజయరాఘవునిపై ఆశువుగా వేయి పదాలు చెప్పి ఆడిపాడి ఆనందింపజేశాడట. దానికి తగినట్లుగానే విజయరాఘవుడు క్షేత్రయ్యను సముచితరీతిని సత్కరించాడు. అది ఆ ప్రభువునకెంతో తగినది.

కొంతకు కొంతైనా విజయరాఘవనాయకునకు క్షేత్రయ్యకు గల సంబంధాన్ని చరిత్ర చెబుతూంది. 1932 లో కురుగంటి సీతా-

---

93. జ. మం. — పు. 33. 94. 7. అ. వి. — పు. 90.

రామయ్యగారూ,[95] 1938 లో టి. ఎస్. వాసుదేవన్ గారూ,[96] ఇట్లే 1942 లో వృద్ధగిరీశన్ గారూ,[97] వీరందరికంటే ముందే సుబ్బరామ దీక్షితులుగారూ[98] క్షేత్రయ్య విజయరాఘవుని ఆస్థానమందలి ఉత్తమవాగ్గేయకారుడని పేర్కొన్నారు. ఇంకా "రసికాగ్రేసరుడైన విజయరాఘవ భూపాలుడు ఇతనికి సేయునట్టి బహుమానాద్యుపచారముల జూచి ప్రబంధరచనాధురంధరులైన కవీంద్రులు ఈసున 'మహారాజా! ఇదేమి? ఏరా, రారా, పోరా యని జెప్పెడి క్షేత్రయ్య మీద నింత మోహమా ?"[99]. అని అన్నారట. ఈ విషయం విజయరాఘవ నాయకుడు క్షేత్రయ్యకు తెలిపాడట. వెంటనే "వదరక పో పోవే వాడేల వచ్చిని—వద్దు రావద్దనవే"[100]. అనే పదంలో చివరి ఖండం లేకుండా రాసి, చివరి ఖండం కవీంద్రులు పూర్తిచేయాలని రాజునుకోరి సేతుయాత్రకు క్షేత్రయ్య వెళ్లాడట. కానీ కవీంద్రులకది సాధ్యంకాలేదట. సేతుయాత్రానంతరం వచ్చిన క్షేత్రయ్య సర్వం తెలిసి వెంటనే "రామ ! రామ ! యీ మేనితోనిక వాని మోము జూడవలెనా మొదటి పొందే చాలు" అని పూరించాడట. ఆ కవీంద్రులందరూ క్షేత్రయ్యను సాక్షాద్గోపాలుడవి ప్రశంసించారట. విజయరాఘవుడు సైతం సముచితరీతిని క్షేత్రయ్యను గౌరవించే ఉంటాడు.

విజయరాఘవుడు అసామాన్యమైన శృంగారలోలుపుడు. అలాంటి శృంగారలోలుపత్వాన్ని మనసారా వర్ణించి, ఆడిపాడి, అభినయించి మెప్పించగల పదకర్త క్షేత్రయ్య. పైగా మొవ్వలోనే ఆరంభమైన శృంగారప్రియత్వం నానారాజ సందర్శనం, రాజా

---

95. సీ. కు. — పు. 240, 241.

96. ఆ. కృ. శ. రా, — ఆం. ప. (1942–43).

97. V. G. V. – P. 160.

98, 99. సు. దీ. — పు. 9, 10.

100. 7. అ. వి. — పు. 184, 185.

స్థానాల సన్మానాలలో క్షేత్రయ్యలో మంచి పాకానపడ్డది. దానినే విజయరాఘవ నాయకునికి కైంకర్యంచేశాడు క్షేత్రయ్య. ఇతడు విజయరాఘవునిపై వేయిపదాలు చెప్పినట్లు పూర్వోక్తం. మనకింత వరకు విజయరాఘవ ముద్రతో లభించిన పదాలు పండ్రెండు మాత్రమే. "ఇదిగాక తంజావూరి విజయరాఘవనాయక భూపాలుని ప్రార్థనచే ఈ రాజాంకితముగా క్షేత్రయ్య పంచరత్నమని ఐదు పదములు చెప్పియున్నాడు".[101] అని సుబ్బరామ దీక్షితులు తెలిపిన ఆ ఐదు పదాలేవో, లభించిన పండ్రెంటిలో అవి ఉన్నాయో తెలియదు. కానీ కురుగంటి సీతారామాచార్యులుగారు పంచరత్నాలనబడు ఐదుపదాలలో ఈ క్రింది దొకటి అని తెలిపారు.[102]

"దొంత రవిడె ముత్తోనా—చెంతరాకుర నీకు నాయాన
ఇంతకునే గాళ గలనా—యేర ! విజయరాఘవజాణ"[103]

నిజమే ! ఈ పదం శృంగారావధుల్ని చూపించగలదిగా ఉంది. ఇలాగే పదరచనచేసి క్షేత్రయ్య విజయరాఘవనాయకుని మెప్పించి, మురిపించి, సన్మానితుడై ఉంటాడు. విజయరాఘవుని దర్శించాడు క్షేత్రయ్య అనడానికి మరో నిదర్శనంగూడ ఉంది. "విజయరాఘవుల పదకవితా రచనకు క్షేత్రయ్య పదములే యొజ్జబంతులనుటకు, పోలికల మాట యటుండ, విజయరాఘవుని 'పట్టంపు కవి' (Poet Laureate) యైన కామరసు వేంకటపతి సోమయాజి తన విజయ రాఘవ చంద్రికా విహారమున, విజయరాఘవునిపై క్షేత్రయ్య చెప్పిన పదమొకటి గ్రహించియుండుటే ప్రబల తార్కాణ. అది—

101. సు. దీ. – పు. 9. 102. సీ. కు. – పు. 361, 362.
103. 7. అ. వి. – పు. 210.

ఎఱుకల కాంభోది—ఆది[104]
"సుదిన మాయెనే యీ ప్రొద్దు సుదినమాయెనే యీ
... ... ... ... ... ... ... ...
విజయరాఘవ శౌరిని వీథిలో గంటి"[105]

అని ప్రొ.ఎస్వీ. జోగారావుగారు పేర్కొన్నారు, కాబట్టి విజయరాఘవ నాయకునిచే క్షేత్రయ్య సమ్మానితుడయ్యాడనడమే సముచితం. కాని "విజయరాఘవాంకిత పదములలో కొన్నిటియందు 'అచ్యుత విజయరాఘవ' అని కలదు. అచ్యుతుఁ డితని తాత. తండ్రి రఘునాథుఁడు. తాతపేరు చేర్చుకొని మనుమని బేర్కొనుట ఇందలి విశేషము. కాక యీ విజయరాఘవుండు వేఱు వ్యక్తిగా నుండునా ?"[106] అని రాళ్లపల్లివారు సందేహించారు. కానీ ఈ సందేహానికి ఆస్కారంలేదు. "Vijaya Raghava Nayak's grant to the Dutch"[107] అన్నదానిలో "Achyuta Sri Vijaya-raghava"[108] అని కలదు. ఇట్లే కురుగంటి వారి 'అనుబంధము'లోని ఆంగ్ల విషయంలోను 'అచ్యుత విజయరాఘవు' డనే కలదు.[109] కాబట్టి అచ్యుత విజయరాఘవ నాయకుడనడం చారిత్రకమనే తలంచవలసి ఉంది.

---

104. 7. అ. వి. – పు 218 లో ఈ పదం రాగతాళాలు 'కాంభోజి – త్రిపుట' అని కలవు. ఆం. ప. [1942 1943].
105. జో. రా. ఎ. – పు. 288, 289.
106. 7. అ. కృ శ. రా. – ఆం. ప. (1942-43) – పు. 1..
107. Proceedings of the Indian Historical Records Commision Vol. 14. P. 39. (Two Nagapatnam grants from the Batavia Museum by Prof. K. A. Nilakantha Sastry).
108. V. G. V.—Appendix. (2)-P. 189.
109. సీ. కు. – 'అనుబంధము' – 'ఘ' – పు. 384, 385.

విజయరాఘవుని ఆస్థానంలో క్షేత్రయ్య ఎంతకాలమున్నాడో ఖచ్చితంగా చెప్పడానికి తగిన ఆధారాలులేవు. కానీ తక్కిన రాజులందరివద్దకంటే విజయరాఘవుని ఆశ్రయంలోనే క్షేత్రయ్య కొంచెం ఎక్కువకాలం ఉండవచ్చునని తలంచవచ్చు. క్షేత్రయ్య తంజావూరు ఆస్థానంనుంచి గోలకొండ అబ్దుల్లా కుతుబ్షా దర్బారు ప్రవేశించి ఉండవచ్చు. అది సుమారు 1640 ప్రాంతం కావచ్చు. అప్పటికే అబ్దుల్లా కుతుబ్షా ఉచ్ఛస్థితిలో ఉన్నట్లు తెలుస్తూంది. "మహమ్మదు కుతుబ్షా యనంతరము సుల్తాన్ అబ్దుల్లా కుతుబ్షా రాజ్యముచేసెను (1626–1672). ఈ సుల్తాన్ తల్లి యొక బ్రాహ్మణ స్త్రీయట! ఆమె మిగుల చతురసంభాషణాశీలయట! తల్లి మూలకముగానే మో యీ సుల్తాన్ బ్రాహ్మణుల యందు భక్తిభావము కలవాడయి యుండెను. ఈతని దర్బారునందు వేద వేదాంగ విదులు, కవులు, పండితులు నిండుకొని యుండెడు వారట! ఈ సుల్తాన్ విజ్ఞానశాస్త్రములు, లలితకళలు, వాఙ్మయము వృద్ధిచేయుటకు ప్రయత్నించిన వాడు." "ఈతని ఆస్థానములో గణనాథుడను పండితకవి యుండెను. తులసిమూర్తి అను నొక కవి యుండెను."[110] "తులసిమూర్తి, కొరటాల రంగశాయి గోలకొండలో 17 శ. పు ఆద్యంతము లందు వెలసిన వాగ్గేయకారులు, పదకర్తలు."[111] కాబట్టి పండితపక్షపాతి, 'బలవంతుడైన గోలకొండ పాదుషా' అబ్దుల్లా కుతుబ్షాను ఆశ్రయించాడు. తన ఆస్థానంలో ఉన్న తులసిమూర్తితో క్షేత్రయ్యకు పోటీ పెట్టించాడట పాదుషా. పోటీలో క్షేత్రయ్య తులసిమూర్తి ఓడించి పాదుషాయిచ్చిన నలభై దినాలలో 1500పదాలు చెప్పాడట. పాదుషా మెచ్చి క్షేత్రయ్యకు బహుమానాలిచ్చాడట. గోలకొండ పాదుషావద్ద తులసిమూర్తి అన్న పండితుడు లేకపోవచ్చుననీ, హిందూ దేవతలపై మహమ్మదీయుడైన పాదుషాకు గౌరవం లేక

110. సా. వా. – పు. 605. 111. ర. రా. బా. – పు. 236.

పోవడంవల్ల గోపాలదేవునితోనే వాదుకలిగిందనీ, ఆ దేవుని మహిమ తోనే క్షేత్రయ్య నలభై దినాల్లో 1500 పద్యాలు చెప్పి, పాదుషాను మెప్పించాడనీ "నలుబది దినములలో నన్నుగలసి వినిపించెనే" అనడం వల్ల మంచాళ వారూహించారు.[112] కాని ఇలాకాదు. పైని వివరించి నట్లు అబ్దుల్లా కుతుబ్షా దర్బారులో తులసిమూర్తి ఉండేవాడనీ, పాదుషా హిందూ దేవతాద్వేషికాడనీ 'నన్నుగలసి' అన్న మాటకు క్షేత్రయ్యను మువ్వ గోపాలు డనుగ్రహించాడనీ తెలుస్తూంది. కాబట్టి క్షేత్రయ్య తులసిమూర్తినివాదంలో ఓడించాడనే తలంచడం ఉచితం. పాదుషా దర్బారులో క్షేత్రయ్య చెప్పినట్లు పదరచనా కాలం నలభై రోజులు ఉండకతప్పదు. మరితరువాత ఎంతకాలమున్నదీ మనకు తెలియరాలేదు.

గోలకొండ పాదుషా దర్బారులో ఉన్న సమయంలోనే క్షేత్రయ్యకు స్వగ్రామం వెళ్లాలని ఆసక్తికలిగి ఉంటుంది. ఒకసారి జన్మభూమిని దర్శించాలన్న అచంచలమైన వాంఛ కలిగి 1640 ప్రాంతంలో గోలకొండనుంచి మొవ్వకు క్షేత్రయ్య వెళ్ళి ఉంటాడని తలంచవచ్చు. దీనితో క్షేత్రయ్య జీవితం విశిష్టమైన మలుపుతిరిగింది. ఇంతవరకు శృంగారరస సముద్రంలో మునిగి తేలినవాడు క్షేత్రయ్య. తరువాత రక్తినుంచి భక్తికి తన్మూలంగా ముక్తికి జీవితపథం మారింది. ఈ సందర్భంలో రాళ్ళపల్లి వారు విన్నామన్న 'అందమైన కథను యథాతథంగా ఉల్లేఖించడమే సముచితమని భావిస్తాను.

"ఇతఁడు (క్షేత్రయ్య) తంజావూరు, మధుర మొదలగు పలువురు రాజుల యాస్థానములలో చాలమాన్యుఁడై వారినే నాయకులనుగాఁజేసి పదములు వ్రాయుచు, శృంగారరసమున మునిగి

112. జ. మం. (భా.—నవంబర్ 1970) — పు. 33, 34.

తేలుచు, ఒకనాడు స్వగ్రామమగు మువ్వకుపోయి, తన యిలవేల్పగు ఆ యూరి గోపాలస్వామిని దర్శించుటకై కాయపండ్లను దీసికొని దేవళమునకు పోయెనట. అక్కడే దేవతాదర్శనమునకన్న మొదలు ఆ దేవత నాశ్రయించయున్న దాసి కన్య యొకర్తె దర్శన మిచ్చినది. దాని తారుణ్య లావణ్యములకు ముగ్ధుడై ఇట్టి వ్యవహారములలో ఆరితేరినచేయి గావున, దానితో జంకు గొంకు లేక సరసములకుదిగి బేరమాడుటకు ప్రారంభించెను. ఆ సాని పిల్ల పూర్వపుణ్య వశమున తన కుల వ్యాపారమునకు దిగక నిజమగు దేవదాసియైన భాగవతిగా నుండి, ఇతని సయ్యాటలను తిరస్కరించెను. ఇతనికది సరిపడలేదు. ఒక పల్లెటూరి భోగపుపిల్ల తనవంటి విటరాయని వలపు నుపేక్షించినచో ఇఁక ముందు విటసంఘమందు తన పరువు దమ్మిడీకి దక్కదనికయతఁడు భావించెను. కావున 'నీవే మడిగినను ఇచ్చెదను, నన్నంగీకరింపక తప్పదు' అని పట్టు పట్టెను. ఆ పిల్ల ఈ రాజపూజితునితో ఎక్కువ కంటుగట్టుకొన్నచో తన్ను బలవంతముగానైనను ఎత్తుకొనిపోయి వ్రతభంగము చేయునేమో యనియు, భోగముదాని వ్రతము నిలుపుటకు బాసటగా వచ్చువారెవరనియు తలచి, నయముగా తప్పించుకొన నెంచి, 'నీవు రాజులెందఱనుగూర్చియో మంచిపదము లనేకములు వ్రాసిన మహాకవివి. నా సర్వస్వమగు ఈ గోపాలదేవుని గూర్చి నాలుగు పదములుచెప్పి నన్ను మెప్పించితివేని నీ వెంట వత్తును.' అని కోరెనట. 'ఇంతేనా? అదెంతప్రొద్దు?' అని యాతఁడు అక్కడే కూర్చుండి ఆకుగంటము గొని రచనచేయఁ బ్రయత్నించెను. కాని భక్తికి సంబంధించిన రసమైన యొక మాట యైనను తలకంట లేదు. ఎన్నఁడైనను దాని ననుభవించి యున్నకదా? తాను చూచి, అనుభవించి, భావించి చెప్పినదంతయు శృంగారమే. అందులోఁ గావలసియున్న వేలకొలది పదములను వెదఁజల్లఁగలఁడు. కాని ఫల మేమి? 'రామకృష్ణ గోవింద నారాయణా' వంటి వట్టి యెండు

మాటల కూర్పు తాను చేయఁజాలనిది. మఱి హారమును వదులుకొని బ్రదుకుట యెట్లు? మా యిలువేల్పగు గోపాలమూర్తి యందేమైన సత్యములున్నచో నాచే నాల్గుపదములైనను తన్ను గూర్చి చేయించి ఈ భోగపు ఛీఱుతుకకోడి పోవు బందబ్రతుకునుండి నన్ను తప్పింపఁ గలఁడు. అంతవఱ కుపవాసము. అది సిద్ధింపకున్న ప్రాయోపవేశము.' అని నిర్ణయించి ఆ మూర్తి కెదురుగా చూచుచు తదేక ధ్యానముతో కూర్చుండెను. ఆహారములేదు. నిద్రలేదు. ఇతని యనుమతి లేక దేవళమువారు తలుపు తాళములు వేయగలరా? ఇట్లు చిత్తము, చూపు గోపాలునియందు సమాహితములై రెండు మూడు దినములే కడచెనఁట. ఆ తపస్సుకు ఫలముగా శ్రీగోపాలమూర్తి ఆతనికి తన దివ్యవిభూతి దర్శనమిచ్చెను. ఆయలౌకిక రసానుభవము గల్గిన తరువాత. ఈ రాజులు — రాజ్యాలు — సానులు సంసారులు మనసున్నన కంటఁగలరా? ఎవరి గతి ఏమైనదో కాని ఆ తరువాత ఇతఁడు మాత్రము 'జై మువ్వగోపాల' యని తంబుర చేతబట్టి అవధూతుఁడై స్వచ్ఛందముగానే దేశద్రిమ్మరి యాయెను. పలువైష్ణవ క్షేత్రములను సంచరించెను. పోయినచోటనెల్ల అక్కడి దేవతపై పదములు రచించెను. అదివఱకు వ్రాసిన పదములలో అంకితమగు నాయకుఁడుగా ఏ దొరయో యుండెను. ఇప్పుడా స్థానమున 'మువ్వ గోపాలుఁడు' ప్రవేశించెను. అంతే భేదము. ఆద్యంతము అదే శృంగారమే; కాని వేఱుదారిని త్రొక్కినది."113 ఇలాగే క్షేత్రయ్య అతః పూర్వం మునిగితేలిన రక్తినుంచి విముక్తిపొంది భక్తిలో నిమగ్నుడయ్యాడు. అనేక క్షేత్రాలు, దేవాలయాలు దర్శించాడు; మువ్వగోపాల ముద్రతో అనేక పదాలు రచించ నారంభించాడు. క్షేత్రయ్య బాల్యమందే గోపాలదేవుని కృపకు పాత్రుడై "శ్రీపతి

---

1.క్షే. అ. కృ. శ. రా. (అం. ప. - ౨42-48) పు. 3, 14.

సుతు ఖారికి నేనోపలేక నినువేడితే కోపాలా మువ్వ గోపాలా" — అనే పదంతో పదరచన ఆరంభించాడని సుబ్బరామ దీక్షితులవారి కథనం.[114] ఇట్లే చిన్నతనంలోనే వరదయ్య ప్రేయసి కోరగా, భక్తితో గోపాలదేవుని ఆరాధించి, ఆ దేవుని అనుగ్రహంతో "శ్రీపతి సుతు ఖారికి" అన్న పదంతో పదరచన చేయనారంభించాడని విస్సా వారు.[115] కానీ ఈ పదంతోనే ఆరంభించినా, అది రాళ్ళపల్లి వారి కథనం ప్రకారం జరిగిందనడమే సముచితం.. కార్యకారణ సంబంధం కుదురుతూంది. అప్పటి కాతని మనస్సు పరిపక్వమైంది. అపురూప సౌందర్యవతియైన దేవదాసిమీది ప్రేమచేత తన అమితమైన శృంగార మందలి ఆవేశాన్ని భగవద్భక్తిగా మార్చివేయగలిగాడని తలంచడమే సహజ విషయం. కాబట్టి "ఏ శృంగార నాట్యము ఆతని జీవితము లౌకికముగా పరిపాలించి యుండినదో, ఆ శృంగార నాట్యమునకు తావలమైన దేవదాసి వలననే ఆతని మనస్సు మారుటలో, మానసిక తత్త్వ రహస్యమున్నది. పైగా, దేవునిపై పదములు చెప్పినతరువాత, ఇతఃపూర్వము విపరీతానుభవమగ్నమైయున్న మనస్సు లౌకికాను భూతి దాహమునకు దూరమైపోవుట సమంజసము. ఈ రీతిగా పై కథ క్షేత్రయ్య కవితాగత తత్త్వమునకు సరిపోయినది."[116]

మువ్వ గోపాలునిమీద భక్తితో చెప్పిన 'శ్రీపతి సుతు ఖారికి' అన్న పదం మొదటిదే కావచ్చు. కానీ విస్సా వారనుకొన్నట్లు క్షేత్రయ్య పదరచన కదే ఆరంభంకాదు. అంతకుముందే పదరచనలో గడిదేరి, వాదాలలో విజయం పొందిన ప్రతిభాసంపన్ను డతడు. ఇలాంటి పదాలనేకం ఉన్నాయి. [7 అ. వి. — పదసంఖ్య - 18,

114. సు దీ. — పు 9.
115. 7. అ. వి. — పు. 16, 17.
116. యా. శి. ప్ర. — పు. 67.

30, 32, 51, 73, 75, 81, 86, 88, 91, 92, 96] పై పదంతో అన్నివిధాల పోలిన ఈ క్రింది పదం తిలకించండి.

"ఏలా దయ సేలరా—నే నీకు బగదానసా ?
చాలా వలచినానురా గో—పాలా ! ॥ ఏలా ॥
తరితీపేల జేసేవు ? — తగవా యింటికిరావు
కరుణతో ననుజూడవు గోపాలా ! ॥ ఏలా ॥
చనువు లీయవు నామీద నీ కింక — చలమేలరా ?
నను వంటిది నీకు వింత గోపాలా ? ॥ ఏలా ॥
శ్రీనిధి మువ్వ గోపాల — చెలులలో నను జాల
రా విం ( ? ) చి యేలితివీ లీల - గోపాల ॥ ఏలా ॥"117.

కాబట్టి క్షేత్రయ్య పదరచనాదక్షుడై యుండి, తరువాత మొవ్వలో శ్రీ మువ్వ గోపాలదేవునిపై దేవదాసి మూలంగా భక్తితో పదరచన చేయనారంభించి, మధుర భక్తుడయ్యాడనడమే సముచితం.

## 1.5 దర్శించిన దేవాలయాలు :

భక్తిపారవశ్యంతో పదాలు పాడుతూ క్షేత్రయ్య అనేక దేవాలయాలు సందర్శించాడు; సందర్శించిన ప్రతిదేవుని మీద ఆ దేవుని ఉపముద్రతోపాటు — ప్రధానమైన మువ్వగోపాల ముద్రతో పదాలు రచించాడు. కాని ఎప్పుడెప్పుడేయే దేవాలయాలు సందర్శించాడన్నది ఇదమిత్థంగా చెప్పడానికి తగిన ఆధారాలు లేవు. ఏయే పదాలేయే సందర్భాల్లో చెప్పాడో చెప్పడంగూడ కష్టమే. అలాంటి కొన్ని ఊహలు మాత్రమున్నాయి. క్షేత్రయ్య కంచివరదుని మీద చెప్పిన పదాలెక్కువ. ఈ పదాల్లో 'వరద'

117. 7. అ. వి, — పు. 203, 204.

నామం ఆత్మపరమైందనీ, దీనివల్లనే క్షేత్రయ్య అసలు పేరు వరదయ్య అనీ విస్సావారు నిర్ణయించినట్లు పూర్వోక్తం. కంచివరదునిపై చెప్పిన పదాల్లో 'వరదయ్య' ఆత్మీయ విషయాలు స్ఫురిస్తున్నా యనడం ఉచితమే. కానీ వరదయ్య ప్రేయసి అయిన దేవదాసిని గురించిన విషయమని విస్సావారు తలంచి నట్లు మాత్రంకాదు.[118] మధురభక్తిపరుడుగా క్షేత్రయ్య మారిన తరువాత కంచివరదుని దర్శించి, తన పేరు స్ఫురించేట్లుగాను, తాను ప్రేయసిగాను, కంచివరదుడు–భగవంతుడు ప్రియుడుగాను వర్ణించా డనడమే సమంజసం. ఈ సందర్భంలోనే "కంచివరదుని మీది పదము లనేకము లున్నవి"–అని రాళ్ళపల్లి వారు చెప్పిన కథ స్మరించదగ్గది. "ఒకనాఁడితఁడు కంచివరదరాజుల దేవళమందు రాత్రి పూజను దర్శించినాఁడు. అక్కడ అమ్మవారగు శ్రీ పెరుందేవి దేవళము దిగువను, మీఁది యంతస్తున - హస్తగిరిమీఁద - వరదుని దేవళమును ఉన్నవి. రాత్రి వరదునికి శయ్యాసనము సమర్పించి అర్చకులు, భక్తులు అమ్మవారి విగ్రహమును మిద్దెమీఁదికి విజయం చేయించి, తలుపులు బిగించి, వినియోగములు ముగించి, ముడిగట్టుకొని తాళ ముద్రలు వేసి వెడలిపోయిరి. ఏ మూల చీఁకటి కంబమునకో చేరఁ గిలఁబడి కన్నులు మూసికొనియున్న యీ పదాల పిచ్చయ్య నెవరును గమనింపలేదు. ఇతని యంతరదృష్టి యంతయును కేళీ మందిరములోని అమ్మ అయ్యల అలౌకిక శృంగార రసానుభవ భావనలో లీనమైయున్నది. ఆ సమాధిలోనే రాత్రియంతయుఁ గడచినది. తెల్లవాఱుజామున ఇతఁడు యోగనిద్ర మేల్కొని కన్నుల తెఱవఁగా మిద్దెమెట్లనుండి దిగివచ్చుచున్నట్లు ఒకానొక దివ్యస్త్రీ వ్యక్తి కనిపించెనఁట. వెంటనే యీ క్రింది పదము ప్రత్యక్ష మైనది. మోహనరాగము — జంపె.

---

1.8. 7. అ. వి. – పు. 25–31.

"మగువ తన కేళికా-మందిరము వెడలెన్
వగకాడ మా కంచి-వరద తెల్లవారె ననుచు ॥మగువ॥" 119.

ఇది ఆనాటి క్షేత్రయ్య మానసికస్థితికి తగినట్లుగానే ఉంది. విస్సావారు ఈ పదం విజయరాఘవుని కోటలో ప్రత్యూష సమయంలో క్షేత్రయ్య వెళ్లుతూండగా పట్టపురాణి కేళికామందిరంనుంచి రాగా రచించినట్లు పేర్కొన్నారు. 120 కాని ఇది సముచితంకాదు. పైని పేర్కొన్నట్లు కంచిలో క్షేత్రయ్య రచించాడనడమే సహజం. భద్రాచలంవెళ్లి శ్రీరాముని దర్శించినప్పుడు క్షేత్రయ్య "రామరామ ప్రాణ సఖి నెడబాసి-రాముడెటువలె దాళెనో ? ముందు."121 అన్నపదం రచించి ఉంటాడని రజనీకాంతరావుగారూహిస్తున్నారు.122 ఇట్లే పుణ్య క్షేత్ర, దైవదర్శనాలు చేస్తూ బహుశః క్షేత్రయ్య 'పామిడి' గ్రామంగూడ వెళ్లి ఉండవచ్చు. పామిడిగ్రామంలో గల అనేక దేవాలయాల వివరణ 'Descriptive catalogue'లో కలదు.123 కాని ఆ దేవతలపై పదాలుచెప్పినట్లు తెలియదు. అయినా "అనుకోప నేమున్నది? — అక్కరలేనందుకు"124 అన్నపదంలో 'పామూడిజోగివలె పాయెనా బ్రతుకు'-అని ఉంది. ఇది బహుశః క్షేత్రయ్య ఆ పామిడి లోని దేవాలయాల సందర్శన సమయంలోగాని, తరువాతగాని చెప్పి

119. అ. కృ. శ. రా. (ఆం. ప. 1942-43) పు. 25.

120. 7. అ. వి.—పు. 25-31.

121. సీ. గి. వేం. — పు. 176, 177.

122. 7. అ. వి. — పు. 233, 239.

123. D.C. T. [Meckenzie Local tracts Vols] in tth Govt. Oriental MSS. Library, Madras, Vol XIV - Telugu Local Tracts.
(i) Vol, 107. M 319 Pamudi Village - P. 112, 113.
(ii) M 737 - పాముడి (Pamudi) -P 287, 288.

124. 7. అ వి. — పు. 95-98;

ఉంటాడని ఊహించవచ్చు. ఇంతవరకు లభించిన పదాలను బట్టి చూడగా 18 దేవాలయాలను దర్శించి ఆయా దేవతలపై పదాలు చెప్పాడు."క్షేత్రయ్య చూసిన క్షేత్రాలను జిల్లాలవారిగా తాలూకాల విభజనతో" ఆరుద్రగారు పొందుపరచారు[125]. అన్నిటికంటే అధిక సంఖ్యలో కంచివరదునిపై 17 పదాలు లభించాయి. తిరుపతి వెంక టేశునిపై 5 పదాలు, చిదంబరం తిల్లగోవిందస్వామిపైన, తిరు వళ్లూరు వీరరాఘవునిపైన నాలుగేసి పదాలు గలవు. కరిగిరి వరదుని మీద, చెవ్వంది లింగనిమీద మూడేసి పదాలున్నాయి. యదుగిరి చెలువరాయడు, వేదపురి నిలయుడు, సత్యపురి వాసుదేవుడు, ఇన పురిస్వామి, శ్రీ నాగశైల మల్లికార్జునుడు, శ్రీ రంగేశుడు, ఆదివరాహుడు - అనే దేవతలపై రెండేసి పదాలు గలవు. 'వేద నారాయణుడు' ఎచ్చటున్నాడో తెలియదన్నారు విస్సావారు. కందాడై అప్పన్ కృష్ణమాచార్యులుగారు 'వేదపురి' ని 'వాదపురి' అని తలంచారు.[126] కాని 'వేదపురి' నిలయుడు, వేదనారాయణు డనగా చెంగల్పట్టు జిల్లాలోని వేదనారాయణ పురంలో వెలసిన దేవుడని ఆరుద్ర గారు నిర్ణయించారు. ఇంక చలువ చక్కరపురి నిలయుడు, కోవళ్లూరు మువ్వగోపాలుడు, కడప వెంకటేశుడు, పాల గిరిచెన్నుడు, హేమాద్రిస్వామి, మధురపురీశుడు, శ్వేతవరాహుడు- అనే దేవతలపై ఒక్కొక్క పదం చొప్పున ఉన్నాయి. ఇలాగా అనేక దేవాలయాలను దర్శించి ఆయా దేవతలపై అనేక పదాలు రచించి ముక్తికాంతను గోరిన క్షేత్రయ్య జీవిత పరిసమాప్తి ఎలా జరిగిందో ఇంతవరకు జరిగిన పరిశోధనలవల్ల తేలలేదు. "తరువాత అతఁడెట్లు, ఎక్కడ, ఎప్పుడు అంతర్థానమైనాఁడో తెలియదు."[127]

---

125. ఆ — సం. 11 — పు. 22.
126. వా. ప్ర. — రెండవ భాగము — పుట. 6.
127. ఆ. ఆ. శ. రా. [ఆం. ప్ర. 1642—48] — పు. 14.

## 1.6 జీవితకాలం :

పై సుదీర్ఘ పరిశీలనానుసారం క్షేత్రయ్య జీవితకాలాన్ని కొంతవరకు మనమూహించవచ్చు. 1600 ప్రాంతంలో క్షేత్రయ్య జన్మించిఉంటాడని విస్సావారి ఊహ.[128] "క్షేత్రజ్ఞులు క్రీ.శ. 1625-30 ప్రాంతములనుండి క్రీ.శ. 1670-75 వరకు దక్షిణాదిని పాలించిన కొంతమంది ప్రభువుల ఆస్థానములలో తన పదములు పాడినట్లు ఆధారములు కనబడుచున్నవి. కనుక 1605-10 ప్రాంతములయందు జన్మించి 1680 ప్రాంతమువరకు జీవించియుండవచ్చునని అనుకొనవచ్చును"[129] అన్నది మంచాళవారి తలంపు. క్షేత్రయ్య ఆశ్రయించిన రాజులకాలం 1595 నుంచీ 1672 వరకు విస్తరించి ఉన్నట్లు తెలిసింది. ఈ రాజులను క్షేత్రయ్య ఆశ్రయించినకాలం సుమారు 1615 నుంచి 1640 వరకు అనుకొంటే తరువాత గోలకొండ పాదుషా అబ్దుల్లా కుతుబ్షా దర్బారు నుంచి మొవ్వకు క్షేత్రయ్యవెళ్ళి, ఆ తరువాత దేవదాసిమూలంగా 'మువ్వగోపాల' భక్తుడుగా మారి ఆ వెనుక అనేక దేవాలయాలను సందర్శించి మొత్తం దక్షిణదేశమంతటా పర్యటించాడంటే సుమారు 25, 30 సం. లైనా జీవించి ఉంటాడనుకోవడం సమంజసమే. కాబట్టి తుపాకులకృష్ణప్ప నాయకుని ఆశ్రయించేసరికి క్షేత్రయ్యకు సుమారు పాతికేళ్లు ఉండవచ్చు. అందువల్ల క్షేత్రయ్య 1590 ప్రాంతంలో జన్మించి 1675 వరకు జీవించి ఉండవచ్చునని భావించవచ్చు. "నారాయణ తీర్థుల కృష్ణలీలా తరంగిణిలోని తరంగాలు, సిద్ధేంద్రుని యక్షగానాలూ, లీలాశుకుని కృష్ణకర్ణామృత శ్లోకాలూ క్షేత్రయ్య పదాభినయమూ పారంపర్యంగా కూచిపూడివారి ప్రదర్శనలలో తప్పని అంశాలు. వీరిలో

---

128. 7. అ. వి. – పు. 21

129. 7. అ. వి. – పు. 32.

ముగ్గురు అనగా తీర్థులూ, సిద్ధేంద్రయోగీ, క్షేత్రయ్యా తమ రచనలతో కూచిపూడివారి నాట్య సంప్రదాయానికి తోడ్పడ్డారని అనుకోవచ్చు."[130] — అన్న రజనీకాంతరావుగారి మాటలనుబట్టి నారాయణతీర్థులకు సిద్ధేంద్రయోగికి సమకాలికుడు క్షేత్రయ్య అంటే పైనూహించిన అతని జీవితకాలం గూడా సరిపోతూంది.

## 1.7 జీవిత రహస్యం :

క్షేత్రయ్య జీవితచరిత్ర ముగించే ముందు అతని జీవిత తత్త్వమెలాంటిదో తెలుసుకోవడం అవసరం. ఇది అతని పదకవితా వైశిష్ట్య వివరణలో ఉపకరించగలదు. దీని ఆధారంతో తరువాతి ప్రకరణాలను మలచుకోవడం సులభమవుతుంది. అతని జీవితంలో పూర్వభాగం రక్తి నాశ్రయించింది. ఉత్తరభాగం కేవలం భక్తి మూలకమైంది. అదిగూడ మధురభక్తి. వీటిని నిరూపించగల సాధనాలు రెండు. మొదటిది రాజాశ్రయంనుంచి తిరిగి మొవ్వకు వచ్చాక దేవదాసి మూలంగా ఆతని జీవిత విధానంలో వచ్చిన మార్పు. అంతకుముందున్న కేవల లౌకిక శృంగారం మారిపోయి అలౌకిక శృంగారంలో మనస్సు లీనంకావడం. దేవదాసిని వలచి, ఆమె కోరికననుసరించి మువ్వ గోపాలస్వామిని గూర్చి తపస్సు చేసి, ఆ దేవుని కృపకు పాత్రుడు కావడం. దానితో అతః పూర్వం ఉన్న ఇహలోక సంబంధమైన శృంగారం పరిత్యజించి గోపాలదేవుని పరమ భక్తుడుగా మారిపోవడం. తానొక స్త్రీననీ, గోపాలదేవుడే ప్రియుడనీ మధురభక్తి పూరితుడు కాగా "శ్రీపతి సుతుబారికి" — అన్న పదం అప్రయత్నంగా ఆతనినోటినుంచి వెలువడింది. రెండోసాధనం ఆతని పదాలు; వీటన్నిటినీ ఆతని జీవితంలాగే రెండు విధాలుగా విభజించడం కొంత కష్టసాధ్యమనే తలంచాలి. "వేడుకతో నడచు

---

130. ర. రా. ఔ. – పు. 129.

కొన్న - విటరాయడే"— అన్నపదంలో మధుర తిరుమల నాయకుని పైన, విజయరాఘవునిమీద, గోలకొండ పాదుషాపైన చెప్పిన పదాలు 4500 (4100 ?) అని క్షేత్రయ్య చెప్పుకొన్నాడు. కాని ఇందులో పేర్కొనని తుపాకుల కృష్ణప్ప, రఘునాథ నాయకుల మీద ఎన్ని చెప్పాడో తెలియదు. కాని రాజులమీద చెప్పిన పదాలు మనకింతవరకు లభించినవి విజయరాఘవముద్రగలవి 12, తుపాకుల కృష్ణప్ప నాయకుని ముద్రగలవి 3 మాత్రమే కలవు. వీటితోపాటు విస్సావారు 'అముద్రితములు' అని ప్రకటించిన వాటిలోని "ఈడకే తోడితెత్తునో ఓరీ హాయలుమీర ఉవిదనిన్ను వస్తేనో ॥ఈ॥" అన్నపదంలో 'విజయరాఘవేంద్ర' అన్న ముద్ర ఉంది. రాజాంకితపదాలలో 'మువ్వగోపాలముద్ర' లేదు. కనుక రాజాంకితాలైన పదాలనేకం లభిస్తే ఈ విషయం పరిశీలించడానికి ఎక్కువ అవకాశముండేది. రాజాంకితాలైన పదాలన్నీ రాజాశ్రయంలో ఉన్న ఈ సమయంలో ఆయా రాజులమీద చెప్పిన పదాలవడానికి ఏవిధమైన ప్రతిబంధకమూ ఉండనక్కరలేదు. విస్సావారికంటే గిడుగువారిచ్చిన అదనపు కొత్త 12 పదాల్లోను 'మువ్వగోపాలముద్ర' లేదన్నారు ఆరుద్రగారు.[131] వీటికి తోడు విస్సావారి ప్రతిలోని 4, 77, 230 అన్నమూడు పదాల్లోను 'మువ్వగోపాలముద్ర' లేదు.[132] కాని ఆరుద్రగారిచ్చిన గిడుగువారి ప్రతిలోని 2-65, 2-71, 3-58 మూడు పదాలూ,[133] పైనిపేర్కొన్న విస్సావారి ప్రతిలోని 4, 77 పదాలూ మూడో చరణ రహితంగా ఉన్నాయి. అందులో 'మువ్వగోపాలముద్ర' ఉండవచ్చునని ఆరుద్రగారి ఊహ. కాబట్టి ఈ అనుమానాస్పదమైన ఐదు పదాలు తొలగిస్తే

131. ఆ. ౼ 11 పు. 195

132. 7. అ. వి. — పు. 3, 52, 151.

133. సీ. గి. వేం. — పు. ప. 76, 77, 79, పా. 8.

గిడుగువారి ప్రతిలోని (1-20, 1-28, 2-97, 3-2, 3-18, 3-62, 3-74, 3-89, 3-94) 9 పదాలూ, విస్సావారి ప్రతిలోని 230 పదం కలిసి 10 పదాల్లో 'మువ్వ గోపాలముద్ర' కన్పట్టదు. కాబట్టి ఈ పదరచన సైతం క్షేత్రయ్య రాజుల ఆశ్రయంలో ఉన్న కాలం లోనే సాగి ఉంటుందని తలంచవలసి ఉంది. అంటే రాజాంకితాలై లభించిన [విజయరాఘువ -12, తుపాకుల -3] 15 పదాలూ, 'మువ్వ గోపాల ముద్ర' లేని పై 10 పదాలూ కలసి మొత్తం 25 పదాలు మాత్రమే- క్షేత్రయ్య రాజాస్థానాల్లో ఉండగా రచించినవి — ఇంత వరకు మనకు లభించాయి. తక్కిన పదాలన్నీ — మువ్వగోపాల ముద్రగలవి - క్షేత్రయ్య భక్తుడుగా మారాక లభించిన పదాలని తలంచవచ్చు. ఏఏ రాజులను తానాశ్రయించిందీ చెప్పుకొన్న "వేడుకతో నడచుకొన్న విటరాయడే" అన్న పదంలో 'మువ్వగోపాల ముద్ర' ఉంది. కాబట్టి ఈ పదం పూర్వాశ్రమంలో తానే యేరాజుల నాశ్రయించి ఎన్నెన్ని పదాలు చెప్పాడో, తాను భక్తుడుగా మారాక చెప్పుకొన్న పదమనే - పై సిద్ధాంతాన్ననుసరించి - మనం తలంచాలి. మొదట రచించిన పదాల్లో రక్తి అంటే లౌకికమైన శృంగారమూ, తరువాతి పదాల్లో భక్తి అంటే అలౌకిక శృంగారమూ నిరూపించ గలిగితే పై సిద్ధాంతం అంగీకరించవచ్చు. కాని దీనికి ఒకటిరెండు ప్రతిబంధకాలున్నాయి. రాజాస్థానాల్లో ఉండగా చెప్పిన పదాలన్నవాటిలో 'మువ్వ గోపాలముద్ర' ఉంది. ఇవి ఎన్నో లేవు; ఒకటి రెండు మాత్రమే. తంజావూరు రఘునాథనాయకుని క్షేత్రయ్య ఆశ్రయించిన సమయంలో రఘునాథుని ఆస్థానకవి చేమకూర వేంకటకవి 'విజయ విలాసంలోని' "ఎగుభుజంబులవాఁడు" (2-164) అన్న పద్యాన్ని, క్షేత్రయ్య "ఎంతచక్కనివాడే నా సామివీ - డెంతచక్కనివాడే" అన్న పదంలో అనుకరించాడన్నది పూర్వోక్తం. ఇందులో 'మువ్వగోపాలముద్ర' ఉంది. మరో

కటి, విజయ రాఘవుని ఆస్థానంలో ఉండగా క్షేత్రయ్య "వదరక పోపో-వాడేల వచ్చీని - వద్దురావద్దనవే" — అన్న పదంలో చివరి రెండు పంక్తులు ఆస్థానకవులచే పూరింపించమని రాజుకు తెలిపి, సేతు యాత్రకు వెళ్లివచ్చాక, వారికి సాధ్యంకాకపోగా, తానే పూరించాడన్న ఐతిహ్యముంది. ఇందులోను 'మువ్వగోపాలముద్ర' ఉంది ఇది కేవలం జనశ్రుతిగావచ్చు. విజయరాఘవునకు క్షేత్రయ్యపై గల మన్ననను తెలిపితే తెలుపవచ్చుగాక. కాని ఆ సమయంలోనే రచించాడని నమ్మడానికి ఆస్కారంతక్కువ. ఇంక రఘునాథుని కాలంలోనే 'ఎంతచక్కనివాడే' అన్నపదాన్ని రచించవలసిన పని లేదు. తనకు తెలిసినవిషయం - ఆవెనుక క్షేత్రయ్య భక్తుడుగా పూరాక రచించాడంటే వచ్చే ప్రమాదం లేదుగదా? లేదా ఈ అనుకరణ కేవలం యాదృచ్ఛికమైనా కావచ్చు. పైగా ఆయా రాజుల కాలంలో పై పదాలు క్షేత్రయ్య చెప్పలేదన్నంత మాత్రానవచ్చే ముప్పుగూడలేదు. కారణం ఈ రెంటినిగూర్చిన ప్రశంస తీసివేసినా రఘునాథ, విజయరాఘవ నాయకుల ఆస్థానాల్లో క్షేత్రయ్య ఉండేవాడన్న చారిత్రక సత్యానికి ఏ విధమైన విఘాతమూ కలగదు. పోతే మధుర తిరుమల నాయకుని సైతం క్షేత్రయ్య ఆశ్రయించాడు. అతనిమీద చెప్పబడిన పదాలు మనకు లభించలేదు. "మధురలో క్షేత్రయ్య పాడినవన్నీ మువ్వగోపాల పదాలే కావచ్చు."[134] అని ఆరుద్రగారు తలంచుతున్నారు. కానీ అది సరికాదు; ఆరచించినవి ఆ రాజుమీదనే; కాని అవి మనకు లభించలేదు. కాబట్టి మువ్వగోపాలముద్ర లేని పదాలే రాజాశ్రయాల్లో ఉండగా క్షేత్రయ్య రచించిన వనడమే సిద్ధాంతం. అయితే రాజాశ్రయాల్లో ఉండగా రచించిన పదాల్లోని రసికతకు, మువ్వగోపాలముద్రతో కూడిన

---

134. ఆ, — సం. 11, పు. 90.

పదాల్లోని భక్తికితేడా ఉందా? వీటిని తేల్చిచెప్పడం కొంతవరకు కష్టమే. కారణం - కొందరనుకొన్నట్లు-మువ్వ గోపాలపదాల్లోనే పచ్చిశృంగారం ఉంది. ఉదాహరణకు-7. అ. వి. -231, 300, 102, 150, 151, 84 పదాలు పరిశీలించవచ్చు. సభ్యమూ, అసభ్యమూ అనేది మనం చూచే చూపులో ఉంది. 'మువ్వగోపాలముద్ర' ఉన్న పదాల్లోను, లేనిపదాల్లోను గూడ ఈ శృంగారానికి కొదవలేదు. కాని దేవదాసిమూలంగా జరిగిన మహాసంఘటనతో క్షేత్రయ్యలో పూర్వజన్మ సుకృతంవల్ల భక్తిభావన జాజ్వల్య మానమై ప్రకాశించింది. అదేమధురభక్తిగా రూపొందింది ఆతని పదాల్లో. ఇందుకు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి మాటలుబహుధా ఉపకరిస్తున్నాయి-కాదు ఈ సిద్ధాంతాన్ని స్థాపిస్తాయి. క్షేత్రయ్య గోపాలదేవుని అనుగ్రహానికి పాత్రుడయ్యాక దేశద్రిమ్మరి అయ్యాడు. "పలువైష్ణవ క్షేత్రములను సంచరించెను. పోయినచోటనెల్ల అక్కడి దేవతపై పదములు రచించెను. అదివఱకు వ్రాసిన పదములలో అంకితమగు నాయకుడుగా ఏదొరయో యుండెను. ఇప్పుడాస్థానమున 'మువ్వ గోపాలుఁడు' ప్రవేశించెను. అంతేభేదము. ఆద్యంతము అదేశృంగారమే; కాని వేఱుదారిని త్రొక్కినది."[135] ఆ తరువాత రచించినవన్నీ భక్తి పరకాలు. అయినా రక్తిగాని, భక్తిగాని 'మువ్వగోపాల ముద్ర' లేనివే రాజాశ్రయాల్లో రచించినవీ, ఉన్నవి భక్తుడయ్యాక రాసినవీ అని తలంచడమే సిద్ధాంతం. అయితే మువ్వగోపాలముద్ర లేని పదాలు, రాజాంకితాలైన పదాలు విరివిగా లభిస్తేనే నాయీ సిద్ధాంతానికి బలం చేకూరగలదు. అందుకై నిరీక్షించవలసిందే! కాబట్టి ఈ రక్తి భక్తులమీదనే ఆధారపడిఉంది క్షేత్రయ్య జీవితరహస్యం; రక్తిభక్తుల పరిమేళనమే క్షేత్రయ్య పదసాహిత్యం!

---

135 అ. కృ. శ. రా. – ఆం. ప. (1942–43) – పు. 14.

# 2. పదకవిత - పుట్టు పూర్వోత్తరాలు

పదకవితా లక్షణం తెలిపి, సంస్కృతం మొదలైన భాషలలో ఇది ఎప్పుడారంభమై, ఎట్లు వికాసం పొందిందో క్లుప్తంగా వివరించడమే ఈ ప్రకరణోద్దేశం. ఇది ఉత్తరోత్తర ప్రకరణాల్లో పరిశీలించబోయే క్షేత్రయ్య పదకవితా వైశిష్ట్యానికి నేపథ్యంగా ఉపకరించగలదు.

తెలుగు సాహిత్యంలో క్షేత్రయ్యకు పూర్వమూ, తరువాతా, పదకవిత ఉన్నప్పటికీ, అతని పదకవితకు విశిష్టత ఉంది. దాన్ని తెలుసుకొనేముందు పదకవితావిర్భావ వికాసాలనుగూర్చి గుర్తించడం అవసరం. పదపద్యకవితలలో పదకవిత్వమే ముందావిర్భవించిందనడం సర్వజనాంగీకృత విషయం. ప్రాక్తన మానవుడు సుఖదుఃఖాది అనుభూతులను పొందినపుడు, తదనుగుణంగా ఆడిపాడుకొనడంలోనే ఈ పదకవిత పుట్టింది. అదే కాలాంతరంలో సంస్కరించబడి పద్యకావ్యంగా, ప్రౌఢ కావ్యంగా, పండిత కావ్యంగా అంగీకరించబడి— గౌరవపాత్రమైంది. పదకవిత పండితామోద ముద్ర నెంతమాత్రమూ పొందకపోయినా, విద్వద్గోష్ఠులలో ప్రస్తావించబడకపోయినా, రాజగౌరవం సంపాదించకపోయినా ధానిదారి నది నడుస్తూనే ఉంది;

అభివృద్ధిచెందుతూనే ఉంది; సామాన్య ప్రజల మన్ననలకు పాత్ర మవుతూనే ఉంది; చివరికి పండితులచే సైతం సమాదరించబడింది.

## 2.1 ఆవిర్భావం :

ఈ పదకవితావిర్భావాన్ని గూర్చి చక్కగా వివరించారు పింగళి లక్ష్మీకాంతంగారు. "ఈ పాడదగిన కావ్యమునకు పదమని పేరు". "ఏ వాఙ్మయమునందైనను ఈ పదకవిత్వము పద్యకవిత్వము కంటె ముందు పుట్టి పెరుగుననుట బహుజనాంగీకృతమైన సిద్ధాంతము. చిత్ర విచిత్రకార్య కమనీయ పర్వతారణ్యమయమైన ప్రకృతిలో పుట్టి పెరిగిన ప్రాకృత జీవియగు ప్రాక్తన మానవుని హృదయమున సంతోషమయమో, దుఃఖమయమో యగు నొకా నొక భావము జనించి, పరవశునిచేయగా, ఆతని నోటివెంట అప్రతర్కితముగా ఒక పాట వ్యక్తమైయుండుననియు, ఆవేశపూరితుడై ఆతడా పాటను చిందులుత్రొక్కుచు పాడియుండుననియు, 'ఆట-పాట' లేక 'నృత్య గీతము' (Ballad-dance) అని పేరు పెట్టవచ్చుననియు, అదియే కవిత్వమునకు శ్రీకారమనియు, ఈ సిద్ధాంతముయొక్క సారాంశము.[1]

"ఈ 'ఆట—పాట' లో మూడు భిన్నకళాంశములు కలవు. అడుగువేయుట, రాగముతీయుట, మాటపలుకుట; శాస్త్రపరిభాషలో ఈ మూడింటికి నృత్యము, గీతము, శబ్దము అని పేరు. ఈ మూడు అంశములును మూడు శాఖలుగా కాలక్రమమున నాట్యము, సంగీతము, పద్యము అనెడి కళలుగా పరిణమించి వేని రాజ్యమును అది యేలుకొనసాగెను.[2] కాని ఈ మూడిటికిని జన్మస్థానమొక్కటియే.

---

1. (i 118 M. R. G. — P. 13, 14, (ii) 119. M. R. G. — P. 605.
2. పై (i) లోనిదే — పు. 440.

అవి స్వతంత్రతా నిరూపణార్థము ఎంత విడిపోయినను పరిణత సంపూర్ణ స్వరూపములో మరల ఏకీభవించుచుండును.

"ఈ పదకవిత్వమున శబ్దమున కెంత ప్రాధాన్యమున్నదో, గీతికకును అంతే ప్రాధాన్యమున్నది. అనగా ఇందు సుందర శబ్ద రచనతోపాటు, మధురమైన పాటయును కలిసియుండును."[3]

పదకవితనుంచే పద్యకవిత్వ ముద్భవించిందనీ, పదమే ప్రాచీన మనీ రాళ్ళపల్లివారి అభిప్రాయం. "మనదేశములో చాల ప్రాత పాటలు వేదసూక్తములు. మనుష్యజాతికే అవి మొదటి రచనలు అని యూహింపవలసినవి ... ఈ రాగతాళములు రెంటిని కలిపి హృదయంగమములైన భావములను వెలువరుచు భాషను అలంకరించుటయే పదరచనకు పరిపూర్ణ స్వరూపము; దాని పూర్ణానుభవమును మన కప్పుడే. సతాళముగనో, వితాళముగనో కావ్యకళా రసానుభవమును ప్రాచీన మనుష్యజాతి పాట రూపముననే అనుభవించి రసించినదని పండితు లూహింతురు. మన పద్యములన్నియు పదముల పరిణామములే అని భావించుటకు పెద్ద సూక్ష్మదృష్టి అక్కరలేదు."[4]

## 2.2 సంస్కృతాది భాషల్లో పదకవిత :

తెలుగు వాఙ్మయంలోని పదకవిత్వానికంటే ముందు సంస్కృతాది భారతీయ భాషలలోని పదకవితావిర్భావ వికాసాలను తెలుసుకోవడం అవసరం. భక్తితత్త్వం భారతీయతత్త్వం; భక్తితోపాటు పదకవిత సైతం ప్రారంభమైంది. నిజానికి వేదసూక్తాలే మొట్టమొదటి పదాలన్న రాళ్ళపల్లివారి మాట పూర్వోక్తం. సామవేదం గానయోగ్యమైందన్న సంగతి సర్వజన విదితమే. భరతమహర్షి ధ్రువా

3. 60. ల. పిం.—పీఠిక. – పు 20 - 26.

4. 16. ఆం, షా, అ. – పు. 12, 8,

గానాన్ని నాట్య శాస్త్రంలో వివరించాడు. అంటే భరతముని కాలానికే ఈ ధ్రువాగానం ఉందని స్పష్టం. 13 శ. నాటికే శార్ఙ్గదేవుడు తన సంగీత రత్నాకరంలో చెప్పిన ప్రబంధరీతులన్నీ సంస్కృతంలో ఉన్నట్లు మనం గమనించవచ్చు. తదనంతరం అభినవగుప్తాచార్యుడు అభినవభారతిలో రాగకావ్యాలనబడే ప్రబంధాలనుగూర్చి పేర్కొన్నాడు. అతఃపూర్వమే 11 — 12 శ. ల మధ్యకాలంలో వెలసిన 'గీతగోవింద'మనే మధుర కావ్యంలో జయదేవుడు రాధాకృష్ణుల ప్రేమను అభివర్ణించి తరించాడు. వాస్తవానికి మధురభక్తికిదే ఆరంభం. ఇందు రాధాకృష్ణుల ప్రేమజీవేశ్వరుల సంబంధాన్ని చాటుతూంది. గీతగోవిందం అష్టపదులలో రచితం. జయదేవుని తరువాత సంస్కృతంలో పేర్కొనదగ్గ వాగ్గేయకారుడు లీలాశుకుడు. ఈతని కృష్ణ కర్ణామృతంలోని శ్లోకాలు భక్తికి పరిపూర్ణ నిధులు. సంగీత సభలలో, భజనకూటాలలో వీటికి ఎనలేని ప్రచారం ఈ నాటికీ ఉంది. లీలాశుకుడు 13 శ. కి చెందినవాడు. అంటే జయదేవుని తరువాత నూరేండ్ల కవతరించిన మహానుభావుడు. యావద్భారతంలో లీలాశుకుని భక్తి సముద్రంలో ఓలలాడనివాడు లేడంటే అత్యుక్తికాదు. భారతీయ భాషల్లో భక్తి గీతాలు రచించబడడానికి కారణం బౌద్ధసిద్ధుల తాత్విక చర్య గీతాలే కారణమంటారు రాఘవన్ గారు.[5] ఈ విధంగా భారతదేశంలో భక్తి గీతాలు ఆరంభమయ్యాయి. కృష్ణభక్తికి వంగదేశం ఆటపట్టు. కృష్ణభక్తిని ప్రతిపాదించినవాడు వల్లభాచార్యుడు. ఇతని 'అష్ట ఛాప్' అనే ఎనమండుగురు శిష్యులలో ప్రధానమైనవాడు సూరదాసు. హిందీలో కృష్ణభక్తితో మైమరచి కవితచెప్పి ఇతరులను మురిపించిన వాడితడే. సూరదాసు పదాలు భక్తిఘుటికలు; రసకళికలు. వంగదేశంలో వల్లభాచార్యుని తరువాత కృష్ణభక్తిపారమ్యం పొందిన

5. R. V.—P. 19.

వాడు చైతన్యస్వామి [1486-1534]. చైతన్యస్వామి సంస్కృతంలో రెండు స్తోత్రాలు మాత్రమే రచించినా, ఆయన శిష్యులు వంగ, సంస్కృతభాషల్లో అపారమైన కృష్ణభక్తి సాహిత్యాన్ని సృష్టించారు. విద్యాపతి మైథిలీ భాషలో క్రీ. శ. 14 శ. రాధాకృష్ణ భక్తి ప్రతిపాదకాలైన ఎన్నో పదాలు రచించాడు. ఇతడు మన క్షేత్రయ్యతో అన్నివిధాల సరితూగగల వాగ్గేయకారుడు. విద్యాపతి పదాలను చైతన్యస్వామి ఆలపించి తన్మయత్వం చెందేవాడట. వంగభాషలో కృష్ణభక్తి పదాలు రచించిన మరో పదకర్త చండీదాసు. ఈ ఇద్దరు పదకర్తలగూర్చి ప్రశంసించిన శ్రీ అరవిందుల వాణి స్మరించ దగింది. "The desire of the soul for God is there thrown into symbolic figure in the lyrical love cycle of Radhakrishna...This accomplished lyrical form springs at once to perfect birth from the genious of the first two poets who used the Bengali tounge, Vidyapathi, a consummate artist of word and line, and the inspired singer, Chandidas in whose name stand some of the sweetest and most poignant and exquisite love lyrics in any tongue"[6]. ఇంక మహారాష్ట్రలో 50 మంది మహాభక్తులుండేవారు. వారిలో జ్ఞానదేవనామదేవులు 13, 14 శ. ల మధ్యకాలంలో ఉండేవారు. నామదేవుడు అభంగవృత్తాలనబడు భావగీతికలు రచించాడు. ఇక్కడే సమర్థ రామదాసుతోపాటు పరిగణించదగిన భక్తాగ్రేసరుడు భక్తతుకారాం. వీరు అభంగాలు రచించి భక్తిని ప్రకటించారు. పోతే రాజస్థాన్‌కి చెందిన మీరాబాయి [16 వ శ. పూర్వార్థం] మహా కృష్ణభక్తురాలు.

---

6. Au. — P. 361.

ఈమె రాజస్థానీ, గుజరాతీ, వ్రజభాష, హిందీలలో సుమారు 2400 కృతులు కృష్ణభక్తి పారమ్యంగా రచించి తరించింది. మీరాబాయి భక్తితత్త్వాన్ని గూర్చి అరవిందులవారు మిక్కిలి కొనియాడారు.[7] ఇక్కడ హిందీలో కృతులు రచించిన భక్త కబీరును పేర్కొనడం సమంజసమే. భక్త రామదాసు గురువితడే. ఇట్లు ఉత్తరహిందూస్థానంలో కృష్ణభక్తి ప్రపూరితమైన గీతాలు కోకొల్లలుగా రచించబడుతూ భక్తితోపాటు పదకవితాభివృద్ధి చెందనారంభించింది.

## 2.3 తమిళంలో :

పై విధంగా ఉత్తరహిందూస్థానంలో కృష్ణభక్తి బహుళ వ్యాప్తిని పొంది దక్షిణదేశానికి సైతం వ్యాపించింది. దానితో పాటు పదకవిత మిక్కిలి అభివృద్ధి చెందింది. అంతకుముందే భక్తి బీజాలుగల దక్షిణ భారతంలో కృష్ణ భక్తికి ఎనలేని గౌరవం లభించింది. దాని మూలకంగా సంస్కృతంలోనే గాక తమిళ, మళయాళ, కర్ణాటాంధ్రభాషలలో భక్తిపూరితమైన పదకవిత మూడు పూవు లారు కాయలుగా వికాసం చెందింది.[8] తమిళనాడులో జైన బౌద్ధమతాలను త్యజించి కొందరు సుమారు 7 వ శ. నుంచి శైవ మతాని కెక్కువ ప్రాధాన్యమిచ్చి పోషించారు. అల్లే వైష్ణవమతం ప్రాబల్యానికి వచ్చింది. "ఒకవైపు శైవము మరియొక వైపు వైష్ణవమును ప్రబలుచుండిన కాలమది.... మతవిషయిక వాదోపవాదములలో మునిగిపోయిన నాయన్మారులుగాని, ఆళ్వారులుగాని ప్రత్యేక గ్రంథములు సంతరించకపోయినను, భక్తిరస ప్రపూర్ణములగు గీతము లనేకము వెలయించిరి. ఆ భక్తి గీతములే తరువాతికాలమున సంకలనము చేయబడి గ్రంథరూపమున వెలువడెను... కనుక

7. Au. — P. 361.
8. R. V. — P. 19.

శైవ వైష్ణవ మతాచార్యుల యుగమున ప్రచారములోనికి వచ్చిన తమిళ సాహిత్యము మధురగేయమయమై భక్తిరస ప్రపూర్ణమైయున్న దనుట సమంజసము. ఆళ్వారులును, నాయన్మారులును సంస్కృత భాషాభిజ్ఞులైనను భక్త్యుద్రేకమున వారు ప్రజల భాషయందే గీత ములు పాడిరి."[9] నాయన్మారులలో శ్రేష్ఠుడైన మాణిక్యవాచకరు దేశికవితా శాఖకు చెందిన అచ్చనగాయల పాటలు, గొబ్బి పాటలు, జోలపాటలువంటి వాటిలో మధురకవిత వెలయించాడు. తమిళ దేశంలో వైష్ణవమతవ్యాప్తికి తోడ్పడినవారు ఆళ్వారులే.[10] ఈ ఈ ఆళ్వారులు పన్నిద్దరు. వీరి విష్ణుభక్తి గీతాలు నాలుగువేలు న్నాయి. ఈ సంకలన గ్రంథానికి నాలాయిర ప్రబంధమని పేరు. ఈ ఆళ్వారులలో నమ్మాళ్వారు శ్రేష్ఠుడని ప్రతీతి. వీరిలో మహా విష్ణు భక్తురాలు శ్రీ ఆండాళ్ (గోదాదేవి) పెరియాళ్వారు పుత్రిక భక్తిపరవశయై ముప్పై పాశురాలు పాడిందట.[11] ఇట్లు తమిళ దేశంలోని శైవ, వైష్ణవ కవులు రచనచేసిన పవిత్రమైన గీతాలు గానానుకూలమై ఉండడం విశేషం.[12] ఈ తమిళంలోని తేవారమ్, దివ్య ప్రబంధాలు దేవాలయాల్లో కీర్తించబడేవి. ఇవి పరమ పవి త్రంగా భావించబడేవి.[13] నోతే మలయాళం చాలాకాలం వరకు తమిళంలోనే కలసి ఉండడంవల్ల ప్రత్యేకించి భక్తిపూరిత పదకవిత వేరుగా కనిపించకపోయినా జానపద కవితకుమాత్రమా భాషలో కొదవలేదు. ఉలుకుతయ పెరుమాళ్ పాట్టు (రోకంటి పాటలు), అచ్యుతం పురాన్‌పాట్టు, రామకథపాట్టు మొదలైన వీకోవకు చెందినవి కలవు. మంజరీచ్ఛందస్సులో రచితమైన కృష్ణగాథ పేర్కొనదగ్గది. తత్కర్త ఎవరోగాని మహాభక్తుడని తెలుస్తూంది. ఇంక 18 వ శ. లో 'ఆట్టకథ' అనబడే 'కథకళి' ఆరంభమైంది.

9, 10. 17. ఆం. సా. అ – పు. 24, 25. 11. Au – p 362.
12. పై 9, 10. లోనిదే – పు. 27. 13. R. V. – p 21, 22.

'కృష్ణ నాట్టం' అన్నది గీతగోవిందాన్ని అనుసరించి ప్రాయబడిందని విజ్ఞుల అభిప్రాయం.[14]

## 2.4 కన్నడంలో :

తమిళనాడులోని నాయన్మారులా, ఆళ్వారులా భక్తి కన్నడ దేశానికి ప్రాకి అక్కడ దాయామతాలభివృద్ధి చెందాయి.[15] 13 వ శ. లో ఉడిపి దగ్గర ద్వైతమత ప్రవర్తకులగు శ్రీ మధ్వాచార్యులు అవతరించి, శైవమతానికి బసవేశ్వరునివలె భాగవత ధర్మాన్ని నిరూపించాడు. ఇతని శిష్యుడు నరహరి తీర్థులు దాసకూట నిర్మాత. మరొక శిష్యుడు పద్మనాభ తీర్థులు. ఇతని శిష్యుడే శ్రీపాదరాయలు [1451]. కన్నడంలో రచించిన 'దేవనామము' లనబడే కీర్తనలను పూజాసమయంలో పాడించే పద్ధతిని ఆరంభించిన ఘనత ఇతనికి దక్కింది.[16] ఈ కీర్తనలు రంగ విఠల మకుటంతో లభించాయి. "ఈ పాటలలో పదలాలిత్యము, భాషా ప్రౌఢిమ, భక్తి శృంగారములు నిర్వహింపబడి శ్రోతల నాకర్షించుచుండును." "శ్రీపాదరాయల ముఖ్యశిష్యుడు, విద్వద్వరిష్ఠుడు, తపస్సంపన్నుడు వ్యాసరాయస్వామి. శ్రీకృష్ణదేవరాయల కాలములో ఆ సామ్రాజ్యమునకు తన తపశ్శక్తిని ప్రసాదించుచు మహారాజుచే పూజలను సత్కారములను పొందెను....... మనోహరములైన నూర్లకొలది కీర్తనలను వ్రాసి ఇతడు దాసకూటమును ఉన్నత స్థానమునకు తెచ్చెను."[17] ఈ దాస కూటంలో పురందరదాసు కర్ణాటక సంగీతానికి పితామహుడు. "వ్యాసరాయల ప్రియశిష్యులలో పురందరదాసు ప్రథమగణ్యుడు; మహా పండితుడు; వాగ్గేయ

14. 17. ఆం. సా. అ. – పు. 116 – 133 15. R. V. – p 24.
16. ప్ర. శ. – [క్రోధి సం – చైత్ర సంచిక – ౧ – 1964–65] పు. 81
17. 17. ఆం. సా. అ – పు. 92–94.

కారకచక్రవర్తి ...... ఆయన వ్రాసినన్ని కీర్తనలు మరెవ్వరు వ్రాయలేదు ...... సూళాదులు, ఉగాభోగములను గూడ ఆతడు రచించెను. ఇవి యొకవిధమైన పాటలు. పురందరదాసు కర్ణాటక సంగీతాభ్యాసమునకు చక్కని ప్రణాళిక నేర్పరచి, దక్షిణభారతమునకే చిరస్మరణీయుడై నాడు."[18] "తెలుగులో వేలకొలది సంకీర్తనములు రచించి సంకీర్తన పితామహుడని పేరుపొందిన అన్నమాచార్యుల కాలంలో యువకుడై తరువాత తానుగూడ కన్నడంలో లక్షవరకూ సంకీర్తనములు [దాసరహాడుగళు] రచించి కర్ణాటక దేశంలోనే గాక, ఆంధ్ర, ద్రావిడ, మహారాష్ట్ర - దేశాలలో ఆరాధ్యుడైన వాగ్గేయకారుడూ, పరమ భక్తాగ్రేసరుడూ పురందరదాసు [1484-1564]".[19] ఇట్లే ఈ పురందరదాసు ప్రభావాన్నిగూర్చి విశిష్టంగా వివరించారు రాఘవన్‌గారు.[20] ఇంక వ్యాసరాయల శిష్యులలో పేర్కొనదగిన మరొక హరిదాసు కనకదాసు. గోపాలదాసు, విజయదాసు, జగన్నాథ దాసులు గూడా అనేక కీర్తనలు పాడి కన్నడంలో దాసరగీతాలకు ఎంతో పుష్టి చేకూర్చారనడంలో సందేహంలేదు.

## 2.5 తెలుగులో:

పై పరిశీలన సారాంశానుసారం ఏ సాహిత్యంలోనైనా పద పద్య కవితలలో పదమే మొదట ప్రారంభమైనదన్న సిద్ధాంతం సర్వ జనామోదాన్ని పొందిందని వ్యక్తమైంది. అదే రీతిని తెలుగు సాహిత్యంలోనూ పదమే ప్రప్రథమంగా పుట్టింది. 11 వ శ. లో నన్నయభారతంలో తెలుగు కవిత్వం ప్రారంభమైనప్పటికీ, నన్నయ ఆదికవి అని విశ్వసించినా, ఇంతకంటె భిన్నమైన అసలుకు సిసలైన

18. పై దే - పు. 94 19 ర. రా. బా. - పు. 151.
20. R. V. - p 25.

తెలుగు కవిత ఒకటి ఉండాలనీ అదే పదకవిత అనీ దాన్ని దేశి అని అంటారనీ మనం మరవకూడదు. కవిత్వం మార్గ, దేశి అని రెండు విధాలు. "పండితులచే లక్షణానుగుణముగా వెలయింపబడిన దానిని మార్గ కవిత్వమనియు, లక్షణములతో సంబంధము లేకుండఁ దమ హృదయరుచి ననుసరించి సామాన్య జనులచే వెలయింపఁబడిన దానిని దేశికవిత్వమనియుఁ జెప్పవచ్చును."[21] ఈ లక్షణం మొదట సంగీత పరంగా శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరంలో చెప్పబడి[22] తరువాత ఇది సాహిత్యానికి సైతం సమన్వయించబడింది. తెలుగులో మొదట మార్గదేశీ పదాలను వాడిన కవి నన్నెచోడుడు.[23] "శార్ఙ్గదేవుడు సంగీతరత్నాకరమున గాన గంధర్వములను గూర్చి వివరించుచు గానము నిబద్ధము, అనిబద్ధము అని రెండు తెఱంగులనియు, గాంధర్వ గానములు మార్గదేశి భేదముల కపరరూపములనియుఁ దెల్పి యుండెను. కవిత్వ విషయమున మార్గదేశీ పద్ధతులు రెండింటఁ గూడ నీ రెండు తెఱంగులు గోచరించుననని చెప్పవచ్చును. నన్నయ్య రచన నిబద్ధ మార్గము. అనఁగా స్వతంత్రచ్ఛాయలతోఁ గూడిన మార్గపద్ధతి. పాల్కురికి సోమనాథుడు పేర్కొన్న తుమ్మెద, వెన్నెల పదాదులు శుద్ధ దేశీమార్గమునకుఁ జెందినవి. అవియనిబద్ధములు. సోమనాథుని రచనలు నిబద్ధ దేశిమార్గమునకుఁ జెందినవి."[24] "కాఁబట్టి పాటలు, పదములు కొన్ని తెఱఁగుల పద్యములు మొదలగు పాండిత్య నిరపేక్షములగు రచనములును, వాని నిబంధించు ఛందో వ్యాకరణ విధులును కొన్ని యంతకు [నన్నయ్యకు] ముందే గలవనుట నిశ్చయము."[25] "నన్నయ్య గారికి పూర్వము తరు

21. 1౯. ఆం. సా. అ. – సం. 1–పు. 21, 22. ర. రా. బా–పు. 19

23. న. – ఆశ్వా – 1. – పద్యం – 23.

24 18. ఆం, సా. అ –సం. 1-పు. 26. 25. 45. ప్ర. శా. వే.–పు. 2.

వోజలూ, మధ్యాక్కరలు, రగడలూ కవులు రచిస్తూ వుండేవారు. సీసపద్యానికి ముడిఛందస్సనిపించే ఛందస్సులో పాటలుండేవి. "[26] నన్నయకాలమందలి పదాలెలాంటివో మనకు తెలియదు. కాని "నన్నెచోడుని కాలమునాటికి [క్రీ. శ. 1150] ఊయల పాటలూ, గౌడు గీతములూఉండేవని ఆయన సాక్ష్యమువల్ల తెలుస్తుంది. "[27] తెలుగు దేశీయతను సమాదరించిన పాల్కురికి సోమనాథుడు తన బసవపురాణానికి "ఆతత సకలపురాతన భక్తగీతార్థ సమితియే సూతృక" అని చెప్పి,[28]

> "మదినుబ్బ సంసారమాయా స్తవంబు
> పదములు, పర్వతపదములానంద
> పదములు, శంకరపదముల్ నివాళి
> పదములు, వాలేశుపదములు, గొబ్బి
> పదములు, వెన్నెల పదములు, సెజ్జ
> వర్ణన మణిగణ వర్ణన పదము
> లర్ణవఘోషణ ఘూర్ణిల్లుచుండ." — భక్తులు

శ్రీశైలపర్వతారోహణ సమయంలో పాడినట్లు పేర్కొన్నాడు.[29] కాని పై అనేకపదాలకు లక్ష్యాలు లేకపోయినా దేశిచ్ఛందస్సయిన ద్విపద కధిక ప్రాధాన్యం ఇచ్చి కవిత చెప్పిన మహానుభావుడితడే. నన్నయకు పూర్వంసైతం అనేక దేశి ఫణుతులలో పదకవిత్వం తెలుగు దేశంలో ఉండితీరాలి. దీనికి నిదర్శనం లేకపోలేదు. నన్నయకు పూర్వ శాసనాల్లో తరువోజ, సీసం, మధ్యాక్కరలు — అన్న దేశీయ చ్ఛందస్సులు వాడబడ్డాయి.[30] ఇవి కొంతవరకు నిబద్ధ

26. కి.— [డిశం—1958]—పు. 558.  27. పై దే.
28. 97 సో. పా. పు. 9.
29. 98 సో. పా. —  30. 72. వే. ది —పు. 9—13.

చ్ఛందస్సులలో ఉండడంవల్ల శాసనాల్లోకి ఎక్కాయి.. కాని అని బద్ధాలైతే పండితులచే ఈసడించబడిన పదాలు పరిగణనలోనికి రాలేక పోయాయి. కాబట్టి వాటికి స్థిరత్వంలేక నశించిపోయాయి. "ఏ వాఙ్మయంలోనైనా పాటలే ముందూ. పద్యాలు తరువాతానూ. కనుక తెలుగులో నన్నయగారికి ముందు పాటలు పుట్టిఉండాలి. రాజుల పోషణగల సభావాఙ్మయమే చాలమట్టుకు ఖిలమైపోగా జానపదుల వల్లింపుమీద ఆధారపడిన పాటలు ఎలాగ నిలబడగలవూ?"31 అయినా మానవుడు జన్మించి సహజ సంతోష దుఃఖానుభూతిని పొందినప్పటినుంచీ పదాలు కోకొల్లలు వెలసి ఉంటాయి. పామర ప్రజలే పట్టుగొమ్మలై వాటికాధారమయ్యారని తలంచవలసిఉంది.32 "తెల్గు కవిత యాశు, మధుర, చిత్ర, విస్తరములని నాల్గు తెఱంగులు గలదని లాక్షణికులనిరి ...... అందు మధురరకవిత యనఁగా పాటలు మొదలగునవి."33 నాచన సోమనాథుడు 'ఉత్తరహరివంశమే' గాక 'వసంతవిలాసం' అన్న ప్రబంధం రచించినట్లు తెలుస్తూంది. అందులో జాజరపాట ప్రసక్తి ఉంది.

"వీణాగానం వెన్నెల తేట
రాణ మీరగా రమణుల పాట
పేరు చెప్పిన పిన బ్రాహ్మణు వీట
జాణలు మెత్తురు జాజరపాట." — ఇలాంటి తేట

తెలుగు పదకవితల నానందించే భాగ్యం తెలుగు ప్రజలకు లేకపోయింది ఇదీ, తదితర పదాలూ లభించకపోవడంవల్ల.

తెలుగులో సంకీర్తన వాఙ్మయం కృష్ణమాచార్యులతోనే ఆరంభమైంది. నియమబద్ధమైన సాహిత్యము నన్నయతో ప్రారంభ

31. 45. ప్ర. శా. వే—పు.౩. 9. 32. కి — (డిశ:—1953) పు. 567
33. 45. ప్ర. శా. వే—పు 42

మైనర్లే కృష్ణమాచార్యులనే వైష్ణవ భక్తుని సంకీర్తనలు మొదటి సంగీత రచనలు ... ఈతడు కాకతీయ రాజగు రెండవ ప్రతాప రుద్రునికాలమునకు చెందినవాడు. లక్షలాది సంకీర్తనలు చేసెనట. సింహాచలమునందలి నరసింహస్వామికి అంకితముగ ఆ వచన సంకీర్తనలు చేసెను. 'వేదంబు తెనుగు గావించి సంసారఖేదంబు మాన్పిన కృష్ణమాచార్య'.నని ప్రశంస పొందిన మహాభక్తుడితడు. ఇతని రచనలు వచనములు. చూర్ణికలనబడును ... ఈ చూర్ణికలకు ఒక రాగము, తాళము నిర్దేశింపబడలేదు. ఏదో ఒక రాగములో సంగీతపు ఊపులో భక్త్యావేశములో ఒంటితీగతో తంబురా శ్రుతిలో పాడుకొనునవి ... ఇట్టి వచన సంకీర్తనములే కాక కృష్ణమాచార్యునివి, రగడ వికారము లనదగిన రచనలు, రామనామాలు, నృసింహనామాలు అనునవికూడా నిటీవల తంజావూరు సరస్వతీ మహాలు భాండాగారమున బయల్వెడలి యున్నవి. ఇవి మాత్రా గణప్రసారములో చక్కగా తాళమున కొదిగి పాడుకొనదగిన దేశి రచనలు."[34] ఈ కృష్ణమాచార్యుడు 12 వ శ. కు చెందినవాడు. తెలుగులో మొదటి ఆంధ్ర వాగ్గేయకారుడు కృష్ణమాచార్యు డనడంలో సందేహముండనక్కరలేదు. "కావ్యరచనచేశారో లేదో గాని నాటి కవులు దేవాలయములలో స్తుతులు చేస్తుండేవారని, ముఖ లింగములోని 'సుకవీంద్రస్తుత్య నిత్యోదయః' — అన్న శాసన ఖండమువల్ల తెలుస్తుంది."[35] అహోబలం, సింహాచలం మొదలైన దేవాలయాల్లో 13, 14 శ. ల్లో కృష్ణమాచార్యుని నామ కీర్తనలు సంకీర్తనం చేయబడుతూండేవని వేటూరివారు శాసనస్థాధారాల్ని చూపించారు.[36] అంటే కృష్ణమాచార్యునితో ఆరంభమైన సంకీర్తనపద్ధతి ఇలా వ్యాపించినదని తలంచవలసి ఉంది.

---

34. ఆ. అ. వి. – పు 2, సం. 35. 3 – (డిసెం. 1963) పు. 553.
36. అ.– పు. 173.

కృష్ణమాచార్యుల తరువాత చెప్పదగ్గ పదకర్తా, వచనకారుడు యాగంటివారు. ఇతని పదాలు, వచనాలు, ఏలలు కొన్ని ప్రచారంలో ఉన్నాయి. "వీరికి ఏగంటివారు, యాగంటివారు, ఆగంటి వారు అని వ్యవహారం ఆయాపుస్తకాలలో వున్నది ... ఏగంటి లక్ష్మప్పగారి తత్త్వాలు అనీ, ఏలలు అనీ పదిదాకా కాలజ్ఞాన తత్త్వ సంచయంలో వున్నవి. ఇవి కాక యాగంటివారి యేల లనీ, తత్త్వాలనీ ఇంకా 20, 30 దాకా అందులోనే ఉన్నవి. వీటన్నింటి లోను చివరిచరణంలో ముద్ర యాగంటి యీశ అని కాని, యాగంటి గురుడు అని కాని, యాగంటి దాసుడు అని కాని, కొన్నింటిలో సంబోధన ప్రథమం లోను, కొన్నింటిలో ప్రథమా విభక్తి లోను, కొన్నింటిలో తత్పురుషలోను ప్రయోగాలున్నవి. వీటినిబట్టి యీ తత్త్వాలన్నీ యాగంటివారైన వేర్వేరు వాగ్గేయకారుల రచనలని గాని, లేదా అన్నీ ఒక లక్ష్మప్పగారి రచనలే అని గాని ఇదమిత్థమని చెప్పడానికి వీలులేదు. అన్నియేలలలోను శివపారమ్యము కలదు" అనీ వీరు "తాళ్ళపాకవారి సమీపకాలంలోని వారనిగాని, తరువాత వారని గాని అనడానికి ఇబ్బంది ఉండదు" — అనీ రజనీ కాంతరావు గారభిప్రాయపడుతున్నారు.[37] ఇదే సముచితమని విశ్వసిస్తున్నారు డా. వేటూరి ఆనందమూర్తిగారు.[38] కానీ నిడదవోలువారు యాగంటివారిని క్రీ. శ. 1530 ప్రాంతంలోని వారని పేర్కొన్నారు.[39] అంటే వీరి మతం ప్రకారం తాళ్ళపాక అన్నమయ్య [1424-1503][40] కంటే తరువాత అని వ్యక్తమవుతుంది, కాని శ్రీపాదవారు మాత్రంముందనే నిరూపించారు. "అష్టపదుల

37. ర. రా. శా. – పు 449, 462.
38. శా.– (నవం. 1971) పు. 18, 19
39. 18. ఆం. సా. అ.– పు.122. 123
40. 48. ప్ర. శా. వే.– పు. 2. 3.

తర్వాత మనకు వినబడే ప్రాచీనగేయము అరుణగిరినాథుడనే డిండిముడు రచించిన 'నాదబిందుకళాదీ నమోనమో, వేదమంత్ర స్వరూపా నమో నమో' అన్నదీ, చరణాల చివ్వర 'వరశూర', 'వెలుగోటి' అన్న చిన్న చిన్న మాటలే గాని ధ్రువములేదు. పాటలో చరణములు మాత్రమున్నాయి. ఇది విజయనగర ప్రౌఢ దేవరాయల కాలము నాటిది." "తర్వాతివి 'ఏగంటివారి వచనాలు' అన్న గార్లపాటి లక్ష్మయ్యగారి రాజయోగ కీర్తనలు. వీనిలో పై 'నాదబిందుకళాదీ' వంటి కీర్తన 'కాదన్న వ్యాసుని కరములే సాక్షి లోకములన్ని యెరుగనో దేవా!' మాత్రమేకాక జయదేవుడి అష్టపదులవంటి కీర్తనలు చరణమూ, ధ్రువమూ, ఇంకొకచరణము, ధ్రువమూ వరుసలో వచ్చేవి చాలా ఉన్నాయి."

"తరువాతివి అన్నమయ్య సంకీర్తనలు ..."[41]

"లక్ష్మయ్యగారు పాల్కురికి వారికివలెనే వేదవాక్కులు ఎత్తి వాటివిశేషార్థాలు చెప్పినారు. పాటలన్నిటికీ రాగములు చెప్పలేదు; అన్నమయ్య అన్ని సంకీర్తనలకు రాగములు చెప్పెను. కనుక పాల్కురికికీ, అన్నమయ్యకూ నడిమికాలము వాడీయన."

"ఏతావాతా ఏగంటి వచనాలు విజయనగర సంగమ కాలము నాటి వంటున్నాను."[42] కాబట్టి ఏగంటివారు ఒకరు కానీ, అనేకులుగానీ తాళ్ళపాకవారి పూర్వులనడమే సమంజసం.

ఇంక శ్రీనాథునియుగంలోను పదకవిత లుండినట్లు స్పష్టమవుతుంది. పద కవితలను ముదివిటుల క్రింద తీపిపారేశాడన్న

---

41. భా. (సెప్టెంబరు 1961) పు. 89-91.

42. భా. (నవంబరు 1961) పు. 91, 92

నెపం ఒకటి శ్రీనాథుని మీదుంది. కానీ ఇది సరికాదనడానికి ప్రత్యక్ష సాక్ష్యం అతని పల్నాటి వీరచరిత్ర. 14 వ. శ. లో ఓరుగంటిలో పల్నాటివీరులకథ పాడి, ఆడినట్లు క్రీడాభిరామంలోఉంది.[43] ఈ పల్నాటి వీరచరిత్ర మంజరీ ద్విపదల్లో రచితం. "మంజరీ ద్విపద కావ్యాలన్నీ కూడా దేశిరాగ వైఖరులతో తాళముతో ఇతర అంశముల మేళవింపుతో పాడుకొనుటకే పుట్టెను."[44] శ్రీనాథునికి పదకవితపై నభిమానమనడానికి "కీర్తింతు రెద్దాని కీర్తిగంధర్వులు

గాంధర్వమున యక్షగాన సరణి."[45] — అని పామర ప్రజల యక్షగాన పద్ధతి చెప్పడమేచాలు. శ్రీనాథునికి కనకాభిషేకం చేసిన దేవరాయల ఆస్థానంలో చతురుడనే ప్రజ్ఞానామం పొంది, 'సాక్షాత్సంగీత దేవత, అభినవ భరతాచార్య, రాయ బయకార, తోడరమల్లు' అనే బిరుదులుగల కల్లినాథుడుండేవాడు. "సంగీత చరిత్రలో రాజబయకార [రాజవాగ్గేయకార] ఉద్యోగం ప్రథమంగా ఇతనినుంచే ప్రారంభించినట్లు కనబడుతుం" దనీ ఇతడు శ్రీనాథుని కనకాభిషేక సమయాన బిరుద ప్రబంధాలు పాడివుంటాడని రజని గారి ఊహ.[46] కాబట్టి ఆనాడు గేయ ప్రబంధాలు ఉండవచ్చునని తలంచడం అసహజంకాదు.

## 2 . 6 వికాసం

తెలుగు పదకవితకు 15 శ. వసంతకాలం. ఆనాడు వేలకు వేలు పదాలు రచించబడ్డాయి. తెలుగుపదకవితకు అనవద్యుడు అన్నమాచార్యుడు. ఇతడు 1424 లో జన్మించి 1503 లో దివ్య

43. 79. శ్రీ—పద్యాలు 116. 117. 120.
44. కి—(డిశంబరు 1947) పు. 58.
45. 80. శ్రీ—ఆశ్వా. 3. పద్యం — 65.
46. ర. రా. బా—పు. 33. 34.

ధామం పొందినట్లు తెలుస్తూంది.[47] వీరి కుటుంబమంతా కవి కుటుంబం. 16 శ. చివరి వరకు వీరి పదకవితా ప్రాగల్భ్యం ప్రబలింది. తాళ్ళపాకవారి పదకవిత తెలుగుతల్లి కెనలేని మణిభూషణ నికరం. "అన్నమాచార్యులు వ్రాసిన 32,000 సంకీర్తనలలో సుమారు 12,000 నేడు లభ్యమైనవి. ఆయన కుమారుడు పెద తిరుమలాచార్యులు రాగిరేకులమీద వానిని వ్రాయించి భద్రపరచెను. ఇవి అధ్యాత్మ సంకీర్తనాలని, శృంగార సంకీర్తనాలని రెండు విధములు. శ్రీ వేంకటేశ్వరున కంకితములు. సంకీర్తనములకు పదములనికూడా పేరు. ..." "మరి అన్నమయ్యకు పూర్వము వాడుకలో నున్న జానపదగీతములు, జాజఅలు, చందమామ పదములు, తుమ్మెద పదములు, గొబ్బిపదములు, లాలలు, జోలలు, తందనాలు మొదలగునవి ఆయన రచనలలో నున్నవి."[48] అతనికిగల పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అనే బిరుదులు అక్షరాలా సార్థకం. అటు జయదేవుని గీతగోవిందమూ, ఇటు ఆళ్వారుల పాశురాల మహిమా, మరోప్రక్క 'దాసరకూటముల' మహిమాన్విత వైశిష్ట్యమూ, ఇంకోప్రక్క తెలుగులోని కృష్ణమాచార్యులు మొదలైనవారి సంకీర్తనలూ అన్నమయ్య పదరచన కుపకరించాయి. "తాను [అన్నమాచార్యుడు] స్మార్త బ్రాహ్మణుడైనను విశిష్టాద్వైతమత సామర్థ్యమునకు, నర్చనావతార వైభవమునకు, శరణాగతి మాధుర్యమునకు శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యమునకు లోపడి యహోబిలమతాధీశ్వరుడైన ఆదివన్ శఠకోపయతి శిష్యుడై వైష్ణవ మతమును స్వీకరించినాడు. పరాంకుశ యతి ప్రభృతులు ద్రవిడ వేదాంతమును వెలయించినట్లుగా నాళ్వార్ల సంప్రదాయమును జక్కగా ననువర్తించి యుపనిషదర్థ ప్రతిపాదనములతో స్వానుభవ నివేదన

47. 46. ప్ర. శా. వే. –పు. 2, 3.

48. 9. అ. వి – పు. 5, 6.

ములతో సరవని భాషతో, సరస సంగీత కళావిలాసములతో సర్వసులభముగా సంకీర్తనాత్మకముగా నాంధ్ర వేదాంతము నవతరింప జేసినాడు."[49] ఆళ్వారుల దివ్య ప్రబంధంలో 4000 పదాలుండగా, అన్నమాచార్యుడొక్కడే రచించిన ఆంధ్రవేదంలో 32,000 పదాలున్నాయి.[50] "తెలుగు కన్నడ వాఙ్మయములలో 15 వ శ. లో ఈ పదరచన విస్తారముగ సాగినది. తెలుగులో ఇప్పటికి మనకు తెలిసినంతలో తాళ్ళపాక అన్నమాచార్యులు ప్రాచీన పదకవిగదా! ఆతని కాలమందే అతడున్న సాళ్వ నరసింహ రాయని ఆస్థానమందే ఉన్న శ్రీపాదరాయ స్వామి కన్నడ పద కర్తలలో ఇప్పటికీ ప్రాచీనుడు. ఆయన శిష్యుడు శ్రీ వ్యాసరాయ స్వామి. ఆతని శిష్యుడు శ్రీ పురందర విఠ్ఠలుడు. శ్రీపాద రాయలది విష్ణుపరంపర."[51] "అన్నమయ్య చిన్ననాటినుండి 'ఆడిన మాటెల్ల నమృతవాక్యముగ, పాడిన పాటెల్ల పరమ గానముగ' నమరిన వాడట! ఈ యుత్ప్రేక్ష ఎట్లున్నను శ్రీపాద రాయల పదములే రచనోత్సాహమును గల్పించియుండును."[52] అనే రాళ్ళపల్లి, పుట్టపర్తి వారల మాటలు ఆళ్వారుల ప్రభావంతో పాటు 'దాసర కూటముల' ప్రభావం అన్నమయ్యపై కలదని నిరూపిస్తున్నాయి. ఇంతే గాదు. అన్నమయ్యను పురందరదాసు తిరుపతిలో దర్శించినట్లు తెలియవస్తూంది.[53] "అన్నమాచార్యుని వార్ధకమునఁ బురందరదాసులవారు చాలఁ జిన్నవారై దర్శించి యుందురు."[54] కానీ "కర్ణాటకదహరిదాస సాహిత్య" ను గూర్చి వ్రాసిన ఆర్. ఎస్. పంచముఖిగారు అన్నమయ్య పురందరుల

49. 45. ప్ర. శా. వే – పు. 84
50. 46. ప్ర. శా. వే. – 116.
51. 16. ఆం. సా. అ. – పు. 19. 52. ఆం. సా. ప. –పు. 2.
53. 46. ప్ర. శా. వే. – పు. 44, 45. 54. పైదే – పు. 63.

సమాగమాన్ని సందేహించారనీ, అది సముచితం కాదనీ డా. వేటూరి ఆనందమూర్తిగారు వక్కాణించారు.[55] అన్నమయ్య మనుమడు చిన్నన్న చెప్పాడుగనుక ఇందు అనుమానానికి ఆస్పదంలేదు. ఇట్లు మహాభక్తాగ్రేసరుడై పదకవితకు పట్టంగట్టి తెలుగున పదకవితా పితామహుడై ప్రసిద్ధిపొందిన మహానుభావుడు అన్నమయ్య. "ఈతని శృంగార సంకీర్తనాంశము మున్నూరేండ్లతర్వాత క్షేత్రయ్యగాను, అధ్యాత్మ సంకీర్తనాంశమటు తరువాత నూరేండ్లకు త్యాగయ్యగాను నవతరించెననఁజెల్లును."[56] అని ముక్తకంఠంగా పేర్కొన్న వేటూరి వారి మాటలు అక్షరాలా సత్యం. అన్నమయ్య సంస్కృతంలో సంకీర్తన లక్షణం సైతం రచించాడు. అది లభించలేదు. కాని అన్నమయ్య మనుమడు రచించిన దాని తెలుగు అనువాదం దొరికింది. అన్నమయ్య సతీమణి తాళ్ళపాక తిమ్మక్క 'సుభద్రా కల్యాణ' మనే గేయకావ్యం రచించింది. అన్నమయ్య ద్వితీయ పుత్రుడు పెద తిరుమలాచార్యులు అనేక శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు, వైరాగ్య వచన గీతాలు మొదలైన మధురకవితలెన్నో వెలయించాడు. ఇతని పెద్ద కుమారుడు చిన తిరుమలాచార్యుడు, "తండ్రి తాతల సత్కవితా సంగీత సంప్రదాయము, వేంకటేశ్వర భక్తి నిష్ఠా, సంస్కృతాంధ్ర ప్రాకృతాది భాషా వైదుష్యమూ కలిగిన చిన తిరుమలయ్యకు అష్ట భాషా కవిచక్రవర్తి అని, శ్రీ రామానుజ సిద్ధాంత స్థాపనాచార్య, వేదాంతాచార్య, కవితార్కిక కేసరి అను బిరుదాలున్నట్లు శాసనాలవల్ల తెలుస్తోంది. ఇతడు అన్నమాచార్యులు సంస్కృతంలో రచించిన సంకీర్తన లక్షణాన్ని తెలుగు చేశాడు."[57] ఇతడష్ట భాషా దండకం రచించాడు. పెద తిరుమ

---

55. భా. (నవం. 1971) పు. 21. 21
56. 45. ప్ర. శా. వే - పు 84.
57. ర. రా. భా. - పు. 142.

లయ్య మరో పుత్రుడూ, చిన తిరుమలయ్య తమ్ముడూ అయిన చిన తిరువెంగళనాథుడనే చిన్నన్న సంకీర్తనలు మనకు లభించలేదు. కాని ఇతడు 'అన్నమాచార్య చరిత్ర, అష్టమహిషీ కల్యాణము, పరమయోగి విలాసము, ఉషాపరిణయము' — అనే ద్విపద కావ్యాలు రచించాడు. ఇట్లీ తాళ్ళపాకవారి కుటుంబం తెలుగు సంకీర్తన వాఙ్మయానికి, సంగీతానికి ఎనలేని సేవచేసిందనడంలో అత్యుక్తి లేదు.

అటు తరువాత 16 శ. లో మధురకవితలు వెలిశాయి. 16 శ. ఉత్తరార్థ మందుండిన కందుకూరి రుద్రకవిదే లభించిన ప్రప్రథమ యక్షగానం. అదేకాలంలోనిదే విప్రనారాయణ చరిత్ర కలదు. గ్రంథం లభించకపోయినా ప్రోలుగంటి చెన్నశౌరి 'సౌభరిచరితం' అనే యక్షగానం రచించినట్లు తెలుస్తూంది. ఇతడు నరసింగరాయలచే సత్కరించబడ్డాడట. ఈ నరసింగరాయలు పిన వీరభద్రుని పోషకుడూ, అన్నమయ్య మిత్రుడూ అయిన సాళ్వ నరసింగ రాయలే. ఇతడే కూచిపూడి భాగవతుల నృత్యం తిలకించి దుర్మార్గుడైన సంబెటగురవరాజును శిక్షించినవాడు. ఈ యక్షగానాల కధిక ప్రాముఖ్యం అంతకుముందు పండితులలో లేకపోయింది. సామాన్య ప్రజల్లో ఉండేదనడానికి పూర్వోక్తమైన శ్రీనాథుని భీమఖండంలోని "కీర్తింతురెద్దాని కీర్తిగంధర్వులు గాంధర్వమున యక్షగానసరణి" అన్నది నిదర్శనం. తెలుగులోని మధుర కవితలలో యక్షగానం ఒకటి. ఈ యక్షగానంలో అనేకపదాలు, దరువులు, కీర్తనలు సామాన్యమే. ఇంకా ద్విపదలు, ఉదాహరణ కావ్యాలు వెలిశాయి. ఇవన్నీ పామరప్రజాప్రయోజనోద్దిష్టాలే అయినా, కొంతవరకు ద్విపదలు పండితాదరణకు పాత్రమైనా, పదకవితకు ప్రాముఖ్యం వచ్చినట్లు లేదు. కాని పండితామోదముద్రగల ప్రబంధాల్లో సైతం నాయిక చెలులతో పుష్పాపచయం చేసే సందర్భంలో రగడలనబడే

గేయ ఫణుతులు ప్రవేశించే ఉన్నాయి. ఈ విధంగా 17 శ. లో యక్షగానాలు విరివిగా రచించబడ్డాయి. అదొకపద్ధతి.

అన్నమయ్య తరువాత పేర్కొనదగిన మహావాగ్గేయకారుడు నారాయణతీర్థులు [1580-1680]. ఇతడు 'శ్రీకృష్ణ లీలాతరంగిణి' అన్న గేయ కావ్యాన్ని సంస్కృతంలో రచించిన ఆంధ్రుడు. జయదేవుడే నారాయణతీర్థులుగా అవతరించాడన్న ప్రతీతి ఉంది. శ్రీకృష్ణ లీలాతరంగిణి సంస్కృతంలోని యక్షగానమంటారు రజనిగారు[58]. ఇతడు తెలుగులో పారిజాతాపహరణ మనే యక్షగానమూ, ఇంకా కొన్ని సంస్కృత గ్రంథాలూ వ్రాశాడు. ఇతడు కూచిపూడిలోనే రచన ఆరంభించినా, రాజాశ్రయం కోసం తంజావూరు వెళ్ళినట్లు పూర్వోక్తం. ఇదే సమయంలోని ఇతని శిష్యుడు సిద్ధేంద్రయోగి [1600-1700] కూచిపూడి భాగవత మేళాలకు ఆద్యుడు. ఇతడు తన 'భామాకలాపం'తో కూచిపూడి సంప్రదాయాన్ని ప్రతిష్ఠించాడు. కానీ అసలుకు సిసలైన పదకవితలు వెలయించినవారు లేక పోయారు అన్నమయ్య దగ్గరనుంచి క్షేత్రయ్య వరకు ఉన్న మధ్య కాలంలో. రామరాయల ఆస్థానంలో రాయబయకార, అభినవభరతాచార్య, తోడరమల్ల బిరుదాంకితుడూ, 'స్వరమేళకళానిధి' అనే పేరుతో సంగీతలక్షణగ్రంథరచయితా అయిన రామామాత్యుడనే వాగ్గేయకారుడుండేవాడు.[59] రామరాజుచే భూషితుడైన రామరాజ భూషణుడు అప్పటివాడే. మన దురదృష్టవశాత్తు వారి కృతులు లభించలేదనీ, "క్షేత్రయ్య ఒక్కడే ఈ ప్రవాహంలో ద్వీపమువలె నిలిచి వెలకొన్న కవి" "ఇతనికి పదకవితా పితామహుడైన అన్నమయ్య ఒరవడి లభించినది.[60]"—అనీ రాళ్ళపల్లి వారి అభిప్రాయం.

58. 16 ర. రా. శా. – పు. 175. 59. పైదే – పు. 87.
60. 16 ఆం. సా. అ. – పు. 23.

రాజులమీదేగాక మువ్వగోపాలునిపై వేలకొలది పదాలు రచించి తరించినవాడు క్షేత్రయ్య. "తెలుగు పదకవితా కన్యకు పితామహుఁడు తాళ్లపాక అన్నమయ్య గారంటిని. కాని జనకుఁడే క్షేత్రయ్య. తాత మొదలుపెట్టిన పనిని తలపాలముదాక ఈడ్చిన తండ్రి యితడు.[61]"—అన్న రాళ్లపల్లి వారి మాటలు సార్థకమైనవి. అన్నమయ్య సంకీర్తనలలో సాహిత్యానికే ప్రాధాన్యం. కానీ క్షేత్రయ్య సంగీతసాహిత్యాలకు సమప్రాధాన్యమొసగి అభినయాన్ని అన్వయించిన మహావాగ్గేయకారుడు, పదకవితా చక్రవర్తి. ఇతని తరువాత అనేక పదకర్తలున్నారు. గోలకొండ పాదుషా అబ్దుల్లా తానీషాను క్షేత్రయ్య దర్శించినట్లు పూర్వోక్తం. అబ్దుల్లాపాదుషా తరువాత గద్దెనెక్కిన అబుల్ హసన్ తానీషా కాలంలో కంచెర్ల గోపన్న అనబడే రామదాసు అనేకకీర్తనలు భక్తిపరవశుడై రచించి తెలుగువారి మన్ననలకు పాత్రుడయ్యాడు. తరువాత అధ్యాత్మ రామాయణ కీర్తనలు రచించిన మునిపల్లె సుబ్రహ్మణ్యకవి [1730-1780] పేర్కొనదగిన పదకర్త. ఇంకా ఈ పదకవితలు మహోన్నత శిఖరాల నధిష్ఠించినది తంజావూరు రాజుల కాలంలోనే. శృంగార రస పిపాసువులైన రాజులు పోషించగా ఎంతోమందికవులు, కవయిత్రులు, గాయకులు, నర్తకులు వెలసిన ఆ రోజులు తెలుగు పదకవితలకు, సంగీతాదికళలకు ఆటపట్టయ్యాయి. అన్నిచోట్లనుంచి కళాకారులు తంజావూరికి వలసిపోయారు.[62] క్షేత్రయ్యకు ఆశ్రయమిచ్చిన విజయరాఘవనాయకుడు స్వతఃగా పదకర్త. రంగాజమ్మ మొదలైన కవయిత్రులు యక్షగానాల్లో పదకవిత కధిక ప్రాధాన్యమిచ్చారు. విజయరాఘవుని ఆస్థానవిద్వాంసుడూ, చతుర్దండి ప్రకాశిక కర్తా అయిన వేంకటమఖి వాగ్గేయకారాగ్రణి. తంజావూరి

61. ఆం. ప. – [1942 – 43] – పు. 12.
62. R. V. – P. 80, 81.

ఆస్థానంలోని యక్షగానకర్తలలో కోనేటి దీక్షిత చంద్రుడు, పురుషోత్తమదీక్షితుడు మొదలైన వారేకాక పెద్దిదాసు అనే పదకర్త సైతముండేవాడు. ఇంకా కార్వేటి నగరం ఆస్థానంలో ఉండిన సారంగపాణి క్షేత్రయ్య తరువాత చెప్పదగ్గ వాగ్గేయకారుడు. మహారాష్ట్రరాజులకాలంలో సంగీతసాహిత్యాలకు మధుర తంజావూరు రాజ్యాలలో ఎనలేని పోషణ లభించింది. గిరిరాజకవి, ఘనం శీనయ్య, కాశీనాథయ్య, వీరభద్రయ్య, శ్రీనివాసయ్య, ఆదియప్పయ్య, మాతృభూతయ్య మొదలైన వారెందరో పదకారులు వెలిశారు. పదాలేకాక జావళీలు, శబ్దాలు, సల్లాములు మొదలైన రచనలెన్నో వచ్చాయి. సంగీతానికి పట్టాభిషేకం జరిగింది త్యాగయ్య [1767-1874] నాదోపాసనలో. త్యాగరాజు భక్తి ప్రపూరితాలైన కృతుల రచించి కర్ణాటక సంగీతానికి స్థిరరూపమేర్పరచాడు. క్షేత్రయ్య పదాలలో సంగీత సాహిత్యాలు సమపాళ్లలో ఉండగా త్యాగయ్య తన కృతులలో సంగీతానికి ప్రాధాన్యమొసగిన మహానుభావుడు. ఇది త్యాగయ్య తాత గిరిరాజకవి కాలంలో ప్రారంభమయి త్యాగయ్య నాదంలో ఒక సురూపం పొందింది. త్యాగయ్య కేవలం త్యాగి; రామభక్తుడు. ఇతని కృతులలో భక్తికే ప్రాధాన్య మెక్కువ. ఇతడు రచించిన ప్రహ్లాద భక్తి విజయం అన్ననాటకం, నౌకాచరిత్ర మన్న గేయనాటకం, సీతారామ విజయం అనే అసంపూర్ణ గేయనాటకం లభించాయి. త్యాగరాజు తరువాత ఆ సంగీతాన్ని పెంపొందించిన శ్యామశాస్త్రిలు, ముద్దుస్వామి దీక్షితులు మొదలైనవారు. వారి కీర్తనల్లో, కృతుల్లో సంగీతసాహిత్యాల్లో సంగీతానికి అంటే ధాతుమాతువుల్లో ధాతువుకే అధికప్రాధాన్యమిచ్చినా, పదరచనక్రమ పరిణతి చెందినట్లు స్పష్టమవు

తుంది. ఇంతమంది వాగ్గేయకారుల్లో చుక్కల్లో చంద్రునిలా దేదీప్యమానంగా పదాల వెన్నెలలు వెదజల్లే ప్రసిద్ధ పదకర్త క్షేత్రయ్య. ఆ వెన్నెలలో విహరిస్తూ ఆతని పదాల చల్లదనం, హాయి, రసజ్ఞుల మనస్సులను చూరగొనే గుణం, సహృదయహృదయాలను అలరించే వైవిధ్యం - ఏమిటో తెలుసుకోవడమే తరువాతి ప్రకరణాల్లో జరిగే క్షేత్రయ్య పదపరిశీలన.



# 3. క్షేత్రయ్య పదకవితా వైశిష్ట్యం

క్షేత్రయ్య పదకవితా వైశిష్ట్యాన్ని గూర్చి తెలుసుకోనేముందు ఆ పద సేకరణకై చేయబడిన ప్రయత్నం, ఆ పదాల సంఖ్య గుర్తించడం అవసరం.

క్షేత్రయ్య పదాలన్నవి ఒక కావ్యంగాదు. ఒక్కొక్కపదం ఒక్కొక్క మధునిష్యంది, రసస్పంది అయిన మధురకావ్యం; గీతి కావ్యం; అనన్యసామాన్యమైన అభినయకావ్యం. పదాలు ప్రబంధాలని భరతముని కాలంనుంచీ ప్రసిద్ధిపొంది ఉండడం గమనించదగ్గది. ఈ పదాలు ముక్తకాలలాంటివి; భావగీతికలు; రసజ్ఞమనోజ్ఞమైనవి.

## 3. 1 పదాల సేకరణ :

భగీరథప్రయత్నంచేసి అత్యధికంగా క్షేత్రయ్య పదకవితా స్రవంతిని ఆంధ్రదీసీమల్లో ప్రవహింపజేసిన ఘనులు శ్రీ విస్సాఅప్పారావుగారు. వీరు విపులమైన పీఠికతో 330 పదాలను 1950 లో ఆంధ్రగానకళాపరిషత్, రాజమండ్రి, వారి తరఫున ప్రకటించారు. ఈ పదసేకరణలో వీరు మిక్కిలి పరిశ్రమించినట్లు స్పష్టం.[1] 1862లో

1. ఆ. వి. — పీఠిక — పు. 34 — 33.

తేవప్పెరుమాళ్ళయ్యగారిచే పరిష్కృతమైనదీ, 1864 లో ప్రాచ్య లిఖిత పుస్తకభాండారంలో అచ్చయినదీ, 1874 లో వివేకచంద్రోదయ ముద్రాక్షరశాలలో అచ్చయినదీ, 1877 లో భువనగిరి రంగయ్య శెట్టిగారిచే ప్రకటితమైనదీ, 1916 లో వావిళ్ళవారు ప్రకటించినదీ, 1917 లో ముద్రితమైన సంగీతసర్వార్థసార సంగ్రహమూ-అన్నవి ఉపకరించాయి. మద్రాసు అడయారు పుస్తకభాండాగారంలోని తాళపత్ర గ్రంథాలు, తిరుపతి దేవస్థానం, ఆంధ్రసాహిత్య పరిషత్తు, ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారం, తంజాపూరిలోని సరస్వతీమహల్ పుస్తకభాండాగారం మొదలైనచోట్ల లభించిన వ్రాతప్రతులూ పద సేకరణ కుపకరించినట్లు తెలుస్తూంది. వీరీ విధంగా 330 పదాలు సేకరించినట్లు, సుమారు 90 పదాలు నూతనంగా ఇందచ్చేనవనీ తెలిపారు.[2]

కానీ విస్సావారు 1886 లో మైలాపూరు "మాణిక్య మొదలారి" మాణిక్యమందిరమను ముద్రాక్షరశాలయందు ముద్రించబడిన "మువ్వగోపాల పదంబులని పేర్కొనంబడుచున్న క్షేత్రయ పదంబులు" ను చూసినట్లు లేదు. ఇందులో 260 క్షేత్రయ్య పదాలతోపాటు 18 త్యాగరాజకృతులు ఉన్నాయి. ఈ ప్రతిలోని క్షేత్రయ్య పదాలు ఏడు విస్సావారి ప్రతిలో లేవు. ఇవి గిడుగు వారి ప్రతిలో ఉన్నాయి.

తెలుగుసాహిత్యానికమితసేవ చేసిన వావిళ్ళవారు ఈ పద కవితకు సేవచేసే తలంపుతో 1916 లో ప్రకటించిన 200 పదాలను 1950 లో పునర్ముద్రించడమేగాక, మళ్ళీ 1951 లో శ్రీమాన్ కందాడై అప్పన్ కృష్ణమాచార్యులు, తిమ్మావజ్ఝల కోదండ

2. 7. ఆ. వి. – పు. 9.

రామయ్యగార్ల పరిష్కరణతో పై 200 పదాలతోపాటు 118 పద్దాలు చేర్చి ప్రకటించారు. ఇందులో విస్సావారి సేకరణలో లేని 20 పదాలు అదనంగా చేర్చామని పరిష్కర్తలు తమ సంతోషాన్ని ప్రకటించారు.[3]

1952 లో డా॥ గిడుగువేంకటసీతాపతిగారి సంపాదకత్వంలో శ్రీ పిఠాపురం మహారాజా డా॥ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దర్ వారు "క్షేత్రయ్యపదములు" అనే పేరుతో ప్రకటించారు. అంతకుపూర్వమున్న ప్రతుల సాయంతోను, సరస్వతీ మహల్ పుస్తకభాండాగారం నుంచి తెప్పించుకొన్న పదాలు కలిపి 380 పదాలు ప్రకటించామన్నారు గిడుగువారు.[4]

శ్రీ శ్రీనివాసచక్రవర్తిగారు సంకలనం చేయగా 1966 లో "జయంతి ప్రచురణలు" విజయవాడ, వారు "క్షేత్రయ్యపదాలు" వెలువరించారు. ఇందులోని 100 పదాలు పూర్వసేకరణల్లోనివే అయినా వీటికి ఒక ప్రత్యేకత ఉంది. విస్సావారి ప్రతిలోనిపదాలకు రాగతాళాలు మాత్రం చెప్పబడ్డాయి. వావిళ్ళ ప్రతిలోని పదాలకు రాగతాళాలతోపాటు, ఆ యా పదాల మొదళ్ళే శీర్షికలుగా ఉంచారు. గిడుగువారి ప్రతిలోని పదాలకు నాయికా, నాయక లక్షణాదులను సైతం చెప్పారు.[5] ఇది గిడుగువారి ప్రతివిశిష్టత. కానీ శ్రీనివాసచక్రవర్తిగారు తమసంకలనంలోని పదాలకు ఆయాపదాల ప్రధానభావాన్ని శీర్షిక గావించారు.[6] ఆ శీర్షికలను చదివితే చాలు ఆ పదాల సారాంశం స్ఫురిస్తుంది. ఇది దీనిలోని ప్రత్యేకత.

పై పెద్దలకృషివల్ల క్షేత్రయ్య పదాలలోని సాహిత్య పరిరక్షణ, కొంతవరకు సంగీతనాట్యాల సంరక్షణ జరిగినట్లు వ్యక్తమౌ

3. వా. ప్ర. విజ్ఞప్తి—పు. 7. 4. సీ. గి. వేం. పు XXXV.
5. పై దే—పు. XXXV,XXXVi. 6. శ్రీ. చ. – పు. 8.

తూంది. క్షేత్రయ్య సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్య మిచ్చాడు కాబట్టి ఆ పదాల్లోని-అనుశ్రుతంగా సంగీత వేత్తలుపాడే —సంగీతాన్ని సైతం పరిరక్షించడానికి ప్రయత్నాలు జరగడం ముదావహం. ఈ పదాలకు సంగీత స్వరకల్పన చేయడానికి పూనిన వారిలో ప్రథములూ, సమర్థులూ శ్రీ మంచాళజగన్నాథరావుగారు వీరు స్వరం కూర్చగా 1954 లో టి. వి. సుబ్బారావుగారి సంపాద కత్వంలో రాజమండ్రి ఆంధ్రగానకళాపరిషత్తు పక్షాన శ్రీ విస్సా అప్పారావుగారు ప్రకటించారు. ఇందులో 78 పదాలు మాత్రమే ఉన్నా ఆ కృషి ప్రశంసించదగ్గది.[7] ఇంతకంటే సమగ్రంగాను, సుందరంగాను, సంగీత ప్రియులకనుకూలంగాను సుమారు 140 పదాలు స్వరయుక్తంగా ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారు ప్రకటించి 4 - 12 - 1973 న విడుదలచేశారు. మంచాళవారే స్వరకల్పనాకర్తలు. స్వరంకూర్చిన మంచాళవారినీ, ప్రకటించిన అకాడమీ అధిపతులను ఇందుకు ప్రశంసించక తప్పదు. ఇంక 1968 లో నిర్మలా పబ్లిషర్స్, విజయవాడ వారు ప్రకటించిన "క్షేత్రయ్య పదస్వరసాహిత్యములు" పేర్కొనదగింది. ఇందులో శ్రీ బి. కుమారస్వామి (కూచిపూడి) గారు 20 పదాలకు స్వరం కూర్చారు. ఇట్లీ పదాల సంగీత సాహిత్యాలను రక్షించడానికి కృషి జరిగింది.

నా పరిశోధనా సమయంలో మద్రాసు సంగీత అకాడమీ పత్రికలో "Rare Padas of Kshetragna" అని చూసి చాలా

---

7. 30. జ. మం.—తొలిపలుకు—పు—5, 6

సంతోషించాను. అది తమిళలిపిలో ఉండగా మిత్రులు శ్రీ బి. ఏ. కృష్ణమూర్తిగారు[8] నాకు చదివి వినిపించారు. అది ఈక్రిందిపదం :

భైరవిరాగం - మిశ్రచాపుతాళం

పల్లవి : బొట్టుకట్టిన వాని యింటికి - పోయివచ్చెద సామినే

అ. ప : పుట్టిన యింటిలో నుండుట సతులకు
పొసగునా వేణుగోపాల ॥బొట్టు॥

చ. చెలియలి పెండ్లికి తిరువచ్చెద నా సామి
నెల దినములలోను సామి
నీ చెలిమి ఇంతలోన మరువగయుండుము చెలువుడ
నీ మదిలో గలుగ జేసి ఈ నడతలు దైవము
కులధామలలోను నిలవరముగ నీ దయ యుండితే
నీ సొమ్మేగద ఈమేను. ॥బొట్టు॥"[9]

ఈ పదం విస్సావారి ప్రతిలోగాని, వావిళ్ళవారి ప్రతిలోగాని లేదు. గిడుగువారి ప్రతిలో (ప-18, పు. 32) ఉంది. ఇందులో ఒకే చరణం చిన్న మార్పులతో ఉంది. గిడుగువారి ప్రతిలో మూడు చరణాలూ ఉన్నాయి. అనుపల్లవిలో 'మువ్వగోపాల' ముద్రకు బదులు 'వేణుగోపాల' అని ఉంది. ఇలాంటి అపురూప పదాల్ని సైతం గిడుగువారు తమ ప్రతిలో చేర్చారనడానికే ఇంత చెప్పవలసి వచ్చింది.

---

8. Sri B. A. Krishna Murty, Asst. Station Director, All India Radio, Visakhapatnam. He read the Padam for me on 15 – 3 – 1973.
9. J. M. A. – [ Vol. 26. 1955 ] –P. 182 – 188.

మరో విషయం. గిడుగువారు "ఎవ్వడే ఎవ్వడే ఓ భామా! వీడెవ్వడే"; "ఎవరివల్ల దుడుకుమా-యిద్దరిలో సఖియా"; "చల్లనాయె నా మనసు చల్లనాయెనా ?"—అన్న మూడు క్షేత్రయ్య పదాలను సంస్కృతీకరించి 'స్రవంతి'లో ప్రకటించారు.[10]

## 3.2 పదసంఖ్య :

ఇంక క్షేత్రయ్య పదసంఖ్యనుగూర్చి ఒకమాట. క్షేత్రయ్య మువ్వగోపాలాంకితంగాను, తాను దర్శించిన రాజులముద్రలతోను ఎన్నిపదాలు రచించాడో ఇదమిత్థంగా తెలియదు. నోటిపాటలు గాను, తాళపత్రగ్రంథాల్లోను, వ్రాతప్రతుల్లోనుఉన్నవి కొంతవరకు మనకీనాడు లభిస్తున్నాయి పెద్దల కృషివల్ల. దర్శించిన రాజులలో కొందరిపై చెప్పిన పదాలసంఖ్యను క్షేత్రయ్య ఇలా చెప్పుకొన్నాడు.

"పల్లవి : వేడుకతో నడుచుకొన్న—విటరాయడే !

అ. ప. : ఏడు మూడు తరాలనుండి—ఇందున్న కాణాచట
గూడుకొని మా మువ్వ—గోపాలుడే విభుడు ॥ వేడుక ॥

మధుర తిరుమలేంద్రుడు—మంచి బహుమాన మొసగి
ఎదుట గూర్చుండుమని — ఎన్నికఇమ్మనెనే !
ఇదిగో రెండువేల పదము—లిపుడెంచుకొమ్మనిన
చదురుమీదనే ఉన్న సామికి-సంతోషమింతింతగాదె ॥ వేడుక ॥

అళుకుదీరి తంజాపురి — నెలకొన్న విజయరాఘవుని
వెలయ మనుజుల వెంబడి — వేగమె పొడగాంచి
చలువ చప్పరమున నుండగ — చక్కగ వేయి పదముల
పలుకరించుకోగానె — బహుమానమిచ్చె నావేళ ॥ వేడుక ॥

10. స్ర. – [1958, సెప్టెంబరు] పు 48–+1.

బలవంతుడౌ గోలకొండ – పాదుషా బహుమానమిచ్చి
తులసిమూర్తితో వాదు – దలచె నావేళ!
వెలయ మువ్వగోపాలుడు - వెయ్యిన్నెనూరు పదములు
నలువది దినములలోన–ఘన్ను గలసి వినుపించెనే ॥వేడుక॥"

ఇందులో పేర్కొన్నట్లు మధుర తిరుమలేంద్రునిపై చెప్పిన పదాలు 2,000 ; విజయరాఘవునిపై 1,000 పదాలు ; గోలకొండ పాదుషా దర్బారులో పందెంగాచి చెప్పిన పదాలు 1,500 [లేదా 'వెయ్యి న్నూరు' అనే పాఠాంతరంవల్ల 1,100] – అంటే మొత్తం 4,500 [లేదా 4,100] పదాలన్నమాట. "ఈ పదమునుబట్టి మొత్తము 4,500 లేక 4,100 పదములు చెప్పినట్లున్నది."[11] అని విస్సావారూ, "వేడుకతో నడచుకొన్న విటరాయడే' అను పదమునుబట్టిచూడగా క్షేత్రయ్య 4,500 పదములకు పైగా రచించినట్లు కనబడును."[12] అని గిడుగువారూ, "ఈ పదంలో చెప్పిన లెక్కలనుబట్టి క్షేత్రయ్య చెప్పిన లెక్కలనుబట్టి క్షేత్రయ్య పదాలు కనీసం 4,500 ఉండి ఉండాలి".[13] అని ఆరుద్రగారూ, "ఈ పదమునుబట్టి క్షేత్రయ్య రచించిన పదముల మొత్తం సంఖ్య 4,500 కాని, 4,100 కాని, అయి ఉంటుంది."[14] అని రజనీకాంతరావుగారూ అనుకోవడంవల్ల క్షేత్రయ్య పదాల సంఖ్య మొత్తం 4,500 [4,100] మాత్రమే అని తలంచ వలసి ఉంది. కానీ ఇవి కేవలం ఆయా రాజముద్రలుగల పదాలు మాత్రమే. అందుకే రాళ్ళపల్లివారు "దీని [మేరువపదం] ప్రకారము క్షేత్రయ్య వ్రాసిన రాజాంకిత పదములే నాల్గువేల నూటికి

11. 7. అ. వి. – పు. 19.

12. సీ. గి. వేం – పు. 86.

13. ఆం. – సం. 11. పు. 98.

14. ర. రా. బా. – పు. 282.

తక్కువ యుండవు."[15] అని తలచినట్లు క్షేత్రయ్య పేర్కొన్న ఆ పదాలు రాజాంకితాలనడమే సముచితం. క్షేత్రయ్య ఆశ్రయించిన— ఈ పదంలో పేర్కొనని - రాజులు ఇద్దరు; తుపాకుల వెంకట కృష్ణప్ప, రఘునాథనాయకుడు. వెంకటకృష్ణప్పనాయకుని మీది పదాలు మనకింతవరకు లభించినవి మూడు మాత్రమే. రఘునాథ నాయకునిమీద చెప్పిన పదాలు మనకు లభించనేలేదు. ఇంతెందుకు పై పదంలో క్షేత్రయ్య పేర్కొన్న తిరుమలనాయకునిమీదా, "గోల కొండ పాదుషా మీదా చెప్పిన పదాలు మనకు లభించనేలేదు. విజయరాఘవునిపై చెప్పిన పదాలు 12 మాత్రమే లభించాయి. "పన్నగ మధురాపురీశుడైన మువ్వగోపాలు" డన్నదానినిబట్టి "ఇది మధురనాయక రాజయిన తిరుమలనాయకుని కొలువుకు పోయినపుడు రచించినట్లు కనబడుతోంది".[16] అని తలంచిన రజనిగారి ఊహ ఇలా అయి ఉండకపోవచ్చు. 'మధురాపురీశుడు' అసలు తన ఇష్టదైవమే. మధురనాయక రాజు కాదు. పైగా రాజాంకితాలు అంటే మువ్వ గోపాల ముద్రారహితాలు అయిన పదాలు రాజాశ్రయ సమయం లోను. మువ్వగోపాలాంకిత పదాలు క్షేత్రయ్య పరమభక్తుడుగా మారాకా రాసినవన్న సిద్ధాంతం మనం మొదటి ప్రకరణంలో సకారణంగా తెలుసుకొన్నాం. ఆ విభజనమీదే క్షేత్రయ్య జీవిత రహ స్యం ఇమిడిఉందనిగూడ అందులోనే విదితమైంది. కాబట్టి పై పదంలో క్షేత్రయ్య పేర్కొన్న పదాలు 4,500 [4,100] ముగ్గురు రాజుల మీద చెప్పినవి మాత్రమే. కానీ తుపాకుల వెంకటకృష్ణప్ప, రఘునాథ నాయకులపై ఎన్ని పదాలు చెప్పాడో తెలియరాలేదు. కనుక 4,500 పదాలతోపాటు మరికొన్ని వేల పదాలు ఆతడు రచించి ఉంటాడు. ఇవిగాక మువ్వగోపాల ముద్రతో లభించిన పదాలు 347

15. ఆం. ప. [1942-4] – పు. 15.
16. ర. రా. బా. – పు. 236, 237

[మొత్తం 372 - 25 (రాజాంకితాలు 15 + మువ్వగోపాల ముద్రా రహితాలు 10)] అని మొదటి ప్రకరణంలో తెలుసుకొన్నాం. కానీ ఇంకెన్ని పదాలు క్షేత్రయ్య రచించగా మువ్వగోపాల ముద్రగలవి గాలిలో కలిసిపోయాయో ఆ భగవంతునికే తెలుసు.

అంటే పైనిచెప్పినట్లు కొన్నివేలలో క్షేత్రయ్య పదాలు రచించగా ఈనాడు మనకు — పెద్దల ధర్మమా అని — లభిస్తూన్న మొత్తం పదాలు గిడుగువారి ప్రతిలోనివి 372 అని ఆరుద్రగారు తేల్చి చెప్పారు. ఇందులో అంతకుముందే విస్సావారు సంపాదించిన పదాల సంఖ్య 329 పోగా గిడుగువారు అదనంగా తమ ప్రతిలో చేర్చిన పదాలు 43 అని ఆరుద్రగారు వివరించారు.[17] కానీ ఈ 43 పదాలలోను 1951లో ప్రకటితమైన వావిళ్ళ ప్రతి ద్వితీయభాగంలో విస్సావారి ప్రతిలో లేని పదాలను కొత్తగా సంపాదించి చేర్చారు. 1952 లో ప్రకటించిన గిడుగువారు తమప్రతిలో — వావిళ్ళ ప్రతి లోనివి 21 పదాలుగాక - ఇతరత్రా సంపాదించిన పదాలు 22 మాత్రమేనని తేలుతూంది. ఏమైనా ఆ మాత్రం గిడుగువారు మరి కొన్ని క్షేత్రయ్య పదాలను ఆంధ్రలోకాని కందించినందుకు వారు మన ప్రశంసకు పాత్రులు. అయినా ఇంకా పదాల సేకరణకై ప్రయత్నం జరగవలసి ఉన్నమాట మాత్రం వాస్తవం. సుబ్బరామదీక్షితులు "మావద్ద నుండు ప్రాచీనపుస్తకములో పైఁజెప్పిన పంచరత్నములఁ జేర్చి ఏనూరు పదములున్నవి."[18] అని పేర్కొన్నారు. మరి ఆ పదాలన్నీ ఏమయ్యాయో తెలియదు. ఆ పదాలన్నీ ఏనాటికి లభిస్తాయో !

---

17. ఆ—సం. 11. పు. 93, 95.

18. సు. దీ. — పు. 10.

## 3. 3 పదనిర్వచనం:

క్షేత్రయ్య పదకవితా వైశిష్ట్యం తెలుసుకోవడానికి, పదమంటే ఏమిటో, దాని క్రమ పరిణతి ఎలాంటిదో, తెలుగులో దాని ప్రత్యేకత ఎంతటిదో గుర్తించడం ముఖ్యమే.

'పదం' అంటే సామాన్యార్థంలో పాట అనే వాడుక. ఇది రాగ తాళాలతోను ఉండవచ్చు; లేదా కేవలం స్వరసహితమూ కావచ్చు. ఇది జానపదుల సాహిత్యంలో స్పష్టంగా తెలుస్తుంది. కోలాట, దంపుళ్ళపాటల్లో తాళముంటుంది రాగంతోపాటు; విసర్రాయి, కపిలి పాటల్లో రాగమేగాని తాళాని కవకాశంలేదు. 'పదం' పాడమన్నది జనవ్యవహారం.

స్వరతాళ పదాత్మకమైంది గాంధర్వమనీ, స్వరతాళానుభావకమైన పదమే వస్తువనీ, అర్థసహితమైన అక్షరాలతో కూడినది 'పద' మనీ, ఈ పదం 'నిబద్ధం' 'అనిబద్ధం' అని రెండు విధాలనీ, అవి అతాలమూ, సతాలమూ నని రెండు విధాలనీ భరతముని నిర్వచనం.[19] "నియతాక్షర సంబంధము కలిగి, ఛందోయతి సమన్వతమై, తాళపాతములలో కూడిన పదము 'నిబద్ధ' మనబడును. యతి, పాద నియమము లేనిదియును, అనియతాక్షరమును అగు పదము అనిబద్ధ మనబడును."[20] "నిబద్ధ పదాలలో ప్రధానములు వృత్తపదాలు.

---

19. "గాంధర్వం యన్మయా ప్రోక్తం స్వరతాళపదాత్మకమ్
పదం తస్య భవేద్వస్తు స్వరతాళానుభావకమ్।
యత్కించి దక్షరకృతం తత్సర్వం పదసంజ్ఞితమ్
నిబద్ధంచా నిబద్ధం చ తత్పదంద్వివిధం స్మృతమ్।
అతాళంచ సతాళంచ ద్విప్రకారంచ తద్భవేత్
సతాళంచ ధ్రువార్థేషు నిబద్ధంచ వైస్మృతమ్".
— భ. ము — అ 32, శ్లో. 25, 27.

20. నా. శా. పో. శ్రీ. - అ. 32, పు. 809.

ఇవి సమ వృత్తాలూ, అర్ధ సమవృత్తాలూ, విషమవృత్తాలూ అని మూడు రకాలు."[21] సంగీత పరిభాషలో ఈ పదాలు ప్రబంధా లనబడతాయి. పైని భరతముని చెప్పినవే - మతంగుడు, శార్ఙ్గ దేవుడు, చివరికి వేంకటమఖివరకు - సమంగానే ఉన్నాయి. ఇంక ఈ ప్రబంధంలోని అవయవాలు అంటే ధాతువులు మొదలైనవాటిని పరిశీలిద్దాం. "ప్రబంధశరీరం 4 భాగాలు: 4 ధాతువులు. అవి ఉద్గ్రాహము, మేలాపకము, ధ్రువము, ఆభోగము. ఉద్గ్రాహము ప్రబంధపు మొదటి భాగం; అనగా ఆరంభం. ధ్రువము ప్రబంధపు ముగింపు. మేళాపకం ఉద్గ్రాహ ధ్రువాలను కలుపునది. ఆభోగము ప్రబంధ రచయిత నామమో, అంకిత మిచ్చిన దేవతా నామమో ముద్రగా కలిపిన తుదిభాగం. ... ఈ ధాతువుల ఏర్పాటునుబట్టి ప్రబంధాలు మూడు విధాలు; ద్విధాతుకాలు, త్రిధాతుకాలు, చతుర్ధాతుకాలు. ద్విధాతుకం అంటే ఉద్గ్రాహ ధ్రువములు మాత్రమే ఉండే ప్రబంధం. ఉద్గ్రాహ ధ్రువాభోగాలుండేది చతుర్ధాతుకం." "స్వరం, బిరుదం, పదం, తేనకం, పాటం, తాలం అను ఆరూ ప్రబంధానికి అంగాలు ... ఈ అంగాలతో విరచితము లయిన ప్రబంధాలు ప్రత్యేకం నాదాత్మకములు. అంటే మాతు రచనా ప్రధానములు కావన్నమాట." "మరొక మూడు విధా లయిన ప్రబంధ విభజనం ఉంది. అవి ఏవంటే సూడ ప్రబంధాలు, ఆళిసంశ్రయాలు, విప్రకీర్ణాలు."[22] ఏలాదులు ఎనిమిది మొదటి రకం; వర్ణాదులు 24 రెండో రకం; శ్రీరంగాదులు 36 మూడోరకం.

స్వరరాగాలతో పాడబడేది గీతం. "స్వరరాగైః ప్రగాయంతి గీతమిత్యభిధీయతే." "శార్ఙ్గదేవుడు గీతములకు ప్రబంధ

21. ర. రా. శా. – పు. 56, 57. 22. పై. దే. – పు. 57–59.

ములకు ఒకే అధ్యాయం చెప్పాడు. వేంకటమఖిమాత్రం గీతాలకు ప్రత్యేకాధ్యాయం చెప్పాడు. "[23]

పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అని ప్రసిద్ధి పొందిన అన్నమాచార్యుడు సంస్కృతంలో రచించిన సంకీర్తనలక్షణాన్ని, ఆతని మనుమడు చిన తిరుమలాచార్యుడు తెలుగులో పద్యాత్మకంగా రచించాడు.[24] అందులోని పదకవితా లక్షణం క్లుప్తంగా ఇది.[25] ఇది చాలవరకు భరతాదులు వచించిన పద్ధతే.

" భరతాదులు గ్రంథంబుల
విరచించిన లక్షణములు వేంకట భూమీ
ధరవర కీర్తన లక్ష్యము
లురు పద కవితాపితామహుండేర్పఱచెన్ "[26] — అని

చిన తిరుమలాచార్యుడే చెప్పుకొన్నాడు. " పదమగు సుప్తిఙంతము, పదమవయవ మవయవియును పదమనఁ బరగున్ "[27] అని మొదటే పదం వివరించబడింది. ఇందులో అవయవ పదం చతుష్పాదం; వృత్త, ధాతు, అవయవాలతో పాటించబడుతుంది. పదాలు శృంగార, వైరాగ్య పదాలని ద్వివిధం. ఈ శృంగార పదాలు గ్రామోక్తులతో ఉండవచ్చునట.

" పదములు శృంగార వధూ
మృదుమధుర మనోజ్ఞవాక్య మిశ్రములైనన్

---

23. పై దే. పు. 74, 75. 24. తి. తా. చి.
25. భా - (అగస్టు 1971) పు. 5 — 9.
26. తి. తా. చి. — ష. 13, పు. 1·9. 27 పై దే—ప. 24, పు. 141.

విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగాఁ బొంక మెఱిఁగి పలుకఁగఁ జెల్లున్ "28.

అయితే వైరాగ్య పదాలు అలాగాక "అగ్రామ్య రమ్య విష్ణుచరితోదారమై" ఉండడం అవసరం. వీటినే అధ్యాత్మ పదాలంటారు. సంస్కృత, ప్రాకృత, దేశభాషల్లో చెప్పవచ్చు. వీటికి పద్యాల్లాగా యతి ప్రాసలు వర్తిస్తాయని భరతాదుల మతం. పదాలు వృత్త, నిబంధ, అనిబంధాలని మూడు విధాలు. ఈ నిబంధ పదంలో నాలుగు పాదాల చరణ మొక్కటిగాని, అంతకు మించిగాని ఉండవచ్చు. ఇలాంటి చరణాల అర్థాన్ని వదలక అన్నిటికి ఏక వాక్యతతో, గుదిగ్రుచ్చినట్లు పదం చివర మరల మరలా భాసిల్లునట్టి 'పల్లవి' ఉంటుంది. ఇది పల్లవి, శిఖాపదమని ద్వివిధం. 'పదసమానమాన పాదయుగ్మము' గలది పల్లవి. అందులో సగం ఏక పాదంగలది శిఖాపదం. ఈ నిబంధపదంలో పల్లవి ఉంటే శిఖాపదముండదు. శిఖాపదముంటే పల్లవి ఉండదు. ఇలాంటి పల్లవి, శిఖాపదాలతో గూడిన నిబంధపదం చతుర్ధాతుక, త్రిధాతుక, ద్విధాతుక, ఏక ధాతుకాలని చతుర్విధం. కానీ ఏకధాతుక పదం అరుదుగా ప్రయుక్తమవుతుంది. వృత్తాలు నాలుగు పాదాలతోను, జాతులు రెండు పాదాలతోను ఉన్నట్లే, సంకీర్తనలుగూడ చతుష్పాద, ద్విపాదాకృతితో ఉంటాయి. ఇట్టి కీర్తనలలో దరువు, వాక్యం, అర్ధచంద్రిక, ఏల, గొబ్బిళ్ళు, చందమామ పదాలు అనేవి రెండేసి పాదాలతో ఉంటాయి. ఇవిగాక అష్టపది, పదమాలిక, శరభపాదం - అనే పద విశేషాలున్నాయి. ఇంక అనిబంధపదం అంటే అనిర్యుక్తపదం. ఇది తాళబంధచ్ఛందోవిరహితమై చూర్ణాఖ్యతో ఉంటుంది. దీనిని తాళగంధి అని కూడ అంటారు. ఇది సూక్ష్మంగా అన్నమయ్య

28. పై దే- ప. 69, పు. 147.

సంస్కృతంలో చెప్పిన సంకీర్తన లక్షణం. దీనికి లక్ష్యంగా వేల సంఖ్యలో అతడు రచించాడు సంకీర్తనలు.[29]

ఇక్కడ సుబ్బరామదీక్షితులు కీర్తన, పదం మొదలైనవాటిని నిర్వచించారు.[30] రజనిగారు వాటిని వివరించారు.[31]

కీర్తన ఎలా క్రమ పరిణతి చెందిందో తెలుసుకోవడం అవసరం. "జయదేవుని అష్టపదులలో మొదటి ఉద్గ్రాహమనే ఖండము అను పల్లవిగాను, తరువాతి ధ్రువమనే ఖండము పల్లవిగాను - తరువాతి రచనలలో పరిణమించాయి. ఉద్గ్రాహంలో రెండు పంక్తులు, ధ్రువంలో రెండు పంక్తులు ఉంటాయి. చరణాలు పంక్తుల చొప్పున ఎనిమిది ఉంటాయి. అందుకే వానికి అష్టపదులని పేరువచ్చింది.... నారాయణ తీర్థులనాటికి ఆయన తరంగాలలో పల్లవి (ధ్రువం) ముందుకు వచ్చి ఒక పంక్తిగాను, తరువాత రెండు పంక్తుల ఉద్గ్రాహం అనుపల్లవిగాను మారి తాళ్ళపాకవారి నాటివలె ఒక్కొక్కటి నాలుగేసి పంక్తులు గల మూడు చరణాలతో ముగియవచ్చింది.... చరణాలు కొన్నిటిలో 3 మాత్రమే కాక 4, 8, 9, 10 కూడ ఉంటూ వచ్చాయి. క్షేత్రయ్యనాడు తరువాత త్యాగయ్యాదుల నాడు కూడ పల్లవి, అనుపల్లవి 3 చరణాలు ఉండే సంప్రదాయం వచ్చింది." "క్షేత్రయ్యవరకూ వ్రాసిన వారి కీర్తనలలో పదాలలో చరణాలు మూడేసి ఉండటం కద్దు. త్యాగయ్య, దీక్షితులు మొదలైన అద్యతనవాగ్గేయకారుల రచనలలో కొన్నిటిలో ఒకేచరణం కనబడుతూంది ... తొలిరోజులలో పదము, సంకీర్తనము పర్యాయపదాలుగా ఒకే అర్థంలో వ్యవహారముండేది. అవి శృంగార, సంకీర్తనలనీ, అధ్యాత్మ సంకీర్తనలనీ రెండు విధాలయి రాను రాను

---

29. భా - (ఆగస్టు 9 ) - పు. 11 - 16.
30. సు. దీ-పు. 106-111, 31. ర. రా. బా-పు. 75-77

క్షేత్రయ్యనాటికి శృంగార సంకీర్తనలు పదాలనీ, త్యాగరాజునాటికి ఆధ్యాత్మ సంకీర్తనలు కీర్తనలనీ వ్యవహారం రూఢమైంది ... కీర్తనలో ధాతువు, మాతువు సమపాళాలలో ఉంటాయి. క్షేత్రయ్య కాలమునుంచి ధాతువు అధికంగా ఉండి మాతువు తక్కువగా ఉండి విళంబంగా, గమక, వరికలతోను, విన్యాసంతోను గానంచేసే పదశైలి వ్యాపించింది. ఆ తరువాత త్యాగరాజాదుల కాలంలో విలంబ పద శైలి మధ్యమకాల సంగతులతో కూడి ఇప్పటి కీర్తన శైలిగా పరిణమించింది."

"కీర్తన ధాతువులో సంగతుల విస్తృతితో కూడిన ప్రస్తావము తోడయి, త్యాగరాజునాటినుంచీ నెరవకల్పనతో చిట్టస్వర కల్పనలతో మరింత పటిష్ఠమయి కీర్తనకు కృతి అనే వ్యవహారం వచ్చింది."[32] ఇది కీర్తనకు కలిగిన క్రమ పరిణామం.

ఇది ఇలా ఉండగా సంగీతసాహిత్య వేత్తలలో అగ్రేసరులైన రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు పదనిర్వచన మిట్లుచేశారు. "కాని ఇప్పుడు శృంగారమయమై, ఎక్కువగా విలంబకాలమందు, క్వచిత్తుగా మధ్యమకాలమందు నడచుచు, పల్లవానుపల్లవములు, మూడింటికి తక్కువకాని చరణములు గలిగి, ప్రాచీనరక్తిరాగము లలో చేయఁబడిన గేయరచనకు 'పదము' లని పేరు ... సంగీత రచనా ప్రధానములగు త్యాగయ్యగారి రచనలవంటి వానిని 'కృతులు' లనుచున్నాము. భక్తి ప్రధానములగు రామదాసు పాటలవంటి వానిని 'కీర్తనములు' అనుచున్నాము. సంగీతసాహిత్యములు రెండును చౌకరకములవై దేశీయరాగములలో చిల్లర శృంగారపు మాటలు గూర్చిన పాటలను 'జావళ్ళు' అనుచున్నాము. కృతులందునవలె

32. పై దే – పు. 78–80.

సాహిత్యమునుగాని,కీర్తనలందువలె సంగీతమునుగాని దిగ్రమింగుటకు పదములలో అనుమతిలేదు. రెంటికిని సమాన ప్రాధాన్యమీయగల సంగీతశిల్పికి తప్ప తక్కిన వారికిందులో ప్రవేశమే కదు."[33] ఇది పదాలగూర్చిన రాళ్ళపల్లి వారి నిష్కర్ష అయిన అభిప్రాయం. కానీ 'పదం' అంటే కేవలం 'సంకీర్తన', 'పాట' అనే గాక పద, పద్యాల కది సంకేతమవుతుందనీ, 'పదం' అంటే కేవలం శృంగార పదమే కాదనీ, సమస్తమైన పాటలూ అందులో గతార్థాలవుతాయనీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు సుదీర్ఘచర్చలో సయుక్తికంగా నిరూపించారు.[34] సమస్తంగా పదవాఙ్మయాన్ని పరిశీలించినప్పుడు ఇది వాస్తవమే కావచ్చు. కానీ వ్యస్తంగా – అంటే ముఖ్యంగా — క్షేత్రయ్య పదాలనే గ్రహించినప్పుడు మాత్రమే పదం అంటే శృంగారపదమనీ రాళ్ళపల్లి వారి అభిప్రాయంగా మనం తలంచవలసి ఉంది. కారణం సుబ్బరామదీక్షితులు పదనిర్వచనంచేస్తూ "పదము యొక్క మాతువు శృంగారరస నాయికానాయక లక్షణ వ్యవహారా దులతో కూడిన" దని చెప్పారు.[35] దీనికి లక్ష్యమైన క్షేత్రయ్య పదాలు అంటే శృంగార పదాలను గూర్చి చెప్పేటప్పుడు పదం అంటే శృంగారపదమనే అభిప్రాయం.

## 3.4 వాగ్గేయకారుడు :

పదంలోని వాక్కును గేయాన్ని చేయగలసమర్థుడు వాగ్గేయ కారుడు. శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరంలో వాగ్గేయకారుని నిర్వ చనం ఇలా ఉంది.

---

33. ఆం. ప. (1942–43) పు. 11.
34. 25. గో. కృ. వ. – పు. iii – xxxviii.
35. సు. దీ. – పు. 109.

" వాఙ్మాతురుచ్యతే గేయం ధాతురిత్యభిధీయతే
వాచం గేయంచ కురుతేయః సవాగ్గేయకారకః ॥ "

— పదంలోని వాక్కు మాతువు ; గేయం ధాతువు. అట్టి వాక్కును గేయాన్ని రచించగలవాడు వాగ్గేయకారుడని అర్థం. వాగ్గేయ కారునకుండవలసిన లక్షణాలు సంగీతరత్నాకరంలో వివరించబడ్డాయి.[36] ఈ వాగ్గేయకార లక్షణాల్ని పరిశీలిస్తే ఉత్తమ కవికుండవలసిన లక్షణాలతో ఏమాత్రం తీసిపోవని తెలుస్తూంది. అంతేగాదు, కవికంటే గూడ ఉత్తమ వాగ్గేయకారునిలో సంగీతాది కళలలో పరిజ్ఞానముండాలని స్పష్టమవుతుంది. వాగ్గేయకారుని ' బయకారు ' డనడం వాడుకలో ఉంది. చతురకల్లినాథునకు, రామామాత్యునకు ' రాయబకార ' (రాజవాగ్గేయకారుడు) అన్న బిరుదం ఉన్నట్లు తెలుస్తూంది.[37] మాతువు, ధాతువు అనే రెంటిని గుర్తించినవాడు ఉభయకారుడనీ, కానీ ప్రపంచంలో ఉభయకారుడనడానికి బదులు అపభ్రంశ బయకార శబ్దంతో పిలుస్తున్నారనీ గోవింద దీక్షితులు శబ్ద వ్యుత్పత్తిని వివరించాడు.[38] ఉత్తమ లక్షణాలతో కూడిన సర్వ శ్రేష్ఠుడైన వాగ్గేయకారుడు క్షేత్రయ్య. క్షేత్రయ్య పదకవిత పైని చెప్పబడిన లక్షణాలకు ఎంతవరకు అనుగుణంగా ఉందో, దాని వైశిష్ట్యం ఎట్టిదో పరిశీలించడమే ఈ ప్రకరణోద్దిష్ట విషయం.

## 3.5 క్షేత్రయ్యపదకవితా శిల్పం

సంగీసాహిత్యాభినయాలకు తన పదాల్లో సముచిత ప్రాధాన్య మొసగి రచించిన క్షేత్రయ్య ప్రతిభ, అతనిని సర్వశ్రేష్ఠుడైన వాగ్గేయకారునిగా చేయకలిగింది. భావ రాగ తాళాలు, గీత వాద్య

36. శా. దే — 37. ర. రా. బా. - పు. 33 34, 37, 53.
38. సంగీతసుధ.

నృత్యాల సమ్మేళనం పదమనీ, ఇందుకు క్షేత్రయ్య పదాలు చక్కటి ఉదాహరణలని పేర్కొన్న టి. వి. సుబ్బారావుగారి మాటలు ప్రత్యక్షరసత్యం.[39] సాహిత్య జిజ్ఞాసువులకు, సంగీతాభిమానులకు, నాట్యాభినివేశపరులకు సమంగా ఆనంద నిష్యందులీ క్షేత్రయ్య పదాలు. "ఈ రాగతాళములు రెంటిని కలిపి, హృదయంగమములైన భావములను వెలువరుచుభాషను అలంకరించుటయే పదరచనకు పూర్ణస్వరూపము; దాని పూర్ణానుభవమును మన కప్పుడే."[40] అన్న రాళ్లపల్లి వారి మాటలు ఇక్కడ సరిగా సరిపోతున్నాయి. పదకవితా శిల్పానికి భాషా రచన ప్రధానాంగం. రాగతాళలయలు దాని కలంకారాలు. "ప్రకృత విషయమైన క్షేత్రయ్య పదము, కవిత్వము రాగతాళములును పరస్పర సౌహార్దముతో కలిసి తయారైన నిండురచన."[41] రాళ్లపల్లి వారి ఈ అభిప్రాయం చాల విలువైంది. క్షేత్రయ్య పదాలలోని కవితాకల, సంగీతపు సొంపు, అభినయపు ఆర్జవం మనం గుర్తిస్తే క్షేత్రయ్య పదవైశిష్ట్యం బోధపడినట్లే; ఈ మూటి వివరణమే ప్రస్తుత విషయం. పల్లవి, అనుపల్లవి, మూడు చరణాలతో ఉండడమే క్షేత్రయ్య పదాల సామాన్యలక్షణం. ఈ పదంలో పల్లవిలోని భావం ప్రధానమై, అనుపల్లవిలో మరింత వికసించి, మూడు చరణాల్లో రసజ్ఞ మనోజ్ఞమై, మధురమంజులమై, ఆనంద నిష్యంది అయి ఉంటుంది.

"పల్లవి :- బాగాయె నీ వగలెల్లమా - బాగాయె

అ. ప. :- బాగాయె మువ్వగోపాలా ! నీ వగలెల్ల ॥ బాగాయె ॥
నీకు నేమడుపులందించేది నీవా- నెలతకందిచ్చేది

39. 30. జ. మం - పు. 3. 40. ఆం. సా. అ. - పు. 13.
41. పైదే - పు. 18

లోకులందరు నవ్వేది అది-నాకమరేమో ఆగడము
॥ బాగాయె ॥
నిన్ను నేకౌగిలించేదినీవా - నీ రజాక్షిని తలచేది
నన్ను నీ వాడుకొనేది అల్ల - ననబోణింటను నవ్వు
కొనేది ॥ బాగాయె ॥

కూడి నేనిను లాలించేది మువ్వ-గోపాల! నీ వలిగేది
చాడిమాటలు వినేది నను-చౌక జేసి యల్లసఖిని
మెచ్చేది ॥ బాగాయె ॥"42.

ఇందులో నాయిక స్వీయ, మధ్య, ఖండిత; అనురాగపూర్ణ హృదయ అయిన ఈ నాయిక సర్వోపచారాలు సముచితంగాచేయగా స్వీకరించిన మువ్వగోపాలుడు ధృష్టుడవటంవల్ల అన్యనాయికాలోలుడై, తల్లాలనా ప్రవణుడైనందుకు, ఆమె ఎత్తిపొడుపు మాటలతోదూరుతూంది. అద్భుతంతోపాటు విరహవిప్రలంభశృంగారాలు రసాలు; దైన్యం, అసూయ, వ్రీడాదులు సంచారిభావాలు. నాయకుడు నాయికకు చేసిన మోసాన్ని 'బాగాయె నీ వగలెల్లనూ బాగాయె' అని పల్లవిలో ఆరంభించింది. ఇదీ ఈ పదంలోని ప్రధానభావం [Central Idea]. "బాగాయె మువ్వగోపాల! నీ వగలెల్ల" అన్నసంబోధనతో ఎత్తిపొడుపు మరింతగా అనుపల్లవిలో వికాసం పొందింది. ఆ భావం తరువాతి చరణాల్లో సంపూర్ణత్వం పొంది, రసస్ఫూర్తి కలుగుతూంది. ఈవిధంగా పదం సహృదయ హృదయాల్ని అలరిస్తుంది. ఇది క్షేత్రయ్య పదాల్లోని రమణీయ రచనాశిల్పం. అన్నమయ్యతో ఆరంభమైన శృంగారం క్షేత్రయ్య పదంలో పరిపుష్టమైందన్న విషయం సుస్పష్టమవుతూంది. ఇట్లే ప్రతి

42. 7. అ వి-పు. 1.

పదాన్ని వివరిస్తూ వెళ్ళవచ్చు. సామాన్యంగా ఒక ఖండం పల్లవి, ఒకఖండం అనుపల్లవి, నాలుగు ఖండాలు గల మూడు చరణాలు గలిగిన పదాలే క్షేత్రయ్యలో అధికం. కానీ ఒకఖండం పల్లవి, రెండు ఖండాలు అనుపల్లవి గలవీ, రెండు ఖండాలు పల్లవి, అనుపల్లవి గలవీ, రెండు ఖండాలు పల్లవి, ఒకఖండం అనుపల్లవిగలవీ — ఉన్నాయి. 2 ఖండాలు గల 3, 4, 5 చరణాల పదాలు సైతం ఉన్నాయి. ఇట్లే మూడు ఖండాలు గల మూడు చరణాల పదాలు కొన్ని ఉన్నాయి. 4 ఖండాలుగల 4చరణాలపదం ఒకటీ, 2 ఖండాల పల్లవీ, నాలుగు ఖండాల అనుపల్లవీ గల పదం ఒకటీ- ఉన్నాయి. ఇట్లీవైవిధ్యం క్షేత్రయ్య పదరచనా ప్రణాళికలో సైతం చూడగలం. అయినా ప్రధానమైన భావం అనుస్యూతంగా పూసలలోని దారం లాగా ఎడతెగకుండా అంతర్లీనమై, రసస్ఫూర్తి కుపస్కారకమై, పదమనోజ్ఞత్వానికి దోహదం చేస్తూ ఉంటుంది. ఇది క్షేత్రయ్య పదంలోని మహత్వం.

వాగ్గేయకారున కుండవలసిన ప్రతిభాద్యనేక లక్షణాలు క్షేత్రయ్య లో కోకొల్లలుగా ఉన్నాయి. ధాతుమాతువుల సమ్మేళనంచేసి పదరచనగావించడంలో ఆతని అమేయప్రతిభ గోచరిస్తుంది. అనూహ్యమైన చిత్తవృత్తుల చిత్రీకరణ చణత్వం, చమత్కృతీ మొదలైన అనేక గుణాలు ఆతనిలో అతిగా ఉన్నాయి. సంగీతసాహిత్యాభినయాల్ని మేళవించి చేసిన ఈతని పదరచనకు దీటు రాగలది మరొక్కటి లేదంటే అత్యుక్తికాదు !

"ముదివిటులు వెధవ లంజలు
పదకవితలు (?) మాలు బాపన వా
ల్చదువని పండితవర్యులు

కదనాస్థిర వీరవరులు కడిది పురమునన్" — అనే పద్యంలో శ్రీనాథుడు పదకవితలను అంగీకరించాడని అనడంకద్దు. కాని ఇది నిజమైతే 'పల్నాటి వీరచరిత్ర' లాంటి ఉత్తమపదకావ్యం శ్రీనాథుడు రాసి ఉండేవాడుకాడు. రెండో ప్రకరణంలో చెప్పుకొన్నట్లు శ్రీనాథుడు-వాస్తవానికి-పదకవితను సమాదరించాడని చెప్పడమే సముచితం.[43] పదపద్యకవితలలో పద్యకవితకే ప్రాముఖ్యం పండిత లోకంలో. పద్యంలోని ప్రౌఢతేడనికి కారణం. కవిప్రతిభచెప్పే పద్ధతిలో ఉంటుందే కాని తీసుకొన్న ప్రక్రియలో కాదని సర్వజన విదితమే.[44] కాబట్టి ఏనాడో ప్రౌఢకవి కావ్యాన్ని నిర్వచిస్తూ విశ్వ నాథుడు చెప్పిన 'వాక్యం రసాత్మకం కావ్యం' మ్మన్నది గాని, ఇంకా ఇంతకంటే సూక్ష్మంగా చెప్పిన జగన్నాథపండిత రాయల 'రమణీ యార్థ ప్రతిపాదకశబ్దఃకావ్య' మ్మన్నది గాని పదకవితకు సముచిత నిర్వచనమని తలంచవలసి ఉంది. ఎందుకంటే ప్రతిపదంలో రసం చిప్పిలు తూండడం లోనైతేనేమి, ప్రతిపదం రమణీయార్థ ప్రతిపాద కమై, రసజ్ఞమనోజ్ఞంగా నిరసర్గ మాధుర్య ప్రకటనా క్షమమై, రసా నందనిష్యంది కావడం లోనైతేనేమి క్షేత్రయ్య పదకవిత ప్రౌఢ కవిత్వంతోనేమాత్రమూ తీసిపోదు. పైపెచ్చు ప్రౌఢకవితకు లేని మరో విశిష్టగుణం ఇది సంతరించుకొన్నది. ప్రౌఢకవిత సంస్కృత సమాస భూయిష్ఠమై ఉండడంవల్లనైతేనేమి, కఠినమైన కవిత్వపు కస రత్తులతో కూడి ఉండడంవల్లనైతేనేమి, సామాన్య జనాస్వాదన కంతగా అందుబాటులో లేకపోతూండగా, క్షేత్రయ్య కవిత తేట తెలుగులో, తెలుగు నుడికారమూ, పలుకు బళ్ళతోనిండి పామర జనసముదాయానికి సైతం అందుబాటులోఉండి ఆనందాపాది కా గల్గింది. పైగా సాహిత్యంతోపాటు, సర్వప్రాణికోటిని తలలూపించ

43. ఈ సిద్ధాంతవ్యాసం — ప్రక-2 పు 61, 62.

44. 19 అం సా. అ.— పు. 265.

గల సంగీతం, అభినయం ముడిపడి ఉండడంవల్ల ఈ పదాల ప్రాశస్త్యం స్పష్టం కాక మానదు. రసాత్మకమైన వాక్యాలకూ, రమణీయార్థ ప్రతిపాదకాలైన శబ్దాలకూ- క్షేత్రయ్య ప్రతిపదమూ చక్కటి ఉదాహరణ అంటే అతిశయోక్తి కాదు, సహజోక్తి !

## 3. 5. 1 మనోజ్ఞపదరచన :

క్షేత్రయ్య సర్వవిధాలా మనోజ్ఞమైన పదరచనలో ప్రతిభా సంపన్నతను, నైపుణ్యాన్ని చూపించగలడు. ఇందుకీ పదమే ఉదాహరణ అవుతుంది.

"పల్లవి : మగువ తనకేళికా - మందిరము వెడలెన్

అ. ప. : వగకాడ మాకంచి-వరద! తెల్లవారెననుచు ॥మగువ॥

విడజారు గొజ్జంగి - విరిదండ జడతోను

కడుచిక్కువడి పెనగు - కంట సరితోను

నిడుదకన్నులదేరు - నిదురమబ్బుతోను

తొడరిపదయుగమున-తడబడెడు నడతోను ॥మగువ॥

సొగసిసొగయని వలపు-సొంపుజూపులతోను

వగవగల ఘనసార-వాసనల తోను

జిగిమించు కెమ్మోవి-చిగురు కెంపులతోను

సగము కుచముల విదియ-చందురులతోను ॥మగువ॥

తరితీపుసేయు సమ-సురత బడలికతోను

జరుతపావడ చెఱగు-జారైపటతోను

ఇరుగడల కైదండ - లిచ్చు తరుణులతోను

పరమాత్మ! మా మువ్వగో-పాల! తెల్లవారెననుచు

॥ మగువ ॥

[సీ. గి. వేం - ప. 19] ఈ పదరచనతో క్షేత్రయ్య అమరు డయ్యాడు. ఇది అతనికీర్తికి జయపతాక! రసజ్ఞులైన పాఠకులకి రసభావాలు అనుభవైకవేద్యాలు. పల్లవిలోని భావం నాయిక తన కేళికా మందిరం - ఏకాంతమందిరం - వెడలిరావడం. 'తన కేళికా మందిరం' అన్నాడు కవి చాల సాభిప్రాయంగా; అనుపల్లవిలోని భావంతో పదంలోని ప్రధానభావం పూర్తిగా వ్యక్తమవుతుంది. తక్కిన మూడు చరణాల్లోను నాయిక బాహ్యాంతరాల భావాలన్నీ స్పష్టమవుతాయి. గతరాత్రి ఏకాంతమందిరంలోకి వెళ్లుతూ జడలో తురుముకొన్న 'గొజ్జంగివిరిదండ' విడజారిపోతూంది. 'కంటుకరి' చిక్కువడి పెనగులాడుతూంది. విశాలనేత్రాల్లో-రాత్రిమేల్కొనటం వల్ల - తెల్లవారినా 'నిదురమబ్బు' స్ఫుటంగా కనిపిస్తూంది. దానితో అలసట, అలసటచే తడబడునడకలు; పరవశత్వం పొందీ పొందని 'వలపుచూపుల' సొంపులతోను, కర్పూరపు పరిమళాలతోను, 'కెమ్మోవిచిగురుకెంపుల' కాంతులతోను, నాయకుడుంచిన నఖక్షతాలతోడి సగంమాత్రమే కనిపించే స్తనద్వయంతోను, నాయిక కేళికామందిరం వెడలివచ్చింది. అంతేకాదు. తలతీపులు కలిగించే 'సమసురతం' వల్ల బడలిక కలిగింది; అది స్పష్టంగా తెలుస్తూంది. ఆ బడలికవల్ల జారిపోవు పైటను సైతం సవరించుకోవడం లేదు. అందదండలుగా చెలికత్తెలు ఇరుగడల ఉన్నారు-కాబట్టి సరి పోయింది. 'అయ్యో పరమాత్మా! తెల్లవారిపోయింది' అంటూ నాయిక తనకేళికామందిరం వెడలి వచ్చిందట! ఇది నాయికావస్థకి పూర్ణ పరవశత్వానికి పరమోదాహరణ. అమ్మవారూ, అయ్య గార్లను వేంచేపు చేయించాక రాత్రి జరిపిన సురత క్రీడావిశేషాలు ఈ పదంలో వర్ణితం. ఇది భగవత్పరకమైంది. నాయిక తానే అయి మధురభక్తి భావనతో క్షేత్రయ్య వర్ణించాడు. ఈ అలౌకికమైన శృంగారం అనితరసాధ్యమూ, అనన్య సామాన్యమూ అంటే అబ్బుర

మరో పదంలో చిత్రకారునకు, శిల్పికి, నర్తకికి, [illegible] చేతగానిదీ, కవికి మాత్రమే సాధ్యమైనదీ క్షేత్రయ్య తన పదంలో సాధించాడు. ఇది భావైకవేద్య. సరసజ్ఞులను సహృదయ [illegible] గలదు.

"పల్లవి : చాలు చాలు ఈ చిన్నెలతో నాదు - [illegible]

అ. ప. : చాలు ! ఈ చిన్నెలు - సాగవు నావద్ద ! [illegible] !
భామవద్దకే [illegible] ! [illegible]

కన్నుల వీడెముతో - కాటుక మోవితో !
వెన్నువ కీల్జడ - వేటుతోను !
కన్నియ కెంపుల - గాజుల నొక్కులతోను !
వన్నెకాడ ! నుదుటను - నున్నలత్తుకతోను [illegible]

నిద్దురమబ్బుతోను - నిండు బడలికతోను !
ముద్దియ కలిసిన - ముదముతోను !
నిద్దంపు చెక్కిళ్ల - నెలవంకలతోను !
వద్దురా వద్దులు - వగకాడ ! నాతోను ! [illegible]

అలదాని కుచముల - నలదిన జవ్వాజి
కల యురస్థలమును - నంటి నన్నంటరాకు
బలమిచేసేదేల - బాల మువ్వగోపాల !
అలనాడె గూడిన - చెలిమి [illegible] ! [illegible]"

[[illegible] 48]

పై మొదటి చరణంలోని భావాన్ని, ధ్వనిని చిత్రకారుడు [illegible] లేడు ; శిల్పి శిల్పంలో చెక్కలేడు. కవి మాత్రం తన [illegible]

మాటలతో చక్కగా చెప్పగలడు. 'కన్నుల పీడెము, కాటుక మోవి' గడుసు ప్రయోగాలు. విన్నవెంటనే ఎంతో అసహజం అనిపిస్తుంది. కానీ అందులోని వ్యంగ్యం భావిస్తే మనోహరమై మంజులమైన భావం స్ఫురిస్తుంది. 'నాయికా నాయకులు ఒకరినొకరు కళ్లు ముద్దుగొన్నా' రన్న ధ్వని ఇందులో ఉంది. కళ్ళలో పీడెమూ, మోవిని కాటుకా ఉన్నాయి. వెన్నున కీల్జడవేటు తగిలిన గుర్తుంది; కెంపుల గాజుల నొక్కులు శరీరంమీద ఉన్నాయి; లత్తుక నుదుట ఉన్నదట! అంటే నాయకుడు నాయిక పాదాలకు మ్రొక్కడన్నమాట ! ఇది శృంగారంలో ఒకభాగమే కదా ? 'నిద్దురమబ్బు, నిండు బడలిక, ముద్దియ కలిసిన మదము, చెక్కిళ్ళపై నెలవంకలు' నాయికా నాయకుల సురత క్రీడా చిహ్నాలు. నాయిక స్తనద్వయంపై అలదిన జవ్వాజి నాయకుని ఉరోభాగంలో ఉంది ! ఇది పురుష వర్ణన. పైని వర్ణించిన "మగువ తన కేళికామందిరము వెడలెన్" అన్న పదంలో స్త్రీ వర్ణన. "నిద్దురమబ్బు, నిండు బడలిక" — ఈ రెండు పదాల్లోను, అందు స్త్రీ పరంగాను, ఇందు పురుష పరంగాను వర్ణించాడు క్షేత్రయ్య. అందు స్త్రీ గనుక 'కుచములపై విదియచందురులు,' ఇందు పురుషుడు గనుక 'నిద్దంపు చెక్కిళ్ళపై నెలవంకలు' వర్ణితం. ఇట్లు స్త్రీ పుంస సహజమైన రీతిని వర్ణన కొనసాగింది. ఇది మహాకవితా శిల్పి అయిన క్షేత్రయ్యకే సాధ్యం. ఇందులోని చమత్కారయుత రచన, వ్యంగ్యం, ఆడంబరంలేని శబ్ద సముచ్చయం, నిసర్గ మనోజ్ఞమైన భావాలు- క్షేత్రయ్య ప్రతిభకు ప్రతీకలు. ఇంత మనోజ్ఞమైన భావనా బలంతోకూడిన పదరచనకు కారణం క్షేత్రయ్య నాయిక; ఆ నాయిక నాయకుని వర్ణించడం. ఇది ఆతని మధురభక్తిలోని రహస్యం.ఇలాంటి క్షేత్రయ్య సాహిత్యం అజరామరం ; అతని ప్రతిభ నవ నవోన్మేష శాలిని. కేవలం అంగాంగ వర్ణనచేసే ప్రబంధకవుల కంటె క్షేత్రయ్య గొప్పదనం దీనివల్ల స్పష్టమవుతుంది,

## 3.5.2 వర్ణనా వైదగ్ధ్యం :

ప్రబంధాల్లో వర్ణనా వైదగ్ధ్యానికే ఎక్కువ ప్రా... సందర్భానుసారంగా వర్ణనలుచేసి కావ్యానికి ... అందులో పరమావశ్యకమైనగుణం. పదకవితలో... కోకొల్లలు. నాయకుని వర్ణన :

"పల్లవి : ఎంత చక్కనివాడే! నా సామివీ - డెంత ...

అ. ప. : ఇంతి మువ్వగోపాలుడు - సంతతము నా ...
సంతోషముచేసే ...

మొలక నవ్వులవాడె - ముద్దు మాటల వాడే
తళుకారు చెక్కు - టద్దముల వాడే
తలిరాకు జిగిదెగడ - దగుమోము గలవాడే
తెలి తమ్మిరేకు క - న్నుల నమరు వాడే
చిరుత ప్రాయము వాడె - చెలువొందు ...
దురు సేరు నొసలచే - మెరయు వాడే
చెరుకు విల్తునిగన్న - దొరవలె నున్నాడే
మెరుగు చామన చాయ - మేనమరువాడే
పాదలు కెందామరల పెం - పొదవు ... వాడే
కొదమ సింగపు నడుము - కొమరమరు వాడే
మదకరి కరముల - మరు చేతుల వాడే
సుదతి ! మువ్వ గోపాలు డెంత - ... వాడే!

[సీ. గి. వేం. — స్వీ. 161]

ఏ ప్రబంధ కవులకు తీసిపోని వ్యక్తి వర్ణన ... ప్రబంధంలోని అంగాంగ వర్ణనేకాక ఆయా ...

వర్ణించడం క్షేత్రయ్యలోని వైశిష్ట్యం. ఇందులో చేమకూర వేంకట కవిని, తాళ్ళపాక తిమ్మక్కను అనుకరించాడు క్షేత్రయ్య అన్న విషయం పూర్వోక్తం.[46] పురుష వర్ణనకు మరో ఉదాహరణ :

"గీరు నామముపెట్టి — గిలుకు పావాలు మెట్టి
... ... ... ... ... ... ... ... ...
పిల్లగ్రోవి చేతబట్టి - బిగియుదట్టియు గట్టి
వల్లెవాటు వేసి ... ... ... ... ... ...
చిటికెన గోనగోరు - చిమ్ముకొంచు పలుమారు
చిటిపాటి పదములు - చేరి పాడుచు ! ..."

[సీ. గి. వేం. — సం. 62]

క్షేత్రయ్య ఆత్మీయ స్వరూపమని తలంచి విస్సా అప్పారావుగారు వర్ణచిత్రం గీయించారు.[47]

స్త్రీ వర్ణనలు క్షేత్రయ్య పదాలలో అధికం. "మగువ తన కేళికామందిరము వెడలెన్" — అన్నది చాల చక్కటి వర్ణన; పూర్వోక్తం. ఒక దూతిక-నాయిక పంపగా నాయకుని తేరబోయి, తానే నాయకునితో రమించి రాగా ఆ చిహ్నాలను నాయిక ఇలా వర్ణించి వాపోతూంది.

"చిక్కువడిన హారములు - చెదరిన ముంగురులు
కక్కసమై నీ మోవిచాల - గంటియున్న దిపుడు
పుక్కిట విడెమున - బుగులుకొను వాసనలు
నిక్కు చనుదోయిపై - నెలవంక గురుతులు

46. ఈ పరిశోధనా వ్యాసం—మొదటి ప్రకరణం.
47, 7 అ, వి. – ఆరంభంలో.

వీడిన క్రొమ్ముడి — వింత వింత యూర్పులు
వాడబారిన విరులు - వైఖరియును
నీడదేరు చెక్కులపై - నెక్కొను గురుతులు
కూడి అలసిన చెమ్మట - కొంగు తడిసి యున్నది.
సరసుడౌ మువ్వగో - పాలు డిందు వచ్చి
సరస రతుల గూడి - చౌక మీరినది
మరిగి దానింటనే - మరి రాక యున్నాడు
అరనిమిషాన తోడి తెమ్మ - న్నందు కింతాయె."
[సీ. గి. వేం. స్వీ - ౮౯].

ఇలాంటి వర్ణన లెన్నైనా చూపించవచ్చు. ప్రబంధాల్లో నాయికా విరహం నానావిధాలుగా అభివర్ణించడం సామాన్యమే. అలాంటి విందులో కోకొల్లలు. విరహోత్కంఠిత అయిన నాయిక :

"పల్లవి : ఏల వలచితి నోయమ్మా ! ఎట్లా వేగింతునే ? కొమ్మా !

అ. ప. : ఈలా గౌట ఎరుగనైతి - యెదుగిరి చెలువరాయనిపై
॥ ఏల ॥

ఉన్నచోట నుండనీదు - ఒరగుపై నన్నొరగ నీదు
అన్నాహారము లేదు - ఆనబాలు తేనె చేదు ॥ ఏల ॥
చలువలైతే సైచవాయె - జాజులెంతో మొనలాయె
నిలుపరాని మోహమాయె - నిట్టూర్పులగ్గలమాయె
॥ ఏల ॥

తలపు వానిమీదనాయె - తలవాకిలె ఇల్లాయె
పలుమారు గదసిన మువ్వగో - పాలుడౌ చెలువరాయనిపై.
[సీ. గి. వేం. - ప. ౩౩]. ॥ ఏల ॥

అని విరహబాధను వ్యక్తం చేస్తూంది. విరహోత్కంఠిత అయిన నాయికకు శైత్యోపచారాలు [సీ. గి. వేం. - స్వీ. 67] ఉన్నాయి; చల్లని వెన్నెల, మలయ మారుతం [సీ. గి. వేం. - ప. 11] వేడి కావడం ఉంది; విప్రలబ్ధ అయిన నాయిక విరహాగ్ని క్రుంగడం [సీ. గి. వేం.-స్వీ. 62] మనోజ్ఞంగా చిత్రించబడింది; చిలుకల పలుకులు, తుమ్మెద రొదలు సహింపరానివి కావడం, [సీ. గి. వేం. - స్వీ. 86] కుండ కలదు; అన్నం హితవు కాకపోవడం, నిద్దురబట్టకపోవడం [సీ. గి. వేం. - స్వీ. 144] సైతం ఉంది. ఇలాగ నాయికా విరహం వర్ణితం.

నాయకుని విరహంగూడ - చాలతక్కువే అయినా - ఎంతో ఉదాత్తంగా వర్ణించాడు క్షేత్రయ్య—

"పల్లవి : ఇంతిరో ! వరదునికి నీపై - నెంత మోహమే ?

అ. ప. : సంతతం బతని వెతజూడ—జాలక యిందు వచ్చితిని ॥ఇంతి॥

చెక్కిట చే చేర్చుకొనెను - చిరునవ్వు నవ్వుకొనెను
అక్కట నే దలచినట్టై - ఐరాదనెను.
మక్కువ మును జేసిన చెలిమి - మరపురాదాయెననెను
చక్కని యా చెలినికూడని - జన్మమేటికి జన్మమనెను.

॥ ఇంతి ॥

పడతి ! ఉండుండి నేనేమి - పాపము చేసితి ? ననెను
తడవు నిన్నెడబాసి - తాళలే ననెను
నుడువ నోరాడ దనెను - నొసట చేయుంచుకొనెను
అడిగితె మీరేమైన-నార్చేరో ? తీర్చేరో ? యనెను ॥ఇంతి॥

పలువరించుచు మా మువ్వగో - పాలుడైన వరదుడు
నళినాక్షి ! యానాటి వింత - నడచునో ? యనెను
తలచి యసు రుసురు మనెను - దైవమిట్లు చేసె ననెను
వలపనే పాపము పగ - వారికైన గారాదనెను ॥ఇంతి॥"

[సీ. గి. వేం. - ప. 8] నాయకుడు పొందిన విరహం ప్రబంధాల్లోని వర్ణనకంటే ఉదాత్తమూ, మనోజ్ఞమూను. ఇది రామరాజభూషణుని "ఉసురనుఁ గన్నుమోడ్చు" [వసుచరిత్ర - ఆశ్వా. 4 - ప. 81] అన్న పద్యాన్ని తలపింపజేస్తూంది. ఇక్కడే "రామ రామ ! ..." [సీ. గి. వేం. - ప. 76] పురుష విరహావర్ణనకు చక్కటి ఉదాహరణ. ఇలాగా క్షేత్రయ్య తన పదకవితలో ప్రబంధోచిత వర్ణనలు చేసి తన ప్రతిభను ప్రకటించిన పదకవితా చక్రవర్తి !

## 3.5.3 దృశ్యసాక్షాత్కారం :

క్షేత్రయ్య పదాలు చాలవరకు సహజమై మన కన్నులకు గట్టినట్లుండే దృశ్యాలేగాని వేరుగాదు. చదివిన వెనుక మరల మరల చదివించే మహత్తుంది ఈ పదాల్లో. పై నుదాహరించిన పదాల్లో కన్నులకు గట్టినట్లుండే దృశ్యసాక్షాత్కారం మనకవగతమైంది. అక్కడే ప్రతి చరణమూ ఒక్కొక్క మనోజ్ఞ దృశ్యంగా మనకన్నుల ఎదుట సాక్షాత్కరిస్తుంది. అదే క్షేత్రయ్యలోని భావనా బలం! దానికి చక్కటి భాష తోడైంది! తన్మూలంగా ఆయా దృశ్యాలు మనకు ప్రత్యక్షమై మరపురాని చెరగనిముద్ర హృదయ ఫలకంపై వేయ గలుగుతున్నాయి.

"పల్లవి : అయ్యయ్యో వెగటాయె - నా ? నా సామికి

అ. ప. : పయ్యెదమీద చేరి-పవ్వళించి యుండే సామికి ॥అయ్యయ్యో॥

వెలది ! నా మోము రెప్ప - వేయక కనుగొని
కలియ నిండు సంజ చీ - కటి గ్రమ్మితే
కలికి నీ ముద్దు మోము - కానరాక యున్నదని
తెలిసి ప్రొద్దుండగానే - దీపము తెమ్మనే సామికి
॥ అయ్యయ్యో ॥

ననబోణి ! వినవమ్మ ! - నాపై చాలా ప్రేమచే
తన దంతమున నా య - ధరము నొక్కి
మొనసి మాటాడిన - మోవి విడువవలెనని
అనువుగ చేసైగ - లాడుచు నుండే సామికి ॥అయ్యయో॥
మదిరాక్షి ! వినుమమ్మా ! - మా మువ్వగోపాలుడు
నిదురించితే కౌగిలి - వదలీనని
పదరి శయ్య మీద దు - ప్పటి కొంగులు నాలుగు
ముదముతో గట్టిగా - ముడికొనుమను సామికి
॥ అయ్యయో ॥

[సీ. గి. వేం. - స్వీ. 38] ఈ పదంలోని ప్రతి చరణం ఒకొక్క మనోజ్ఞ వర్ణచిత్రం. ఆయా దృశ్యాలు మన కన్నులకు గట్టినట్లయి అనుభవైక వేద్యం అవుతాయి. విరహోత్కంఠిత అయిన నాయికను సఖి ఉపాలంభిస్తూంది —

"విద్దెలు చదువక - పెంచిన చిలుకకు
సుద్దులు దెలుపక - సుదతిరో ! నీవు
అద్దమ రాతిరి - యసు రుసు రనుకొంట
ముద్దు మోము వాడ - నిద్దుర లేకున్నావు"
"కోడె గుబ్బల పైని - కొంగు బచరింపక
తోడివారి జాతుల - తో మాటలాడక
ఆడికలకు లోనై - యలమట నొందుచు
చేడియ ! యేల చెక్కిట - చేయి చేర్చుకొన్నావు." —

నాయికకు నిద్దుర లేకున్నది; చెక్కిట చేయి చేర్చుకొన్నది. ఈ దృశ్యాలు మన కన్నులకు గట్టినట్లున్నాయి. ఇట్లే "చల్లనాయె

లేరా !" [సీ. గి. వేం. - స్వీ. 103], "కోడి కూసె నమ్మ్ర చెలియా - నా గుండె ఝల్లుమనెనే" [సీ. గి. వేం. - వ. 313], "ఇదు గరమ్మా! యాతనిపై నూరక - అలిగినా నటనే" [సీ. గి. వేం. - స్వీ. 4], "ఎవతె తాళునమ్మ ! యీ నడత - లేమఁడునే కొమ్మా!" [సీ. గి. వేం. - స్వీ - 6]. ఈ పదాల్లో నైతః ప్రతి చరణం ఒక మనోహరమైన సన్నివేశం ; మధురమైన వర్ణనలు ! దృశ్యసాక్షాత్కారం చేయగల సామర్థ్యం వీటికుంది.

## 3. 5 .4. భావచిత్రాలు [Imageries] :

పైని వివరించినట్లు క్షేత్రయ్య పదాల్లో చక్కటి వర్ణనలు, సంపూర్ణ దృశ్యాలు ఉన్నాయి. ఆయా పదాల్లోని చరణాలు మనోజ్ఞమైన దృశ్యాలుగా దృగ్గోచరమవుతాయి. అంతేగాక కేవలం కొన్ని శబ్దాల సముదాయంతో ముచ్చటైన ముద్దులొలుకు భావ చిత్రాలు [Imageries] మన నేత్రాలలో తళుక్కున మెరిసి, మనో నేత్రాల్లో బొమ్మకట్టి మనల్ని ఆశ్చర్యంలో ముంచివేస్తాయి. వీటి వల్ల క్షేత్రయ్య ప్రతిభా, భావుకతలతోపాటు భాషమీది అసామాన్య మైన అధికారం స్పష్టమవుతుంది. దానితో మహాసాహిత్య స్రష్ట క్షేత్రయ్య అని అవగతమవుతుంది. ఇందుకు చక్కటి ఉదాహరణ : "విడిచిపోలేక నడ-వడిగొన్న సరులతో" [సీ. గి. వేం.-వ. 100] అన్నపదంలోనిసర్గమనోజ్ఞ ప్రియంభావుక భావనైకవేద్య చిత్రా లున్నాయి. వీటిలో "విడిచిపోలేక నడవడిగొన్న సరులతో [illegible] గొన్న చనుగవ; జీరుకొప్పునను సడలియాడెడు విరులచేరు; [illegible] పై నిడిన కస్తూరి చెమటచే కన్నుల మీదికి జారడం; ముంగురులు చెదరి కనుబొమలను సొంపు గులుకించడం; అదే ఎడనెడ [illegible] పొదలడం; ఎడలేని పిరుదుల భారంతో తడబాటు పడు [illegible] నడక; కూటముల ఎడబాటుపైట కడుతొడల [illegible].

అన్న భావచిత్రాలు క్షేత్రయ్య వంటి మహాపురుషునకే ఊహించశక్యం. ఇది మహాశిల్పలక్షణం. ఒక్కనాయిక నాయకుని ఒంటిమీద "గంధము చాటున ఘనమైన జడవేటు" వల్ల "కందియున్న సొగసు" [సీ. గి. వేం. - స్వీ. 90] ను కనుగొన్నదట?. ఈ భావచిత్రమెంత ప్రతిభావంతుని భావనాబలానికి నిదర్శనమవుతుందో సహృదయ హృదయులు గ్రహించగలరు. ఇంకొక నాయిక "హెచ్చైన వెన్నెల చిమ్ముల రాత్రులు" [సీ. గి. వేం—స్వీ. 7] గడపిందట. మరోనాయిక వద్దకు "మోవిపై కాటుక నిగ్గులతోను; నుదుటిలత్తుకతోను; గళముపై పీడెంపు రసముతోను" [సీ. గి. వేం. - స్వీ. 128] నాయకుడు వచ్చాడట. ఇవన్నీ చక్కటి భావచిత్రాలు. వీటిని భావించిన కొలదీ అనంత ముఖాలభావాలు ఉత్పత్తిల్లి ఆనందకందమవుతాయనడంలో సందేహంలేదు. పై పదచిత్రాలన్నిట ధ్వని మస్తుగా ఉంది. వ్యంగ్య ధోరణికివి చక్కటి ఉదాహరణలు.

### 3.5.5 పాత్రచిత్రణ [మానవమనఃప్రవృత్తుల చిత్రీకరణ]:

ప్రతిభా సంపన్నుడైనకవి కవితలో పాత్రచిత్రణ తనంతకుతానే సర్వోత్కృష్టంగా కుదురుతుంది. అది ఆ కవికవితా శిల్పంలో ఒక భాగం. అలాంటికవి క్షేత్రయ్య. ఈతని పదాలు ముక్తకాలు. దేనికదే మహాకావ్యం; రసభావాలతో పరిపుష్టమైంది. ఈ పదాల్లో మనకు కనిపించే పాత్రలు ముఖ్యంగా మూడు; దూతీనాయికా నాయకులు, దూతులు చాలమంది లేరు. నాయకులసంఖ్య తక్కువ. నాయికలనేకలు. ఆయా సందర్భానుగుణంగా మానవమనఃప్రవృత్తుల్ని వ్యక్తంచేయడంలో క్షేత్రయ్య సాటిలేని మేటిగా ప్రత్యక్షమవుతాడు. క్షేత్రయ్య మానవస్వభావవేత్త అని స్పష్టమవుతుంది. "శృంగారరసము తప్ప తక్కినయే రసమునకును ఇందు ప్రవేశము లేకున్నను ఇందలి పాత్రముల అనుభవములు అనంతములు, అకృత్రిమములు, సూక్ష్మ

ములు, తీవ్రములు, తేజోవంతములు. శృంగారమునందుగూడ క్షేత్రయ్య ప్రతిభా బలము, పదను స్త్రీస్వభావ నిర్వహణమున నవ నవోన్మేషశాలిగా ఉన్నది."48 చాలా వరకు పురుషులు మన కన్నులఎదుట కనిపించరు. వారినాడించే వాళ్లు స్త్రీలు. అందుకే నాయకా కథనంగలపదాలు ఇందులో చాలా తక్కువ. నాయకుడు నాయికను తలంచి తనవిరహాన్ని వ్యక్తం చేయడం.—

"పల్లవి : వలచినవాడనే నీమీద చాల

అ. ప. కులుకులాడి! మువ్వ - గోపాలుడనే నాడు ॥వలచిన॥

నినుబాసి కంటికి నిద్దురరాదు -

నిమిషమైన గాని ప్రొద్దుపోదు

ఎనసిన మరుబారికోర్వగ రాదు -

ఇక నా తమి నిలుపవశముగాదు ॥వలచిన॥

బాళినెంతో తరుణి యీవేళ-తాళలేనునాపై దయజూపిన-మేలే!

చాలనన్ను కరుణించి విలీల-నేలుకొమ్మంటె-నీ జాగులేల ॥వలచిన॥

ఏ పట్లదయలేక యిటువలెనీవు-పాపజాతి మరుని పాలుచేసేవు

కోపగించి నెనరుకొనరినరావు-కొమ్మ! మువ్వ-గోపాలుడని

కౌగిలీవు ॥వలచిన॥" [సీ. సి. వేం.-క్షే. 14[illegible]]

ఇట్లే "నిన్ను మరతునే? ఓ చెలియా!" [సీ. సి. వేం.-క్షే. 51]; "మఱచితివా నన్ను? మగువా!" [సీ. సి. వేం.-క్షే. 76]: అని నాయకుడు వాపోయినవి కలవు. ఇందులో నాయకుని స్వభావం సుస్పష్టం. ఇలాగా నాయకుడు తానై తన మనవెళ్లబోసుకోవడం తక్కువ. కానీ దూతి తెలిపిన నాయకుని విరహావస్థ [illegible]

48. అ. కృ. శ. రా. – ఆం. ప. – [1942–4[illegible]] – పు. 17.

[సీ. గి. వేం. - స్వీ. 145] ఇట్లు దూతి [illegible] నాయికను ఉపాలంభిస్తుంది. ఇవ్వే "[illegible]" "[illegible] మొక్కరికైనావద్దా?;" "నన్నేవా? - నన్నేవా!" [సీ. గి. వేం. - స్వీ. 39,114; ప. 47] మొదలైన విందు కుదాహరణలు. [illegible] దూతి బహుచతురగానూ, మాటకారిగానూ, నాయికను [illegible] మందలించగలదిగాను మనకు కనిపిస్తుంది.

ఇంతకంటే వివిధ విధాలైన నాయికా స్వభావాల్ని చిత్రించ డంలో క్షేత్రయ్య అనన్యసామాన్యమైన మేధా, మానవ [illegible] ప్రవృత్తుల విజ్ఞతా స్పష్టమవుతాయి. "తెలియని వస్తువు [illegible] కొనుటకే ప్రయత్నించిన ప్రతిభా స్వయంవరపతి క్షేత్రయ్య. [illegible] యెఱిఁగినంతలో స్త్రీ స్వభావము నందలి వైవిధ్యములను, [illegible] ములను ఇంత సుకుమారముగా, గంభీరముగా త్రిప్పి [illegible] వాఁడు లేఁడు. ఆ కాలపు స్త్రీలకు వలపు, మోహము, [illegible], త్యాగము, క్షమ, ఆశ, నిరాశ, ఆడంబరము, అహంకారము, అసూయ, కోపము, దైన్యము, ఆనందము, తృప్తి, ఆత్మాభిమానము, మౌగ్ధ్యము, ప్రౌఢి - ఇత్యాదులన్నిటిని నిష్కపటు సుకుమార చిత్రము లందు చూడవచ్చును. స్త్రీలలో స్వీయ, పరకీయ, సామాన్య, కన్యా జాతులు నాల్గును సమానమగు ప్రీతి గౌరవములతో [illegible] బడినవి. ఆఁడది ఎట్టిదైనను, దాని అవస్థ ఎట్టిదైనను అసహ్యముతో గాని, అగౌరవముతోఁగాని ఇతఁడెప్పుడును చూడలేదు. [illegible] మీఁద ఈతని సాహిత్యమంతయు ఆ కాలపు [illegible] ఆధ్యాత్మిక కథ అనవచ్చును".[49] పైని పేర్కొనబడిన [illegible], స్త్రీ స్వభావాలకు చక్కటి ఉదాహరణలు క్షేత్రయ్య [illegible] ఉన్నాయి. నాయిక స్వీయ, పరకీయ, సామాన్య అని [illegible]

49. పైదే — పు. 18 19.

విధాలు. ఈ నాయికలలో మరలా అవాంతర భేదాలు అనేకం. ఆ భేదాలకంటే ఆయా స్వభావాల వివరణమే ప్రస్తుత విషయం. పచ్చిశృంగారం పరవళ్ళు తొక్కుతుండనీ, నాయికలు బాలా గడుసు గత్తెలనీ ఆరుద్రగారు చెప్పారు.[50] అలాంటి నాయికలను చూసి క్షేత్రయ్య ప్రశ్నవేసుకొన్నాడని వారు "చూడరె! అట నడచె వాలాయలు - సుదతి చేయజాడలు" (సీ. గి. వేం. - ప. 17) అన్న పదం ఉదాహరించారు. కానీ ఇలాంటి అనుదాత్త స్వభావస్త్రీలున్నారని - అని మనం అనుకొంటే - అవి చాలతక్కువనే చెప్పాలి. ప్రేమ పెచ్చు లోకసహజ విషయంకంటే మధురభక్తి పరవశుడైన క్షేత్రయ్య కిందులో దోషంలేదు; కారణం తాను భగవంతునికి సర్వార్పణ గావించుకొన్నాడు గనుక. అది భగవత్పరమైనప్పుడు దోషంలేదని తలంచవలసి ఉంది.[51] స్వీయ నాయికలేగాక పరకీయ, సామాన్య నాయికలగూర్చి చెప్పినా ఉదాత్తంగా వివిధ దృక్కోణాల నుంచి స్త్రీ స్వభావాన్ని వివరించడం క్షేత్రయ్య పదాల్లో మనం చూడవచ్చు. ఉదాత్తత కి క్రింది పదం చాలు. నాయిక స్వీయ, విరహోత్కంఠిత; మొదటి పొందు తియ్యందనాన్ని గుర్తించి ఆ నాయిక అదే చాలునని సంతృప్తిని వ్యక్తంచేస్తుంది.

"పల్లవి : వదరక పో పోవే - వాడేల వచ్చీని - వద్దు రానద్దనవే

అ. ప. : అది యొక యుగము వేరే జన్మమిపుడు -

అతడెవరో నే నెవరో ఓ చెలి యరో ! ॥ వదరక ॥

నిచ్చ నిచ్చలు నేడె వచ్చేనిరే పైన - వచ్చే ననుచు మటలో

నిచ్చగా బలువేడి నిట్టూర్పులచేత - నిండిరో పెదవు లెండె

---

50. ఆ-సం. 11, పు. 99, 100.

51. సీ. గి. వేం. - పు. XLIV

హెచ్చైన వెన్నెల రాత్రులు - యెన్నెన్ని గడపితి
నిక నేటి మాటలే ॥ వదరక ॥

వలపుకాడిదె కాదా వచ్చుననుచు చెలు - వలను జూచి వేసారితి
నెలలెంచి యలసితి-నిలుపరాని ప్రేమ-నెమ్మది నడచుకొంటి
కలకంఠ పికనాద - ములు మించు మధు మాస
ములు గడపితీవట్టి ముచ్చటలిక నేటే ॥ వదరక ॥

భామరో! శకునము లడిగితి ముహ్వగో-పాలుడు వచ్చుననుచు
కామించి నాథుల గలయు చెలుల జూచి — కడు చింత
కొంటిని
రామ ! రామ ! ఈ మేనితో నిక వాని-మోముజూడకనే
మొదటి పొందే చాలు ॥ వదరక ॥" (సీ.గి.వేం.—స్వీ.7)

ఇట్లే "ఏమని తెలుపుదు నేలాగు తాళుదు" [సీ. గి. వేం.-స్వీ. 55]. నని ప్రోషితపతిక ఎంతో మృదువుగా తన విరహాన్ని వ్యక్తం చేసింది. ఇలాంటివి ఎన్నైనా ఉదాహరించవచ్చు. "ఇటువంటి వాడవని - ఇప్పుడు తెలిసెనురా" [సీ. గి. వేం. - స్వీ. 55] అన్న పదంలో "చెలిమి చేసేదందు చలముచేసే దిందు" అంటూ నాయకుడు ప్రవర్తించిన విధం నాయిక ప్రకటిస్తుంది. ఇందులో అక్కడ, ఇక్కడలకు గల ప్రతియోగం (Contrast) చక్కగా ప్రదర్శించాడు కవి. మరో నాయిక, నాయికా నాయకులకు గల ఒద్దికలను "ఇద్దరివలెనే కాని ఎవరున్నారు? తెల్పరా!" [సీ. గి. వేం. - స్వీ. 56] అంటూ నల దమయంతులను, రుక్మిణీ కృష్ణులను, సీతారాములను, రంగనాయకీ రంగేశులను, చంద్రమతీ హరిశ్చంద్రులను ఉదాహరించి చివరికి "నిత్యమదనుడు నీవే నీకు రతిదేవి నేనే" — అని అపరిమితానందాన్ని ప్రకటిస్తుంది. ఇట్లే "ఏమిర వరద! నీ - మోము చిన్నబోయినది." [సీ. గి. వేం. - ప. 27] అన్న పదంలో వాక్ప్రక్రియావిదగ్ధ, "ఏలరా ?

చలమేలరా ?" [సీ. గి. పేం. - ప. 32] "మందని రూపుని నిందించి జోషించిరమ్మా" [సీ. గి. పేం. - ప. 38]- అన్న పదాల్లో ప్రసిద్ధ చతుర; "తరుణిరో ! పుణ్యపాపములు - తనవేనటే" [సీ. గి. పేం. - ప. 39] పదంలో విరహోత్కంఠిత, "మనసు నిల్వదాయెనే, ప్రాణేశ" [సీ. గి. పేం - సా. 77] పదంలో తృప్త ... నాయికల మనోభావాల్ని అభివ్యక్తం చేయడం క్షేత్రయ్య నిశిత స్త్రీ స్వభావాల్ని గుర్తించాడనడానికి నిదర్శనం. ఇంక నాయకునితో కలిగిన పొలయలుక నుద్దేశించి నాయిక అంటున్న మాటలు ఈ క్రింది పదంలో ఎంత సహజ సుందరంగా ఉన్నాయో సహృదయుల హృదయాలే సాక్షి !

"పల్లవి : ఎందుకు వచ్చెనో కోప - మెవరేమన్నారు ?

అ. ప : అందుకిందుకు సరి - యాయెరా ! మువ్వగోపాలా !

॥ ఎందుకు ॥

ఎన్నడైన నవ్వుకోమో ? - యెదురు మాటాడుకోమో ?
మొన్న రాత్రిరలిగి - ముచ్చటలాడుకోమో ?
చిన్న ముద్దు వచ్చెనని - చెక్కిలి నొక్కినందుకు
నన్ను నీవొకటంటె - నిన్ను నేనొకటంటి ॥ ఎందుకు ॥

ప్రేమ రెట్టించుకోమో ? - బిగి కౌగిళ్ళనుండమో ?
ఏమైన ననుకోమో? - ఎచ్చుకొద్దులాడుకోమో ?
ఆమాటకామాట - కప్పుడే నే జాణనంటి
నామాట నీవు కాదంటే - నీ మాట నేను కాదంటి

॥ ఎందుకు ॥

అతనుని కేళి గూడి - యందమాయెననుకోనమో ?
మితములేనట్టి తమి - మేలనుకోమో ?

హితవై మువ్వ గోపాలా ! - ఇంచుకనే నలిగితే
అతికమలిగితి - వప్పుడే కూడి యిప్పుడు ॥ ఎందుకు ॥"

[సీ. గి. వేం—స్వీ. 73] ఇందులో ఆ నాయికాస్వభావం మనకు స్పష్టమవుతుంది. ఇది సార్వకాలికమూ, నిసర్గమనోజ్ఞమూను. "క్షేత్రయ్య నాయికలు నెరజాణలు, ప్రియుని చిత్తమెరిగిన సార సంగ్రాహిణులు, సరసజ్ఞురాండ్రు. వారు ఆటపాటలయందే కాక మరి యన్నిట నెరజాణలు."[52] క్షేత్రయ్య పదాల్లో రకరకాలైన స్త్రీల స్వభావాలు మనకు దృగ్గోచరమవుతాయి. నాయకునికంటే నాయికా స్వభావాల్ని ఎన్నో విధాలా క్షేత్రయ్య ప్రకటించాడన్న సంగతి మనకు తెలిసింది. దీనికి కారణం రాళ్ళపల్లి వారు ఇలా సెలవిచ్చారు. "స్త్రీ పుం వ్యక్తులితని చేతిలో ఇంత వ్యత్యాసముగా చిత్రింపబడుటకు ఇతడే ఒక ప్రధాన కారణము ఒకచోట సూచించియున్నాడు. ఒక ఖండిత మువ్వ గోపాలునిట్లన్నది :

'పల్లవి : నను నీవు తలచేది న్యాయముగాదు

అ. ప : నిను నేను వలచేది నీతిగాదు మువ్వగోపాల !'

మగవానిది - ఆకాలమున - తలఁపు ; ఆఁడదానిది వలపు ! తలపు తాత్కాలికము ; వ్యాధివంటిది. ఏ వైద్యునిమందైనను నివర్తించును. వలపు గలిగిన యొక్కతె తలఁపుకొలందిఁ బోయిన మువ్వ గోపాలుని నడత నిట్లు సరిపుచ్చుకొనుచున్నది. 'పరదేశమున జేసిన-పనులిందు చెప్పరాకురే !' ..."[53] "ఇతని పాత్రములు మెఱుపుతో తయారైనవి ; మఱవరానివి ; భావనా ప్రపంచమందలి ప్రతి

---

52. రా. రా. దే. – పు. 82.

53. అ. కృ. శ. రా. – ఆం. ప. (1942–43) పు. 18.

వారిని వేధించి నిలుచును."[54] ఇట్లు క్షేత్రయ్య స్త్రీ పుం వ్యక్తుల స్వభావాదులను స్పష్టంగా ప్రదర్శించి తన ప్రతిభా సంపన్నతను ప్రకటించుకొన్నాడు.

## 3.5.6 కృతి చమత్కృతి :

కల్పనా నైపుణ్యమూ, చమత్కారమూ మధుర మంజుల కవిత్వానికి తోడైతే మరింత శోభాయమానంగా ఉండి, సహృదయు లను ఆకట్టుకోగలుగుతుంది ; పరవశింపజేస్తుంది. క్షేత్రయ్య కవితలో ప్రతిపదంలో ఏదో కొత్తదనం, ఏదో చమత్కృతి లేకుండా ఉండదనే చెప్పాలి. చేమకూర వేంకటకవి చెప్పినట్లు

> "తారసపుష్టి మై బ్రతి పదంబున జాతియు వార్తయున్ జమ
> త్కారము నర్థ గౌరవముఁ గల్గుననేక కృతుల్ ప్రసన్న గం
> భీర గతిన్ రచించి మహిమించిన ... " [విజయవిలాసం -

ఆశ్వా - 1, ప. 31] రాజకవి రఘునాథుడు. ఆతని ఆస్థానం ప్రవే శించిన క్షేత్రయ్యలో సైతం జాతివార్తా చమత్కారాలుండడం సమంజసమే కదా ? దూతిక నాయికా విరహాన్ని నాయకునితో చెప్పి చమత్కరిస్తూంది.

"పల్లవి : ఏతీరున రమణిని గెలిచి నీ - వెట్లు రూపొందుదువో

అ. ప : చూతాము రారా ! మదన నీ - చేతిబలిమి మా చెలియందు
బలిమి ॥ ఏతీరున ॥

రాతిరనే యేనుగ నెక్కి - రాకా చంద్రుడు గొడుగు గాను
లేత తెమ్మెర మొదలైన బలముల - చేత గెలిచెదనంటివి గాని

---

54. పై దే.- పు. 12, 13.

పోతుటేనుగు కుంభములే - పోలతి గుబ్బలు ; మోము
చంద్రుడు
నాతి ప్రాణములె చలువతెమ్మెర - జాతివారిలో పగలు
గలవా ॥ ఏతీరున ॥

జంట విరిదమ్మిరెయెద - నంట గ్రుమ్మెదనంటివా ?
దంటవే చెలికేలు దమ్మి - తమ్మియొక్కటి సుమ్మీ !
తుంట విల్లొక్కటి నీది - తునియని విండ్లు చెలియ
కనుబొమలు
ఇంటగెలిచి రచ్చగెలువవలెనను - ఎన్నికలేక పూనితివి
॥ ఏతీరున ॥

అంచలు మూచెలిని జూచి - యడుగుబెట్టవెంచిచూడ
పంచవన్నెల చిలుక - పలుకులే చాన పలుకులు
పంచ బాణములు నీదు - పడతి చూపులే తూపులనగ
ఎంచ శక్యము గాదా మీద - నేలుకొన్నాడు మువ్వ
గోపాలుడు ॥ ఏతీరున ॥ "

[ సీ. గి. వేం - స్వీ. 82 ] ఇందులోని కల్పనానైపుణ్యం, చమత్కారం మనోజ్ఞం; రసజ్ఞ హృదయైకవేద్యం! ఇది ప్రబంధ వర్ణనలకు గానీ, చమత్కృతికిగాని తీసిపోదు. పైగా ప్రబంధ కవులు పద్యంలో సాధించినదాన్ని క్షేత్రయ్యపదంలో సాధించాడు; ఇదే ఆతని వైశిష్ట్యం. కార్యకారణ సంబంధాన్ని కవి సాధించాడు. పైపెచ్చు వేటివల్లనైతే నాయికను జయించదలచాడో అవే నాయికలో ఉన్నాయంటూ 'జాతివారిలో పగలుగలవా ?' అంటూ అర్థాంతరన్యాసాలంకారంలో ప్రశ్నిస్తూంది దూతిక. ఇట్లే తక్కిన చరణాలూను. ఎందరు ప్రబంధకవులు ఈ చమత్కారంలో నవ్యతను తీసుకరాగలిగారు ? భావనాబలం, దానికి తగిన భాషాప్రయోగం,

మన కన్నులకుగట్టినట్లు దాన్ని చిత్రించేనేర్పు, కల్పనాశక్తి, సొగస్సు, కృతిచమత్కృతి — మొదలైన మహాకవికి, మహాగాయకునికి — ఉండవలసిన లక్షణాలన్నీ క్షేత్రయ్యలో కొల్లలుగా కనిపిస్తాయి. ఒక నాయిక 'ఇటువంటివాడని' ముందే తెలియక —

"మరుకేళి నెనసిన - మందెమేలను చేత
తరళాక్షి! ముత్యాల - సరులు ధరించి
విరుల హారమని - విడునక యిచ్చట
మరపున వచ్చెనే - మగువ! మువ్వగోపాలుడు"

[సి. గి. వేం—స్తు. 64]

అని వాపోతుంది. చిటికెలో వస్తానని చెప్పి వేరొకతె ఇంటికివెళ్ళి దానినిగూడి త్వరలోనే రావాలన్న తహతహతో తాను ధరించిన 'విరులహారం' వదలిపెట్టి ఆ స్త్రీ ధరించే ముత్యాల సరులు ధరించి, వాటిని వదలక వచ్చాడట. ఇటువంటివాడని ముందు తెలియకపోతి నని బాధపడుతూంది నాయిక. ఇందులో హాస్యం స్మితం, చమత్కారంతోపాటు స్ఫురింపచేస్తున్నాడు, సున్నితంగా క్షేత్రయ్య.

ఈ క్రింది పదంలో నాయికానాయకుల పరిహాసాంతర్గతమైన మాటల్లోని చమత్కారం చాలా సరసంగా ఉంది.

"పల్లవి: మంచిదానవే చెలియ! మాటలకును

అ. ప: వంచనగల సఖియని - వార్త చెప్పబోవస్తి ॥మంచి॥

'చెలియ! నీ నెమ్మోము - చంద్రుడందురుగాని -
చంద్రుడైతే - చంద్రకళగావా?'
'సరసుడవు నీవు నేను - సరసములాడంగ -
కళవేళన కళవచ్చు చంద్రకళగానా?' ॥మంచి॥

'కమ్మని నీ ముంగురులు - తుమ్మెదలందురుగాని, ఏమే ?
తుమ్మెదలైతే ఎగురవా ?'

'కామాంధకారమున - గతులు రేయి పగలు -
తామసపు రతివేళ తానెగసి చూడున్' ॥ మంచి ॥

'సకియ నీ చన్గవలు - సంగటి కొండలందురు గాని
కొండలైతే కోట - తలుపులేవే?'

'ఇక నే నేమిసేయుదును ? మువ్వగోపాల !
ఇదిగో పాలిండ్లపై తర్కింప రవిక ముడి తలుపుగాద' ॥ మంచి ॥

[ సీ. గి. వేం. - ప. 63 ] ఇందులో నాయికా నాయకుల ఉక్తి ప్రత్యుక్తులతో కూడిన చమత్కారం ఎంతో సహృదయరంజకంగా ఉంది. ఇట్లే "ఏమి చోద్యమైన సురతమిందువదనరో" [ సీ. గి. వేం - ప. 20 ] అన్న పదంలో మనోజ్ఞమైన శబ్దార్థ చమత్కారమూ, "ప్రొద్దుపోదు నిదురరాదు" [ సీ. గి. వేం. - స్వీ 61 ] అన్న పదంలోను పదరచనా చమత్కారమూ ఉన్నాయి. "ఏమి సేయుదు మోహమెటువలె దీరు" [ సీ. గి. వేం. - స్వీ 168 ] నన్న పదంలో నాయకుడు, నాయిక ముఖారవిందం చిత్రించినా వాసనలుగూర్చలేకపోయాననీ, మోవిని చిత్రించినా తేనెలుంచలేకపోయాననీ, అట్లే కనులలో బెళుకుచూపులు, గళంలో కోకిల పలుకులు, నాగబంధంలో 'పిలుచు తెలివి' ని వ్రాయలేకపోయాననీ చింతిస్తున్నాడు. ఇవెంతో చమత్కారసహమై ఉన్నాయి. చిత్రంలో శక్యంగాని వాటిని తన కవితలో సాధించిన మహాకావ్య శిల్పి క్షేత్రయ్య అని నిరూపించుకొన్నాడు. ఇట్లే "పుట్టు భోగీంద్రుడలుకల కోర్వజాలడో - పాలతిరో ! బిరాన రావే" [ సీ. గి. వేం. ప. 60 ] "కొంచెకత్తెలా ? ఫీరో చెలియరో !", "చిత్తము

వేరైనందుకె - చింతచేసేను" [సీ. గి. వేం - స్వీ. 100, 101]
ఈ మొదలైన పదాల్లో క్షేత్రయ్య కవితా చమత్కృతి [illegible] ఉంది. దీనివల్ల పదపద్యకవితల్లో పదకవితే శ్రేష్ఠమని, [illegible] నిసడించ పనిలేదనీ, పద్యకవితలో సాధించలేనిదానిని ఈ పదకవితలో సాధించ వీలవుతుందనీ క్షేత్రయ్య ప్రకటించి పదకవితకు [illegible] ష్ట్యాన్ని చేకూర్చాడు.

## 3 . 5 . 7 సాభిప్రాయ పదప్రయోగ కౌశలం :

సాభిప్రాయపదప్రయోగకౌశలం క్షేత్రయ్యలోని విశిష్టగుణం. చాలావరకు క్షేత్రయ్యపదాల్లోని పల్లవులు సాభిప్రాయమైనవి, అర్థవంతమై, పదంలోని ప్రధానభావాన్ని వ్యక్తంచేయగలవై ఉంటాయి. వ్యర్థంగా ప్రయోగించిన పల్లవి ఒక్కటైనా లేదని చెప్పవచ్చు. సాభిప్రాయప్రయోగాలు ఇతని పదాలన్నింట కుప్పలు తెప్పలుగా ఉన్నాయి. విరహోత్కంఠిత అయిన నాయిక 'మొదటి [illegible] చాలు" [సీ. గి. వేం - స్వీ, 7] అంటుంది. ఇందులో [illegible] లోని అర్థమంతా ఇమిడి ఉంది. ఇది సాభిప్రాయప్రయోగం. [illegible] "అదియొక యుగము వేరేజన్మమిపుడు," "రామ రామ! ఈ మేనితో నిక వాని — మోము జూడవలెనా?" — అని అనడం పైపల్లవిలోని భావాల్ని ఉద్దీపింపజేయడమే కదా? తన ప్రియుని అతివలెందరో పట్టుకపోవాలని పందెమాడుకొన్నట్లు తెలిసిన [illegible] నాయిక "ఎందు దాచుకొందు నేను; ఏమిసేతు నిన్ను" అంటుంది. ఇంకా —

"ముదముతో నాముద్దు - మువ్వగోపాల సామి
గుదిగొన్న తమకమున - గూడి యుద్దరము
నిదుర పరవశమున - వదలునో కౌగిళ్లు
పదిలముగ నాజడను - బట్టి కట్టుకొందునా"

[సీ. గి. వేం—స్వీ. 9]

అంటుంది. ఇందులో "గుదిగొన్న తమకము, పదిలముగ నాజడను బట్టి కట్టుకొందునా" అన్నవి చాలా సాభిప్రాయంతో కూడిన ప్రయోగాలు. మరో నాయిక నాయకుని "జడకొద్ది కొట్టితినమ్మ" [ సీ. గి. వేం. - స్వీ. 8 ] అంటుంది. 'కోపశమనము లేక' పోయిందట. కారణం - "బంగారు మంచముపై నిద్దరము చాలా! మమతతో సరసంపుమాటలాడేవేళ కమలాక్షి పేర నన్ను మనుకు" పిలిచినందుకట! అంటే నాయకుడు గోత్రస్ఖలనం చేశాడట. దానితో కుపిత అయిన నాయిక 'జడకొద్ది' కొట్టినదట. ఇది ఇంత అర్థవంతమైన ప్రయోగం. "మగువ తన కేళీకామందిరము వెడలెన్", "విడివిపోలేక నడవడిగొన్న సరులతో" [సీ. గి. వేం - ప. 19, స్వీ. 44 ] అన్న పదాల్లోని ప్రతిపద సార్థక్యమూ, "చాలు! చాలు! ఈ చిన్నెలతో" [ సీ. గి. వేం. - సా. 49 ] పదంలోని సాభిప్రాయప్రయోగాల విశిష్టతా పూర్వోక్తం. ఇలాగే అర్థవంతమైన కొన్ని ప్రయోగాలు: "కత్తికోతగాడు మగడు", "ఏల వేగించేవే," "ఆడది, కులకాంత, అత్తింటి కోడలు, కొండంత కాపురమె, రానుపోను కోమలికందలమె" [ సీ. గి. వేం — ప. 13 15, 17 ] ఈ ప్రయోగాలు ఒకటినిమించి ఒకటి అర్థవంతమై, సాభిప్రాయమై, ఎంతో రమణీయమై, మహాకావ్యశిల్పిచేత చెక్కబడ్డట్టు ప్రయోగించబడ్డాయి. ఇంకా "మేమంత దొరలమా", "జవ్వనమెల్లను వాని పాలుచేసి", "తనకుగాని యీ మేను దావి యెవరికయ్యొ నమ్మా; నేనున్న యింటి పొరుగిల్లయిన లేదట; అరసి నేవచ్చిన దోవనైన రాడట; మరి నావలెనున్న ప్రతిమలనైన గనుగొనడట,", "దిక్కుమాలిన మోహము; వంటికొద్ది" [సీ. గి. వేం - సా. 24 ; స్వీ - 32 ; 44, 51 ] మొదలైన ఇలాంటి సాభిప్రాయ ప్రయోగాలు క్షేత్రయ్య పదాలన్నిట మనకు [illegible]

వాటి నెంతైనా వ్యాఖ్యానించవచ్చు; అపరిమితార్థాలు స్ఫురిస్తూ ఉంటాయి.

### 3.5.8 సున్నితభావప్రకటనాచణత్వం :

ఇట్లే సున్నితమైన భావాల్ని ప్రకటించడంలోనూ అందె వేసినచేయి క్షేత్రయ్య. దానివల్ల భాషమీద ఎంతటి అధికారం క్షేత్రయ్య కలిగి ఉన్నాడో, ఆయా భావాలకలాంటి భాష ఎలా ప్రయోగించాడో మనకవగతమై ఆతని వైశిష్ట్యం గోచరిస్తుంటుంది. విరహోత్కంఠిత అయిన ఒక నాయిక "తలపు వానిమీదనాయెను — తలవాకిలె ఇల్లాయె" [ సీ. గి. వేం - ప. 33 ] అని వాపోతుంటుంది. "తలవాకిలె ఇల్లాయె" అనడం ఎంత భావగర్భితమో, ఎంతటి మనోజ్ఞమైన భావనో భావుకుల భావనైకవేద్యం. ఇట్లే మరొక నాయిక "ఇంతలో నీవీడకు రాకుంటే కన్నీరు కావేరి కాలువసుమీ; వనజాక్షు! నీవీడకు వచ్చేదాక తలవాకిలె ఇల్లు సుమీ!" [ సీ. గి. వేం. – ప. 2 ] "కన్నీరు కావేరి కాలువసుమీ, తలవాకిలె ఇల్లు సుమీ" అనడం ఎంత సున్నితభావస్ఫోరకమో వ్యక్తమవుతుంది. "ఉల్లమలరగ తన యెదపైనను మల్లెపూవలె నుంచుకొన్న వల్లభుడు" [ సీ. గి. వేం. – ప. 18 ] రాడేయని వాపోతుంది ఇంకొక నాయిక. ఈ సున్నితభావాలవ్యక్తీకరణలో నవ్యత గోచరిస్తుంది. అలరువిల్తుడు "విరిశరము పూని కులుకు గుబ్బల నడుమ గురిజూచు చున్నాడే" [ సీ. గి. వేం – ప. 83 ] అని విరహబాధను తెలుపుతూంది వేరొక విరహోత్కంఠిత. "కొప్పునను సడలియున్నది విరులచేరు; నుదుటిపై నిడిన కస్తూరి చెమట జారుకన్నులను; ఎడలేని పిరుదుల తడబాటు నడుగులను; ఎడబాటు పైట కదు తొడల జీరెడు తీరు" [ సీ. గి. వేం – ప. 100 ] ఇవన్నీ ఎంతో సున్నితమై, నిసర్గమనోజ్ఞమై, సహృదయరంజకమై, నవ్యమై ఒప్పారుగు

ప్రయోగాలే గాని వేరుగాదు. ఈ మనోజ్ఞ భావాల మహత్వ మెరిగి ప్రదర్శించిన క్షేత్రయ్య భావనాపటిమ, భాషపై గల అధికారం అనన్యసామాన్యమూ, అనితరసాధ్యమూను. "అడుగడుగునకు నిన్ను కనుగొనవలెనని - వడిగా కన్నులు పారీరా ; కడువేడుకతో పలుకవలసి ముచ్చటైతిరా" [ సీ. గి. వేం - ప. 88 ]; "మోహము మీరగ కనురెప్పలచేత నా చనుమొనలప్పళించి."; "ఆట పాయము నాడె మక్కువ"; "నిద్దుర కనురెప్పలపై — నిండియున్న దేమోయి ; ఉరమున గుబ్బల పోటులున్న ముద్రలేడవోయి"; "కలువలరేనితో కలహము ముగియించి"; "మొగ్గముక్కైలపోట్ల గంట్లచే, అలరమణునిమేను - పులి పులియైనది ;" "ముఖచంద్రైమై తన కొక్క ముద్దు బెట్టుమని మూతి చాచునట"; "కన్నుల వీడెముతో ; కాటుక మోవితో ; నుదుటను నున్నలత్తుకతోను"; "తనుతానే మదిలోనే దయసేయవలెగాక ;" "చల్లని మనసు దానవై"; "గంధపుచాటున ఘనమైన జడనేటు కందియున్న సొగసు,"; [ సీ. గి. వేం - సా. 68, 69 ; స్వీ. 116 ; ప. 33, 60, సా - 3, 49, 76, 90 ; స్వీ. 109 ] ఇలాగా ఎన్నైన సున్నితమైన భావాల్ని ప్రకటించిన ప్రయోగాల్ని చూపించవచ్చు. వీటన్నిట ఏదో ఒక నవ్యత, ఏదో ఒక విశిష్టత, ఏదో ఒక రమ్యత, ఏదో ఒక సొగసు, ఏదో ఒక ప్రత్యేకత లేకుండ క్షేత్రయ్య ప్రయోగించడు. నిజంగా ఇలాంటి సున్నితభావప్రకటనాచణమైన క్షేత్రయ్య కవిత అజరామరం ; క్షేత్రయ్య కవిసత్తముడు. పైగా సంస్కృత సమాసభూయిష్ఠమైన రచనగానీ, శబ్దాడంబరంగానీ లేక చక్కటి తేటతెలుగుమాటలతో కూర్చ గలిగిన ఆంధ్రభాషా మర్మజ్ఞుడు క్షేత్రయ్య.

## 3 . 5 . 9 అల్పాక్షరాలతో అనల్పార్థ రచనాసామర్థ్యం :

సున్నితమైన భావాల్ని ప్రకటించగల నైపుణ్యంతోపాటు క్షేత్రయ్యలో అల్పాక్షరాలతో అనల్పార్థరచన చేయగల సామర్థ్యం సైతముంది. వ్యర్థప్రయోగంలేక ప్రయోగించిన ప్రతిశబ్దమూ అర్థవంతమై ఉండడం ఈతని పదకవితలోని మహత్తరశక్తి. ద్విపద నాదరించి కవితజెప్పిన పాల్కురికి సోమనాథుడు "అల్పాక్షరముల ననల్పార్థరచన కల్పించుటయెకాదె కవి వివేకంబు"[55] — అని ప్రతిన బట్టినా భక్త్యావేశంలో సంస్కృత సమాసభూయిష్ఠంగానూ, అనల్ప శబ్దాలతోనూ రచనచేసి, తన ప్రతినను నిలబెట్టుకోలేకపోయాడు. కానీ తక్కువ పదాలతో, అనంతమైన అర్థాల్ని స్ఫురింపజేస్తూ, వ్యర్థపదప్రయోగరహితంగా, శబ్దాడంబరంలేకుండా, చక్కటి భావ శిల్పంతో, మనోహరరచన తెలుగులో చేయగలిగిన వాఙ్మి, మహా కావ్య శిల్పి, శబ్దమర్మజ్ఞాని అయిన తిక్కనసోమయాజి. క్షేత్రయ్య తప్ప ఆతనితో ఈ విషయంలో తులతూగగల మరొక్కకవి లేడంటే అత్యుక్తికాదు. ఈ సందర్భంలో రాళ్ళపల్లి వారి మాటలు స్మరించ దగ్గవి. "ఇతనికి [ క్షేత్రయ్యకు ] ముందుగాని, వెనుకగాని తెలుగుసాహిత్యములో — ఒక్క తిక్కన్నను వదలితిమేని — ఇంతటి రసికుడు, సహృదయుఁడు, భాషామర్మజ్ఞుఁడు, ప్రతిభాశాలియగు కావ్యశిల్పి ఇంకొక్కఁడు పుట్టలేదు ; ఎట్లును నా యెఱుకయందు లేదు."[56] క్షేత్రయ్యపదాలన్నిట అల్పాక్షరాలతో అనల్పార్థరచన చేసినవిధం మనం చూడవచ్చు. ఇతః పూర్వమే ఉదాహృతమైన "మగువ తనకేళికామందిరము వెడలెన్" [ సీ: గి. వేం.- ప. 19 ] అన్న పదం ఇందుకు చక్కటి ఉదాహరణ. వ్యర్థపదాలు లేక ప్రతి

---

55. ద్వి. సో. పా. — అశ్వా. 1. — పు. 9.

56. ఆ. కృ. శ. రా. - ఆం. ప. [1942–43] పు. 14.

పదమూ అర్థవంతమైన పదమిది. ప్రతిశబ్దం అమోఘమైన అర్థస్ఫూర్తి కలది. తక్కువగా చెప్పి, అనంతమైన భావాన్ని భావకునకే వదలిన మహాకవి క్షేత్రయ్య. మువ్వగోపాలుని వగలెల్ల తెలిసిన పరకీయ, ఖండిత అయిన నాయిక అంటున్న మాటలు :

" పల్లవి : తెలియవచ్చెనురా ! నీ వగలెల్ల - దృష్టితాకీనిరా

అ. ప : వెలయు మువ్వగోపాల ! నానింటనుండి —
విచ్చేయు వాలాయలుచూచితె ఇపుడు ॥ తెలియ ॥

చక్కెరకెమ్మోవి పచ్చి నీ పలుకెంపు —
సామి ! నీ కన్నుల నిద్దురమంపు
చెక్కుటద్దములపై గోన్నెల గుంపు —
దక్కిన నలినాక్ష ! దానిపై సొంపు ॥ తెలియ ॥

కులుకు సిబ్బెపు గబ్బి గుబ్బలపోటు —
గుత్తపు వన్నెల కీలుజడవేటు
లలదాని పసుపు దుప్పటి వల్లెవాటు —
చెలువు నడలపించిన తడబాటు ॥ తెలియ ॥

సందిట బంగారు గాజులదద్దు —
సకియ ఓద్దిన నుదుటి తిలకము ముద్దు
అందగాడ ! మువ్వగోపాల ! యీప్రొద్దు
యిందువచ్చి నన్నేలిన పద్దు ॥ తెలియ ॥ "

[ సీ. గి. వేం. - ప. 44 ] ఈ పదంలో వ్యర్థపదం కావాలన్నా దొరకదు. అన్నీ భావగర్భితమైన పదాలు. పైగా ప్రయోగించిన శబ్దసముదాయం చాల తక్కువ. అయినా నాయకుని రూపురేఖలు మనకు కన్నులకుగట్టినట్లు, రసభావాల్ని కవి వ్యంజితం

[ సీ. గి. వేం. - స్వీ. 61 ] ఈపదమంతటా అల్పాక్షరాలతోడి అన ల్పార్థరచనా సామర్థ్యం స్పష్టమవుతుంది. 'భామరో, వామాక్షిరో, రామ, వనజాక్షిరో' అన్న పదాలున్నా అవి సంబోధనాత్మకమై ఆచరణాల్లోని భావాల్ని పరిపుష్టంచేస్తున్నాయి. ఇట్లే "ఐతే గాని నిన్నే నమ్మి యాంపె చేసిన భాగ్యము సామి" [ సీ. గి. వేం. - స్వీ. 97 ] "ఎన్నటికి నిటువంటి గుణమింక వలదె", "చూడని కూడని నిందలు జోడించిరమ్మా" [ సీ. గి. వేం - స్వీ. 166, ప. 38] అన్న పదాల్లో క్షేత్రయ్య అల్పాక్షరాలతో అనల్పార్థ రచనా సామర్థ్యం మనం చూడవచ్చు. ఇట్టి రచనా సామర్థ్యంతో క్షేత్రయ్య తన భాషామర్మజ్ఞతను ప్రచరించాడు; మహాకావ్యశిల్పిగా నిరూపించుకొన్నాడు.

## 3 . 5 . 10 ఉక్తి ప్రత్యుక్తులతో పదరచన :

క్షేత్రయ్యపదాలు అభినయానుగుణ మైనవి; వేటికవే స్వయంపోషకమైన ముక్తకాలు. జమ్మలమడక మాధవరాయ శర్మ గారన్నట్లు ఇవి స్వయం సంపూర్ణమైన ముక్తక రూపకాలు.[57] ఇంతకుముందే ఉదాహృతమైన "ఈ మాటవలన ఫల - మిక నేమి కద్దు" [ సీ. గి. వేం. - స్వీ. 61 ] అన్న పదంలోనాయిక మరొక తెతో మువ్వగోపాలుని గూర్చి చెబుతూంది. ఇందులో నాయిక ఒక్కతే మాటలాడుతూన్నప్పటికీ దూతికలు, నాయకుడు మన కన్నుల ఎదుట కన్పింపకపోరు. ఇదే అభినయంలో సహృదయ మోహనమై ఉంటుంది. ఇది ముక్తకరూపకంగానే భాసిస్తూంది. క్షేత్రయ్య పదాల్లో ఉక్తిప్రత్యుక్తులతో గూడిన సంభాషణాత్మక మైన పదాలు మూడు నాలుగు మాత్రమే కలవు. ఇతఃపూర్వమే

57. 7. అ. వి. — పు. 81, 28.

నాయికా నాయకుల పరిహాసంతో కూడిన చతురోక్తులపదం "ముందర దానవే చెలియ! మాటలకును" [సి. గి. సం - ప. 63] ఉదాహృతమై, అందులోని ఉత్తమగుణాలు వివరింపబడ్డాయి. ఇటి చతురమైన ఉక్తిప్రత్యుక్తులతో గూడి నిజంగా ఒక ముక్తకరూపంగానే ఉంటుందనడంలో సందేహంలేదు. ఇట్టి నాయికా నాయకుల సరససల్లాపాలుగల పదం :

"పల్లవి : అల్లల్ల అల్లల్ల అల్లల్ల కృష్ణ సదర నాతో నీవగలెల్ల
చిలుకల కొలికిరో! - చెలగు నీ పైటలో -
కులికేది యదియేమొ - తెలుపవే!" "అది
కలికి జక్కవలంట - తెలియవ?" "అయితే
సెలవియ్యవే పట్టి - జూరుప?" "అది పట్టరాదు
బలుకొండలు"; "అయితే - ఎలనాగ! -
పైనెక్కని - చ్చేవ?" "సరి!
చిలుకల తేజవాని - చికిలి దుర్గములని -
తలపున నీ వెక్క - దరమౌన? సరి!" ॥అల్లల్ల॥

"చక్కని పగడంపు - చాయల అదియేమో -
మ్రొక్కెను తెలుపవే - మాటితోట!" "పన్న
కెక్కియున్న దొండపండది" "అయితే -
చొక్కను మోవపంట - తొక్కనే" "అది
నొక్కరాదు కెంపు - నిక్కము
ఎక్కువ వెలయిచ్చిన నిచ్చేనా? సరి!
ఎక్కడ వెలలేని - చొక్కంపు మణి యిది
దక్కించు కొనవంట - తనికేవ? సరి!" ॥అల్లల్ల॥

"వినవే ! నీ మొగమింత తళుకుమీరి
తనరేని అది యేమి ?" "అది
యనగ అద్దములంట తెలియన ?" "అయితే –
వనిత ! నీడవచ్చునా ?" "నీడ
కానగరాదు కపురంపు తునకలు" "అయితే –
నెనరుగ కలియ వచ్చేద ?" "ఓరి !
ఘనుడ ! మువ్వ గోపాల ! – నినుగూడి కలసేను –
మునుపటి నెనరున – తనరేవ ? ఓరి !" ॥ అల్ల ॥"

[ సీ. గి. వేం. – స్వీ. 153 ] ఇందులో ఉక్తి ప్రత్యుక్తులు ఎంతో మనోజ్ఞంగా, రసజ్ఞుల కానందాపాదిగా ఉన్నాయి. ఇలాగే ప్రేమ గర్విత అయిన సఖీసల్లాపం "గజరాజగమనరో ? యా – కప టము నే నేమెఱుగ !" [ సీ. గి. వేం. – సా. 45 ] పదంలో ఎంతో మనోహరంగా రచితమైంది. ఇట్లు క్షేత్రయ్య పదాలు ఉక్తిప్రత్యు క్తులతో సైతం స్వయం సంపూర్ణమైన ముక్తక రూపకాల్లా అనం దాన్ని కలిగిస్తూ ఉంటాయి.

### 3 . 5 . 11 అలంకారాలు :

ప్రౌఢ ప్రబంధాల్లో లాగానే క్షేత్రయ్య తన పదకవితలో చక్కగా, అతికినట్లు, సందర్భానుసారంగా అలంకారాలు కూర్చి, తన కవితాపటిమను ప్రకటించుకొన్నాడు. అంత్యప్రాసాదాది శబ్దాలంకారాలు, ఉపమాది అర్థాలంకారాలు ఇతనిపదాల్లో ఎన్నో ఉన్నాయి. క్షేత్రయ్య కవితాకన్యకివి చక్కటి అలంకారాలు.

3 . 5 . 11 . 1 శబ్దాలంకారాల్లో అంత్యానుప్రాసను చాలా చక్కగా వాడుకొన్నాడు క్షేత్రయ్య. ఈ క్రిందిపదంలో పల్లవి, అనుపల్లవి, మూడు చరణాల్లో ప్రతిఖండంలోను ఈ అంత్యాను

ప్రాసను పాటించి పదానికి శ్రుతిసుభగత్వం చేకూర్చి నడపడానికీ, అంతకంటే ఎక్కువగా పాడడానికీ, దానికంటే అధికంగా అభిన యించడానికీ సౌలభ్యం చేకూర్చిన మహాకవి క్షేత్రయ్య.

" పల్లవి : ఇంటికి రానిచ్చేనా ఈ మేనితో - ఇంతి ! వాని దలచేం

అ. ప : గొంటుకాడు మువ్వ - గోపాలరాయడు
తంటాలుచేసితే - దండించక విడిచేనా ॥ ఇంటికి ॥

ఇతనికి వెరచి నే - నిక లంచమిచ్చేనా
ఇన్నాళ్ళవలె ననుస - రించేనా
బతిమాలి నే రాయ - బారమంపించేనా
పతియని మునుపటి - భక్తిదయలుంచేనా ॥ ఇంటికి ॥

ప్రేమ దలచి తన - మోమైన జూచేనా
ఏమి చెప్పిన నిజ - మెంచేనా
రామా ! అయినదెగాని - రచ్చకు వెరచేనా
ఆమాట సభలో నే - ననక విడచేనా ॥ ఇంటికి ॥

ఎనసిన మొకమాట - మెంతైన జూచేనా
ఎంతో వేడిన మన - సిచ్చేనా
వనిత ! పట్టినపట్టు - వట్టిదనిపించేనా
పనిపూని 'మువ్వా గో - పాలా !' యని పిలిచేనా
॥ ఇంటికి ॥ "

[ సీ. గి. వేం - స్వీ. 5 ] ఇందులో అంత్యానుప్రాస మనోహరంగా పాటించబడింది. ఇది ఆయాపదాల్లో చరణాల్లోనూ, చర ణాల ఖండార్థాల్లోనూ పాటించడం ఎక్కడబడితే అక్కడే చూడ వచ్చు. ఇంక లాటానుప్రాసకు " మానినిరో ! చేరరమ్మని పిలువని

మాలిమేటి మాలిమే?" [సీ. గి. వేం - స్వీ. 135] పదం చక్కటి ఉదాహరణ. ముక్తపదగ్రస్తానికి :

"ఈయగలిగితే రా - రాగలిగితే తే
తేలేకుంటే పో - పోలేకుంటే" [సీ. గి. వేం - సా. 27] అన్న పదం ఉదాహరించవచ్చు. ఇట్లే వృత్త్యనుప్రాస, ఛేకాను ప్రాసాదులకు సైతం ఎన్నైనా ఉదాహరించవచ్చు.

3.5.11.2 ఇంతకంటే అర్థాలంకారాల ప్రయోగం సందర్భశుద్ధిగా చేసినప్పుడు కవిప్రతిభకు చక్కటి నిదర్శనమవుతుంది. క్షేత్రయ్యలో ఉపమాద్యలంకారాలు కోకొల్లలు.

ఉపమ : "అడవిలో ప్రొద్దుగూక - అంధకారమైన వానలో
తడిసి దోవగానని - దానివలెనున్న తనకు" [సీ. గి. వేం - స్వీ. 124] ఇందలి ఔపమ్య మెంత హృదయంగమమో రసజ్ఞుల హృదయాలే సాక్షి ! ఇట్లే -

"కాటుక కన్నుల నీరు - ఘనమైన నీలముల వలెనే
పైట తడిసి రవికదూసి గు - బ్బలపై నిండెనే"
[సీ. గి. వేం - స్వీ. 126]

ఈ ఉపమాలంకార ప్రయోగంతో క్షేత్రయ్య ప్రౌఢకవులతో ఉపమించగలడనడంలో సందేహం లేదు. ఇట్లే "లక్కవంటి మనసు రాయైె" [సీ. గి. వేం-స్వీ. 125] అన్నది చక్కటి ఉపమాలంకారం. ఇంకా సీ. గి. వేం. - స్వీ. 48, 57, 64, 113, 130, 131; ప. 21, 35, 56, 60, 64; సా. 56, 97-పదాల్లో ఉపమాలంకారాలు ప్రయుక్తమయ్యాయి.

రూపకం : ఇక్లే రూపకాలంకారం సైతం ప్రయుక్తం. "ఏ తీరున రమణిని గెలిచి నీవెట్లు రూపోదువో" [సీ. గి. వేం - స్వీ. 82] అన్నపదం ఇంతకు ముందే ఉదాహరించబడింది. ఈ పద మంతటా రూపకాలంకారానికి ఉదాహరణలు గలవు. ఇంకా "మోహాంబుధిలో మునిగి యెట్లోర్చుదాన" [సీ. గి. వేం. స్వీ. 138], "నీ పలుకులనే సొక్కు-జల్లి కళ రేచుము" [సీ. గి. వేం. - స్వీ. 172]- అన్నవీ, ఇంతకంటే మనోజ్ఞమైనది "విరహం సాగరమునలో దరిదాపు లేనపుడు నీయురమను తెప్ప సైనుంది తోసుపుతీర్చినందుకాం" [సీ. గి. వేం. - స్వీ. 78] అన్నది కలవు. ఇక్లే - సీ. గి. వేం.- స్వీ. 34, 53, 62; ప. 35, 56, 60, 64; సా. 11, 38, 63, 76, 94 అనే పదాల్లోనూ రూపకాలంకార ప్రయోగం ఉంది.

ఇలాగే అర్థాంతరన్యాసాలంకారం - సీ. గి. వేం - స్వీ. 82, 141; ప. 17; సా. 25,27,28 పదాల్లోనూ; స్వభావోక్తి-సీ. గి. వేం- స్వీ. 69,88; ఉత్ప్రేక్షాలంకారం, భ్రాంతిమదలంకారం - సీ. గి. వేం- స్వీ. 20 పదాల్లోనూ క్షేత్రయ్య ప్రయోగించి తన ప్రతిభా నైపుణ్యాన్ని, వ్యుత్పన్నతనూ ప్రకటించడం మనకవగతమవుతుంది. పదకవితలోను చక్కటి అలంకారాలను వాడడవల్లనే దాని విశిష్టత స్పష్టమవుతుంది.

### 3. 5. 12 శ్లేష, ధ్వని మొదలైనవి :

క్షేత్రయ్య కవితలో సకృత్తుగా శ్లేష, ధ్వని మొదలైన గుణాలు సైతం మనం చూడగలం. స్వీయ, ముగ్ధ అయిన నాయిక సఖితో నాయకుడు గావించిన మోసాన్ని చెబుతూంది.

"పల్లవి : మోసపోదునా వానికి నేడు- మోసపోదునా?

అ. ప : మోసపోదునా? నేటి-మువ్వగోపాలుడు
ఆసలాడిన-న్నలయించ జూచెనే ॥మోస॥

కోరికమీరవానివేడుక కొంకక-గోరువంక తెమ్మననేగి
కూరిమి నా చెలి గోరువంకతెచ్చి-సారెకు చెక్కిలిచూపెను వాడు
నే బాలగాన ॥మోస॥

పలుమారు నా చేతి యుంగరానికొక్క - పలుకెంపువేడినదే పోయి
అలదాని బలుకెంపు అతివ! తెచ్చినను —
బిలిచి తనమోవిజూపెను వాడు చిన్నదానగాన ॥మోస॥

విరిబోణి! ఆసతో సరిపెనలు - వెలది! ఇపుడె తెచ్చెదనని సరసుడా
మువ్వగోపాలుడు సమరతి యేలి యిదె—
సరిపెనలని నవ్వెను నే కొందమగాన ॥మోస॥"

[సీ. గి. వేం.-స్వీ. 140] ఇందులో చమత్కారంతో పాటు శ్లేష, ధ్వనులను అత్యంతమనోజ్ఞంగా కూర్చి పదకవితా ప్రౌఢిమను చాటిన మహాకావ్యశిల్పి క్షేత్రయ్య. 'గోరువంక' అంటే గోరువంక అనేపక్షి, నఖక్షతం-అన్న అర్థద్వయంతోనూ; 'పలుకెంపు' అంటే కెంపులనెడి మణులు, దంతక్షతాలూ అనే రెండర్థాలతోనూ; 'సరిపెనలు' అంటే బంగారపు గొలుసులు. సమరతులు-సమంగా పెనగొనుటలూ-అనే రెండర్థాల వల్లనూ-మనోహరమైన శ్లేషవైభవాన్ని ప్రదర్శించాడు కవి. గోరువంకను, పలుకెంపులను కొనితేవడానికై పోయిన నాయకుడు మరోనాయికనుగూడి వచ్చాడన్న వ్యంగ్యం ధ్వనిస్తూంది. ఇది క్షేత్రయ్యలోని శ్లేష, ధ్వనుల వైభవం. ఇదొక్కపదం చాలు క్షేత్రయ్యను పదకవితా చక్రవర్తిని చేయడానికి. ఇల్లే "ఏమో నాటికాయాం! ఫలమింక పనిలేదు" [స్వీ. గి. వేం.-సీ. 61]—'నాటి కాయాం' అంటే ఆ నాటి'కాయ' అనీ, ఆ నాటి కయినదనీ, 'ఫల మింక' అంటే ప్రయోజనమింక అనీ, ఫలితమింక అనీ అర్థద్వయంతో కవి శ్లేషను సాధించాడు. "నాటి పొందు వెలది! నాటి యున్నందుకు"

[సీ. గి. వే,- ప. 91] 'నాటి' అంటే అనాటి అనీ, నాటుకొని-గుచ్చుకొని అనీ రెండర్థాలవల్ల శ్లేషస్పష్టం. ఇది నాయిక సుదిన మెట్లయినదీ చెబుతూంది.

"పల్లవి : సుదినమాయెనే! యీ ప్రొద్దు-సుదినమాయెనే!

అ. ప. మదనావతారుని సేవ-మనకు గలిగెనే ॥సుదిన॥

ప్రొద్దున నిలువుటద్దము- పొడగన్న ఫలము ఈ
ముద్దుమోము జూడగలిగె-ముద్దుల గుమ్మ ॥సుదిన॥

ఈపొద్దు పూర్ణకుంభ-మెదురైన ఫలము ఈ
భూపాలకుంజరుని నే-పొడగంటినమ్మ! ॥సుదిన॥

ద్విజరాజుల సేవించిన-దివ్యశకునము ఈ
విజయరాఘవశౌరి-నిడిదిలో గంటినమ్మ! ॥సుదిన॥"

[సీ. గి. వేం—సా. 98]. ఈ పదంలో చక్కటి శ్లేష, వ్యంగ్యం, ధ్వని అన్నవి సమకూరి నవనవోన్మేషశాలిని అయిన కవి ప్రతిభను చాటుతున్నాయి. 'నిలువుటద్దము' అన్నది ముఖాన్ని అద్దాన్ని తెలుపుతుంది; కుంభం-కుంజరాని కుంటుందని స్పష్టం; ద్విజరాజులు - బ్రాహ్మణ శ్రేష్ఠులూ, గరుత్మంతులూ అనే అర్థద్వయంతో, రాజునకు, విష్ణువునకు సరిగా వర్తిస్తాయనీ ఇందులోని వ్యంగ్యం. ఇట్లే "సకియ యువరతి సేయు సమయమున" [సీ. గి. వేం —సా. 94]—నేను చెప్పను గాని—ఈ పదంలోని వ్యంగ్య వైభవాన్ని తరచిచూచి, రసజ్ఞులు ఆనందపరవశులగుదురు గాక!.

క్షేత్రయ్య కవితలో మార్మికతధ్వనిస్తూంది. "వేదాంత భావనను సంకేతముల ద్వారా సూచించుట మార్మికత.[58]" నిజమే!

58. యా. శి. ప్ర. – పు. 78

క్షేత్రయ్య కవిత యావత్తూ మార్మికతా వ్యంజకమే. సందేహం లేదు. అతని మధురభక్తి సిద్ధాంతమంతా ఇందులో ఇమిడిఉంది. ఇదే దాని రహస్యం. "ఇద్దరి సందున పవ్వళించియున్న-ఇంతి పేరేమిరా" [సీ. గి, వేం. - స్వీ, 57] అన్నపదంలో జీవాత్మ, పరమాత్మ, మాయల గురించి చెప్పబడిందనీ, ఇదే అందులోని వేదాంతమనీ తలంచబడుతూంది.[59] ఇట్లే "లలనామణిరో! యీ భావము దెలుపవే లలితముగా నిపుడు" [సీ. గి. వేం —సా. 82] అన్న పదంలోనూ క్షేత్రయ్య జీవితరహస్యముందనీ,[60] మార్మికతధ్వనిస్తూందనీ[61] భావించబడుతూంది. "తెరచి చూడర! తలుపు—తెల్లవారెతూరుపు" [సీ. గి. వేం.—ప. 16] అనడంలో లౌకిక విషయమే కాక. పరమాత్ముడనే జ్యోతిని, మాయనుంచి విడివడి, చూడమన్న ప్రబోధం వ్యంజితమైంది. ఇట్లే "అంతరంగము శోధించి అలసితి" [సీ.గి.వేం — స్వీ. 61] అనడంలో ఇంకా పూర్తిగా పరమాత్ముని మర్మమెరుగలేక పోయానని ధ్వని. ఇంకా "నీ పొందు సేయకమాన మువ్వగోపాలా! నీ పాదమాన!" [సీ. గి. వేం—ప. 55] అన్న పదంలో క్షేత్రయ్య మధుర జీవితకథ ఉంది. మువ్వగోపాలునకు సమర్పించుకొన్న నాయిక అయిన క్షేత్రయ్య మధురభక్తి ఇందలిధ్వని. ఇట్లు క్షేత్రయ్య కవితలో మార్మికత సైతమున్నట్లు స్పష్టమవుతుంది.

### 3.5.13 లోకవృత్త పరిశీలనా నైశిత్యం

లోకజ్ఞత కవికి చాలాముఖ్యం; కవి ప్రతిభకి వన్నెగూరుస్తుంది. లోకవృత్తాన్ని నిశితంగా పరిశీలించి, అందలి విషయాలను

---

59. (1) 7. అ. వి. – పు. 62, 63.
(2) ఆ. – సం. 11. – పు. 98.

60. ర. రా. బా. – పు. 255, 256.

61. యా. శి. ప్ర – పు. 73.

గ్రహించి, తన అమేయ ప్రతిభతో కల్పించిన కవితలో కూర్చి నట్లయితే బంగారుకు తావి అబ్బినట్లవుతుంది. ఈ లోకజ్ఞత కవి కుండవలసిన ప్రతిభా వ్యుత్పత్తులలో — రెండవ దైన వ్యుత్పన్నతలోని ఒక అంశం. ఇలాంటి లోకవృత్తులను నిశితంగా పరిశీలించి, తన కవితలో పొదిగిన మహాకవి క్షేత్రయ్య. ఇతఃపూర్వం ఆయా సందర్భాల్లో ఈతని లోకజ్ఞత వ్యక్తమైంది. ఈ లోకజ్ఞతను మరి ఒకటి రెండుదాహరణ లివ్వడం అప్రస్తుతం కాదు. సఖి నాయికను బోధి స్తూంది ఈ క్రింది పదంలో :

"పల్లవి: పుట్టు భోగీంద్రు డలుకల కోర్వజాలడో —
పొలతిరో! బిరాన రావే

అ. ప. : నెట్టుకొని పలుమారు — నేనే మ్రొక్కెదనే ॥ పుట్టు ॥

చలమేల మొగ్గ మ — ట్టైల పోట్ల గంట్ల చే
అలరమణు మేను — పులి పులి యైనది
కలికి! నీ చనుదోయి — గజనిమ్మపండ్ల కా
కలగాని మాయదా — గాయంపు నొప్పి ॥ పుట్టు ॥

పమ్మి పుప్పొడి సెరసు — పడి యెర్రనైన కను
దమ్ములకు నీ రార — గమ్మి నిపుడు
కొమ్మ! పయ్యెద కొంగు — కొంచవినొత్తవే
తెమ్మపడి కన్ను గవ — తేటయాగాని ॥ పుట్టు ॥

పెలుచురే యెండ వడ — పెట్టుపడి నాయకుడు
తలకొనెడు వెతలచే — దప్పిదీర
అల మువ్వ గోపాలు — నలమి కౌగిట జేర్చి
పొలుపు కెమ్మోవిక — ప్పురవిడెమీయవే ॥ పుట్టు ॥"

[సీ. గి. వేం. — ప. 60] ఈ పదం క్షేత్రయ్య లోకవృత్త పరిశీలనా నిశితత్వానికి పరకోటి. మొదటి చరణంలో పులి పులివైన శరీరపు గంట్లు కాకచే నయమవుతాయన్న లోకసత్యాన్ని; రెండో చరణంలో పుప్పొడి నెరసుపడి ఎర్రనైన కంటికి 'కోకావినొత్తిన' 'తెమ్మెపడి' కళ్లు తేటఅవుతాయన్న వాస్తవాన్ని; మూడో చరణంలో 'దప్పిదీర' 'కప్పురవిడె' మొసగవలసి ఉంటుందన్న లోకనైజాన్ని గుర్తించిన క్షేత్రయ్య తన పదకవితలో కూర్చి, నిశితపరిశీలనాదక్షతను ప్రకటించు కొన్నాడు. ఇంకా ఒక పచ్చి ఒడలి బాలింత—

"పట్టకురా రొమ్మ — పాలంటు జేతుల
ఎట్టులోర్తును పరు — లేమందురు
వట్టిపోతే మొర — పెట్టును పసిబిడ్డ
అట్టె మనసు బిగ — బట్టుకో రన్నెల్లు"

[సీ. గి. వేం — స్వీ. 129] అని మువ్వగోపాలుని బతిమాలుతూంది. బాలింత 'రొమ్ము' పట్టుకొంటే 'వట్టిపోవడం' జరుగుతుందన్న లోక సత్యం తెలిసినవాడు క్షేత్రయ్య.

"మందు మాకు లడిగిరారా! — మంత్రసానుల వద్ద
కుందరదనలు కూడి — గుసగుసలాడక మునుపే".

[సీ. గి. వేం. — ప. 85] అని నాయకుని ప్రార్థిస్తూంది 'ముట్టు నెలదప్పి'న ఒక 'ముగుద'! నిజమే! ఈ నాటి కుటుంబనియంత్రణ సాధనాలు ఆ నాడు లేవుగదా? 'మంత్రసానుల మందు మాకులే' క్షేత్రయ్య కాలంనాటికి శరణ్యం. క్షేత్రయ్య లోకంలోని సర్వ విషయాలను సూక్ష్మాతి సూక్ష్మంగా, నిశితంగా పరిశీలించిన దిట్టఅనీ, వాటిని తన పదకవితలోచేర్చి తాను మహాకవుల జాబితాలో చేర గలిగాడనీ చెప్పడం సముచితం.

### 3.5.14 సాంఘిక స్థితిగతులు :

క్షేత్రయ్య ఎంత మధురభక్తితో మువ్వగోపాలునిపై పదాలు రచించినా ఆనాటి సాంఘిక స్థితిగతులు, అందులో ప్రతిబింబిస్తూనే ఉన్నాయి. అలా చోటుచేసుకొని నాటి స్థితిగతులు ప్రతిఫలిస్తూ ఉండడం సర్వసామాన్యమే. క్షేత్రయ్య శృంగార ప్రపంచంలోని పడకటింట్ల అలంకరణలు, వేశ్యలకవసరమైన డబ్బు, నాటి నాణాలు, లంచగొండితనం, ఆటపాటలు, పూజలు, వ్రతాలు, స్త్రీ పురుషుల అలంకరణలు — కొన్నేమిటి — సమస్తమూ దృగ్గోచరమవుతాయి. ఆనాడు స్త్రీ పురుషులు పున్నమొక్క-ప్రొద్దు, కలువపువ్వుల పూజ, నాగులచవితి వ్రతం, చతుర్దశి చెల్లించడం, లక్ష్మీకల్యాణం మొదలైన వన్నీ చేసేవారు. [సీ. గి. వేం — స్వ. 111; సా. 19]. ఆనాటి స్త్రీలు పురుషులతో చదరంగమాడేవారు. [ప. 26]. ఆనాడు మెరువడి ఊరేగింపు—[సా. 27] ఉండేది. ఆ నాటి ప్రజల్లో సంగీతం సర్వసామాన్యం. వీణమీటుతూ పదం పాడడమూ [సా. 44, 88] తంబురా శ్రుతిచేసి సంచుపాట పాడడమూ, కిన్నెర మీటడమూ [ప. 34]; పిల్లనగ్రోవి ఊదడమూ [సా. 52]; సొగసు పాటలు పాడడమూ [సీ. 103]; ఏలపదం పాడడమూ [సి. 76]; నాటి స్త్రీలు నేర్చిన కళలు. సూనశరునిమీది పాటలు [స్వ. 93,] వలరాజు మీద పదాలు [సా. 79] పాడడం వారికవచ్చు. ఒకచోట "అందమైన వీణచేతబూని—అనురాగముతే మీటి; పొందుగాను పదకవిత్వముల — పలుకనేర్చునా" [సా.59] అంటుంది ఒకనాయిక. ఆ నాటి పదాలను వీణ, తంబుర, కిన్నెర మీటుతూ పాడేవాళ్ళని అర్థమవుతుంది. అన్యాపదేశంగా ఆర్త అయిన నాయికనూ, తన పదకవితనుగూర్చి క్షేత్రయ్య అంటున్నాడు—"...వాని పద పద్యరచన

సేయ నుత్తర మీయవలె ? వాని ముద్దుకవిత తా
వ్రాయ చదువ నేరవలె ! అవగల యందు

గాయకురాలు గావలె ... ... ... ...
ఆటకు మేటి గావలె ! తంబుర
గోట మీట రాగ మనవలె ! వానిపై సొగసు
పాటలు వినుపించవలె ... ... [సా. 96].

పైని పేర్కొన్న సొగసు పాటలనగా శృంగార పదాలనుకోవచ్చు; "సంచు" అంటే అందమనే అర్థముంది.[62] అంటే దూరాన్వయంతో సంచు పాటలంటే శృంగార పదాలని అనుకోవచ్చునేమో ! ఆనాడు స్త్రీలేగాక, పురుషులూ పూలు ముడుచుకొనేవారు. [ప. 29, 36, 65]. ఆనాటి స్త్రీలు రకరకాలైన ఆభరణాలూ, వివిధ విధాలైన వస్త్రాలంకరణ చేసుకొనేవారు. కంటసరులు [సా. 78]; ముత్యాల సరాలు, చీనా సరిపెనలు, నాగసరాలు [స్వీ.139]; 'తాటంకములు' [సా—42]; బంగారు గాజులు [ప. 44]; 'బన్నసరములు' [స్వీ. 77]; 'రత్నసరములు' [సా. 77]; మొగ్గమట్టెలు [ప. 60]; మొదలైన ఆభరణాలు నాటి స్త్రీలు ధరించేవారు. 'పట్టు పటాని, రవసెల్లా [ప. 65];' 'మేటి చందురుకావి పావడపై పసిడిపట్టుచేలము" [స్వీ. 77]; 'చందురుకావి పసిండి సరిగంచు పయ్యెద' [స్వీ. 154]; "పసుపు దుప్పటి వల్లెవాటు" [ప. 44]; సరిగకోకలు [సా. 27]; మేటిపైతాణికొంగు [సా.77]; 'చలువ చీరెలు, చెంగలు రవికెలు' [సా. 27] మొదలైన వస్త్రాలు ధరించేవాళ్ళు నాటి స్త్రీలు. పురుషులు—బురుసు రుమాలు, తురాయి [ప. 36]; చలువ దుప్పటి [సా, 44] బిగియుదట్టి, వలెవాటు [సా. 52] మొదలైనవి ధరించే వారు. స్త్రీలు కస్తూరికామకరికలు చెక్కిళ్ళపై [స్వీ. 153] దిద్దు కొనేవారు. స్త్రీలు తిలకం, కస్తూరి నామం [స్వీ. 76]; పురుషులు

62. సీ. రా బ — పు. 765.

గీరునామం [సా. 52] ఉంచుకొనేవారు. 'కర్పూరవిడెము' [ప. 69, 71, 99; స్వీ—10, 62], చలువగంధం, విరులసరాలు [ప. 83], పన్నీరు [సా. 88] ఆనాటి భోగ్యవస్తువులు. ఆనాడు పడకటిండ్లలో చిలుకలు, గోరువంకలు, [సా. 16] పెంచబడుతూండేవి. పట్టెమంచాలు [సా. 16, స్వీ. 162], పూల పాన్పులు [ప. 79], మేడపై తూగుటుయ్యాలలు [స్వీ. 77], చలువ చప్పరాలు మొదలైన వాటికి ఆనాడు కొదవలేదు. వేశ్యకు డబ్బే ముఖ్యమని [స్వీ.27, సా. 35, 51, 70] వ్యక్తమవుతుంది. ఆనాటి నాణేలు - వరహాలు [సా. 27]; దుగ్గాని, మాడ, [సా.28], రూకలు [సా. 27]; ఘట్లు [సా.55]; కాసువీసము [సా.29] మొదలైనవి ప్రసక్తాలయ్యాయి. ఇందులో "ఘట్లు ఒకవిధమైన నాణెములేమో !"[63] ఆనాడుగూడ లంచం [స్వీ. 4, 5, 75; ప. 29] ఉండేదని తెలుస్తూంది. ఆ రోజుల లోని పెట్టు మందులు [సీ. 8], శకునాలమీద నమ్మకం [స్వీ. 7, 147; సా.98] మొదలైన విషయాలుగూడ క్షేత్రయ్య తన కవితలో వివరించాడు. ఇలాగా క్షేత్రయ్య కవితలో ఆనాటి సాంఘిక పరిస్థితులు ప్రతిబింబితమై ఉన్నాయి.

## 3.5.15 కవి సమయాలు [Poetic Conventions] :

క్షేత్రయ్య కవితలో కవి సమయాలుగూడ చక్కగా కుదిరి ఉన్నాయి. అందులో వాని విశిష్టత వానిదే. క్షేత్రయ్య కవితా మర్మజ్ఞత దీనిచే వ్యక్తమవుతుంది. 'విదియ చందురులు' (నఖక్షతాలు) [ప. 19]; "కొదమ కెంపులు" (దంతక్షతాలు) [సా. 20] మొదలైనవి కలవు. "ఇన్నివిధముల పూజించేరా సామి" [సా. 19] అనే పదంలో ముఖం-చంద్రుడు; కన్నులు-కలువలు; నూగారు-నాగులు;

63. రా. రా. దే. – పు. 37.

చన్నులు - బంగరు కలశములు; మోవి—జుంటె తేనె; చూపులు—ఆరతులు మొదలైన వాటికి ఔపమ్యం సాధించడం జరిగింది. ఇక్కే "గజరాజ గమనరో"; "ఏమిచోద్యమైన..."; "రామ, రామ..."; "తెలయవచ్చెనురా..."; "అల్లి, అల్లి, అల్లి కృష్ణపదం" [సా. 45; ప, 20, 76, 44; స్వీ. 153] పదాల్లో మస్తుగా కవి సమయా లున్నాయి. మరో చక్కటి ఉదాహరణ :

"ఇదిగో! దొండపంటిపై వాలిన
యుదుటు తుమ్మెదంటి గాక
మదనుని కేళి — మగువల కాటుక
పెదవి నంటె నంటినా ?
సంకుమీద — చందురు కొదమలు
పొంకమాయె నంటిగాక ! యది
కొంకక తన గళముపై నెల
వంకలుంచె నంటినా ?" [సా. 89].

ఇందులోని దొండపండు-పెదవికి; సంకు-గళమునకు సర్వకవిలోకంలో ప్రయోగమున్నమాట వాస్తవమే. కానీ ఇంతటి చమత్కారంగా. కవి సమయాన్ని ఇంత నవ్యాతి నవ్యంగా ప్రయోగించడంలో క్షేత్రయ్య గొప్పదనమూ, ప్రతిభా, లోకజ్ఞతా, నిశితంగా, సూక్ష్మంగా ప్రత్యంశాన్నీ పరిశీలించే విశిష్టతా గోచరించి, ప్రౌఢ కవులలో ఏ మాత్రమూ తీసిపోడనీ, పైపెచ్చు ఇతని ప్రత్యేకత స్పష్టమవుతుందనీ అవగతమవుతూంది.

## 3.5.16 ఇతర కవులతో పోలికలు :

క్షేత్రయ్యకు ఇతర కవులకుగల పోలికలనుదెల్పి, అతని ప్రత్యేకతను స్పష్టం చేయడం అవసరం. ఇతఃపూర్వం ఆయా సంద

ర్భాల్లో ఇతర కవుల పోలికలనుగూడ ప్రస్ఫుటింపజేయడం జరిగింది. దేశి కవిత నాదరించి, కావ్యగౌరవం చేకూర్చిన మహాకవి పాల్కురికి సోమనాథుడు. తుమ్మెద పదాలనే అచ్చమైన తెలుగు పదాలని మొదటిసారిగా పేర్కొన్న కవీ, జానుతెనుగులో కవితచెప్పి ఒప్పిస్తానన్న ఘనుడూ ఇతడే. ఇట్టి తెలుగుదనం తొణికిసలాడే తేట తెనుగుభాషలో అసలుసిసలైన పదకవితను చెప్పి ఒప్పించిన మహా కావ్యశిల్పి క్షేత్రయ్య. తెనుగు నుడికారానికీ, జాతీయతకూ, పలుకుబళ్లకూ, అలంకారాలతో అనల్పార్థం కవితలో సంపాదించినందుకూ ప్రత్యక్ష నిదర్శనమైన మహా వాగ్గేయకారుడు, మహా కావ్యశిల్పి అని ప్రసిద్ధికెక్కిన తిక్కనతో అయినా గుణాల్లో క్షేత్రయ్య పోలిఉన్నా డనడం అత్యుక్తి కాదు. శృంగార రసాన్ని ఆరాధించడంలోనేగాక, మంజరీద్విపదల్లో 'పల్నాటి వీరచరిత్ర' రచించిన కవిసార్వభౌముడైన శ్రీనాథునితో క్షేత్రయ్యకు సాదృశ్యం ఉంది. అంతేగాక "కంటి యలవత లసమాస్త్రి ఖడ్గలతలు" — అన్న శ్రీనాథుని కాశీఖండము లోని భావంలాగే 'కాముని తలిరు పదనుకత్తులనుమ్మి యీ చెలులు' అని చెప్పడం గమనించదగ్గది. ఇంతకంటే భక్తిలో క్షేత్రయ్య సమీపించ దగిన సహజకవి పోతన.

"పల్లవి : మానినిరో ! చేరరమ్మని పిలువని — మాలిమేటి మాలిమే ?

అ. ప. : పూని దాని ప్రాయము ననుభవింపగలేని — పురుషు డేటి
పురుషుడే ? ఓ చెలియా ! ॥ మానిని ॥

వెన్నెలబైట సంగీతము వినకట్టి — వేడుకేటి వేడుకే ?
చిన్నెలు మెరయించి చిరునవ్వు నవ్వని — చిత్తమేటి
చిత్తమే ?
సన్నుతాంగిరో ! కనుసైగచేయని యట్టి — సరసమేటి
సరసమే ?

పన్నుగ దాని వర్ణింపలేనట్టి - పలుకు లేటి పలుకులే ?
ఓ చెలియా ॥ మానినీ ॥

విరిపాన్పుపై పోలి వేగింప లేనట్టి-విరహమేటి విరహమే?
తరితీపుతో చాల తమక మెచ్చని యట్టి-తమక్కు లేటి తమక్కులే?
కరికుంభముల సాటి కుచములపై లేని-కలయు లేటి కలయులే?
విరిగొన్న విధమున అధరమానని యట్టి-నొక్కు లేటి
పెదవులే? ఓ చెలియా ॥ మానినీ ॥

నీవే నా ప్రాణనాయకి యని యెంచని-నెనరు లేటి నెనరులే?
చవుసీతిబంధము విధము తెలియనట్టి-పదుక్కు లేటి పదుక్కులే?
కవులకు బహుమాన మియ్యగ లేనట్టి-కలయు లేటి కలయులే?
అవునని మువ్వ గోపాలుడు మెచ్చని-యెంగ మేటి
యెంగమే? ఓ చెలియా ॥ మానినీ ॥"

[సీ. గి. వేం. - స్వీ. 135] అన్న క్షేత్రయ్య పదం —

"కంజాక్షునకుఁగాని కాయంబు కాయమే?
పవనగుంభిత చర్మ భస్త్రిగాక ...[64]" —

అనే పోతన పద్యాన్ని తలపింప జేస్తుంది. కాని పైపదంలో "కవులకు బహుమానమియ్యగ లేనట్టి కలయు లేటి కలయులే" — అన్న ఖండం తప్పిస్తే "పోతరాజు పద్యము కేవలము భక్తి ప్రధానమైనది. క్షేత్రయ్య పదములు శృంగార రస ప్రధానములైనను అయినను తదాశయములు గలదిగనుక, మిగులమనోహరమైన" అని వీరు వారి అభిప్రాయం.[65] అయినా ఆ ఖండం ప్రక్షిప్తం కావచ్చు.

---

64. పో—సప్తమ స్కంధము — ప. 168.
65. సీ. గి. వేం. - పు XLII.

ఇంక క్షేత్రయ్య పదాలను పదకవితా పితామహుడైన అన్నమాచార్యుల శృంగార కీర్తనలే నడక నేర్పిన విషయం ప్రసిద్ధమే. కనుకనే క్షేత్రయ్యలో అన్నమయ్య సంకీర్తనల అనుకరణలనేకం కన్పించడం సమంజసమే.[66] "మగువ తన కేళికామందిరము వెడలెన్" [సీ. గి. వేం.-ప. 19] అన్న క్షేత్రయ్య పదానికి

"పలుకుఁదేనెల తల్లి పవళించెను
కలికి తనముల విభునిఁ గలసినదిగాన ॥పలుకు॥

నిగనిగని మోముపై నెఱులు గెలఁకులఁ జెదర
పగలైన దాఁకఁ జెలి పవళించెను
తెగని పరిణతులతోఁ దెల్లవారిన దాఁక
జగదేకపతి మనసు జట్టిగొనెఁగాన ॥పలుకు॥

కొంగు జాఱిన మెఱుఁగు గుబ్బలొలయఁగఁ దరుణి
బంగారు మేడపైఁ బవళించెను
చెంగలువకనుఁగొనల సింగారములు దొలఁక
నంగజగురునితోడ నలసినదిగాన ॥పలుకు॥

మురిపెంపు నటనతో ముత్యాల మలఁగుపై
పరవశంబునఁదరుణి పవళించెను
తిరువేంకటచలాధిపుని కౌఁగిటఁ గలసి
యరవిరై నునుఁ జెమట నంటినది గాన ॥పలుకు॥"—67

అనే అన్నమయ్య పదం మూలం. ఇతఃపూర్వమే ఉదాహృతమైన "మానినిరో! చేరరమ్మని పిలువని-మాటి మాటి మే" [సీ. గి. వేం.

66. 7. అ. వి. — పు. 42–45.
67. అ. తా. — సం 4. ప. 74.

స్వీ. 135] అనే క్షేత్రయ్య పదానికి "ఏటిపొందు ఏటి గుణము ఏటి సవరందనము మనసు—నాటుకొలుపం జేయలేని నటనలేఃటికే[68]—అనే అన్నమయ్య పదంమూలం. "ఇంత తెలిసియుండి—యీ గుణమేలరా" [సీ.గి.వేం-సీ. 47] అనే క్షేత్రయ్య పదం "కటకట అయ్యో కాంత నింతయేపుదురా..." అనే అన్నమయ్య పదంలా ఉంది. ఇంకా మరి కొన్ని రజనీకాంతరావు గారుదాహరించారు.[69] వీటివల్ల క్షేత్రయ్య అన్నమయ్య నెంతగా అనుకరించాడో మనకు స్పష్టమవుతుంది. అన్నమయ్య సతీమణి తాళ్లపాక తిమ్మక్క రచించిన "సుభద్రా కల్యాణ" మనే మంజరీ ద్విపద కావ్యంలోని" ఎగుభుజమ్ముల వాడు..." అన్నదే "ఎంతచక్కనివాడే ......" [సీ. గి. వేం-స్వీ. 161] అనే క్షేత్రయ్య పదానికి మూలమన్నది పూర్వోక్తం.

క్షేత్రయ్య "ముడుచుక పోయేరు ముని ముచ్చులీ చెలులు" [సీ. గి. వేం.—స్వీ. 98] అన్నపదం—కేవలం శబ్దమే అయినా—"మునిమ్రుచ్చు లెల్ల తామరస నేత్రలండ్ల బందాలుగారె" [మను చరిత్ర—2.73] అనే పెద్దన పద్యాన్ని తలపింపజేస్తోంది.

"నెలతా! నేనినుబాసి—నిమిషము రాకున్నంత
కలకల నగుతానీ—కన్నుల ఎదుట నిలచి
పిలిచినట్లుండునే! నుదుట కస్తూరి
తిలకము దిద్దినట్లుండునే! వాడిగోరచెక్కిలి

68. పైదే – ప 178.

69. ర. రా. శా. – పు. 239 – 241

జీరెముద్దాడి కౌగిట—జేర్చినట్లుండునే" [సీ. గి. కామహుడైన అనే క్షేత్రయ్య పదం నన్నెచోడుని "కలకల నవ్వువనట్లు దమకించమే. గన్గవ విచ్చిభ్రూలతల్, వాలయఁగఁజూచునట్లు ..." [కుమార సంభవము 5—119] అనే పద్యాన్ని, పింగళి సూరన "కలకల నవ్వి నట్లు తెలిగన్నుల నిక్కమచూచినట్లు ..." [ప్రభావతీ ప్రద్యుమ్నము. 1—138] అనే పద్యాన్ని స్ఫురింపజేస్తుంది. సంగీత కళా రహస్య నిధి అయిన రామరాజభూషణునితో సంగీతసాహిత్యాలతో క్షేత్రయ్య సాదృశ్యం కలవాడు. "ఇంతిరో ..." [సీ. గి. వేం.—ప. 8] అన్న క్షేత్రయ్య వర్ణించిన నాయకుని విరహం "ఉసురనుఁ గన్ను మోడ్చు ..." [4—81] అన్న పద్యంలో రామరాజభూష ణుడు వర్ణించిన వసురాజు విరహాన్ని తలపింపజేస్తూందన్న విషయం పూర్వోక్తం.

"వెన్నెల బైటసంగీతమువిననట్టి వేడుకేటివేడుకే" [సీ.గి.వేం. సీ్వ. 135] అన్న క్షేత్రయ్య పదం రఘునాథరాయల—

"బోయ మిటారి గుబ్బెతలు పున్నమ వెన్నెల బైటనీపయిం
బాయని బాళికిన్నెరలు మాటికి మీటుచు నీ ప్రతాపముల్

హాయని చొక్కి పాడ ..." [వాల్మీకి చరిత్రము—2-139] అనే పద్యాన్ని గుర్తుకు తెస్తుంది. చేమకూర వేంకటకవికి క్షేత్ర య్యకు ఎక్కువ పోలికలున్నాయి. "ఎంతచక్కనివాడే ..." [సీ. గి. వే. - సీ. 161] అనే క్షేత్రయ్యపదం "ఎగుభుజంబుల వాఁడు ..." [2—164] అనే చేమకూర పద్యాన్ని పోలిందన్న విషయం పూర్వోక్తం. "మదిరాక్షి! మువ్వగోపాలుడు మాటలోనే ఇందువచ్చి" [సీ. గి. వేం.—ప. 34] అనే క్షేత్రయ్య పదంలోనిది "మాటలోపల వచ్చె నమ్మాధవుండు" [3—96] అనే చేమకూరను తలపింపజేస్తుంది. క్షేత్రయ్య "అమ్మ జెల్ల" [సీ. గి. వేం.—సా. 86]

అన్నది చేమకూర "అమ్మకచెల్ల" అన్న మాటను జ్ఞప్తికి తెస్తుంది. ఇంతేగాదు; క్షేత్రయ్య "ప్రొద్దుపోదు నిదురరాదు", "అది నోము ఫలమే—ఓ చెలియా!"; "చిత్తము వేరైనందుకే—చింతచేసెను" [సీ. గి. వేం.—ప. 61,3; స్వీ. 105] అనే పదాల్లోని జాతివార్తల లోనూ, ప్రతిపదచమత్కారంలోనూ చేమకూరతో అన్నివిధాలా సాదృశ్యంగలవాడని చెప్పవచ్చు.

విజయరాఘవ నాయకునకు — విజయరాఘవ నాయకునకు మాత్రమే అని ఏమి — ఆనాటి కవులకు, తరువాతి పదకవులకు క్షేత్రయ్య పదాలు ఒరవళ్లు. క్షేత్రయ్య పద్ధతిలోనే విజయరాఘవ నాయకుడు పదరచనా చేసినా, ఆతని మధురభక్తి ఇతనికి రాలేదు. రంగాజమ్మ సైతం క్షేత్రయ్య పదకవిత ననుసరించి రచన చేసింది. ఇంతేగాక —

"అలిగే వారలు లేరో? - అంతలోనే సమ్మతించి
కలిసేవారు లేరో? — కలికిరో! యిపుడు"

[సీ. గి. వేం.—స్వీ. 138] అనే క్షేత్రయ్య పదం-విషయం-వేరైనా-రంగాజమ్మ-

"ఏ వనితల్ మముందలపనేమిపనో? తమరాడువారు గా
రో? వలపించునేర్పెరుగరో? ......"— అన్న పద్యాన్ని

తలపింపజేస్తుంది. ఇక "సుదినమాయెనే ఈ ప్రొద్దు సుదినమాయెనే" [సీ. గి. వేం. - సా. 98] అనే క్షేత్రయ్య పదాన్ని కామరసు వేంకటపతి తనదిగానే వాడుకొన్నాడు తన 'విజయరాఘవ చంద్రికా విహారం'లో. ఇంతేగాక శృంగార పదరచనలో క్షేత్రయ్యతో పోటీ పడగల కవి ఇతడు. "అక్కరో! ఓర్వనివారు" [సీ. గి. వేం. -ప. 1] అనే క్షేత్రయ్య పదాన్ని "కటకట ఈ రాజకందర్పుని నా కన్నులు

జూచినప్పుడే" -- అన్న పదంలో వేంకటపతి అనుకరించాడు.[70] ఇంకా ఇలాంటి వనేకం.

సుమతిశతకకర్తను స్మరింపజేసే పదాలు క్షేత్రయ్యలో కొన్ని ఉన్నాయి. "దగ్గరారాపని లేదురా" [సీ. గి. వేం.-సా. 27] మొదలైన క్షేత్రయ్య పదాలు సుమతి శతకంలోని -

"కొక్కోక మెల్ల జదివిన
జక్కనివాడైన రాజ చంద్రుండైనన్
మిక్కిలి రొక్కము లియ్యక
చిక్కదురా వారకాంత సిద్ధము సుమతీ!" [ప. 40].

అనే పద్యాన్ని; "పరిపరివితముల పణతినైనేమందు?
సరసము విరసమైతే సామినేమందు?

[సీ. గి. వేం. - సా. 28] అన్న క్షేత్రయ్య పదం సుమతిశతకంలోని "సరసము విరసముకొరకే" - అన్న పద్యాన్ని తలపింపజేస్తాయి. ఇంక పదకవులందరు క్షేత్రయ్య ననుకరించారు. సారంగపాణి తన పదాల్లో క్షేత్రయ్యను బాగా అనుకరించిన పదకారుడు.

ఇంతేగాక సంస్కృతంలో వాగ్గేయకారులైన జయదేవుడు, లీలాశుకుడు, నారాయణతీర్థులు మున్నగు మహాకవులను, గేయ రచనలోను, భక్తి భావనలోను క్షేత్రయ్య అన్ని విధాలా అనుసరించాడు. ఆ కవులకు సైతం సాధ్యంగాని పదలాలిత్యాన్ని తెలుగులో సంపాదించినవాడు క్షేత్రయ్య. మైథిలీభాషలో అనేక పదావళి రచించిన ప్రసిద్ధ వాగ్గేయకారుడు విద్యాపతికీ, పరమభక్తురాల

70. అ. – సం. 11. పు. 128–181.

యిన మీరాబాయికీ క్షేత్రయ్యకూ అనేక విధాలా పోలికలున్నాయి. ఇంతకంటే గేయరచనలో, పదస్వరూపంలో, భక్తిలో క్షేత్రయ్య చేత అనుకరించబడినవాడు ప్రముఖ కర్ణాట వాగ్గేయకారుడు పురందరదాసు. పురందరదాసు "బుద్ధిహేళే నిన్న ముద్దుకందనా" అనే కన్నడ పదాన్ని "ఎవ్వడే? ఎవ్వడే? ఓ భామ? వీడెవ్వడే?" [క్షే. వేం. - ప. 19] అనే తన ప్రసిద్ధపదంలో క్షేత్రయ్య అనుకరించా డంటారు.[71] అన్నమయ్య సంకీర్తనల్లో పల్లవి మాత్రమే ఉంటుంది. కానీ పురందరదాసు కీర్తనల్లో పల్లవి, అనుపల్లవీ ఉంటాయి. క్షేత్రయ్య ఈ అనుపల్లవి పద్ధతిని తెలుగులో ప్రవేశపెట్టిన వారిలో మొదటివాడనవచ్చు. అది పురందరుని అనుసరించి చేసి ఉండవచ్చు.

ఇట్లు తెలుగు వాఙ్మయంలోని ప్రసిద్ధకవుల కవితలతో పోలికలు గల చక్కటి కవిత చెప్పడమేగాక, ఇతర భాషా వాగ్గేయకారుల సాదృశ్యం సైతం సంతరించుకొని, ఎందరికో పదరచనలో మార్గదర్శకుడయ్యాడు క్షేత్రయ్య.

## 3. 5. 17 ఛందస్సు :

క్షేత్రయ్య పదాలు నిబంధపదాలు. ఇందులో సమ, అర్ధసమ, విషమపదాలున్నాయి. వీటన్నిట యతిప్రాసలు పద్యవృత్తాలలో వలెనే క్షేత్రయ్య పాటించి అలవోకగ పదాలను నడపడం ఆతని పదాలవల్ల స్పష్టమవుతుంది. రాగతాళాలతో హృదయంగమమైన భావాలతో కూడినదే ఉత్తమపదం. ఈ పదాల్లోని తాళ నిబంధనకు మాత్రాగణాలు ముఖ్యం. ఈ మాత్రాగణాల మూలంగానే పదాలు రచితం. క్షేత్రయ్య పదాల్లో యతిప్రాసలు అలవోకగా తమకు తామే వచ్చి కుదిరినట్లుండడం గమనించదగ్గది.

---

71. 7. అ. వి. – పు. 4 , 48.

యతిప్రాసలు వేమన కవిత్వానికి అలంకారప్రాయంగా మనోజ్ఞతను కొనితెచ్చి పెట్టాయన్న రాళ్లపల్లి వారి మాటలు స్మరించదగ్గవి.[72] ఈ క్షేత్రయ్యవి పదాలే అయినా, వీటికి ఈ యతిప్రాసలు నిజంగా అలంకారాల్లా ఉంటున్నాయి. ఇందులో యతికి బదులు, ప్రాసయతి నైనా వాడవచ్చునన్న అనుమతి ఉన్నప్పటికీ కేవలం యతితో పదంలో క్షేత్రయ్య పాటించి ఉండడం గమనించ దగ్గది. మచ్చుకు:

"పల్లవి: ఇటువంటి వాడనుచు-ఇప్పుడు తెలిసెరా!

అ. ప: విటరాయ! మువ్వపురి-విభుడైన గోపాల! ॥ఇటు॥

చెలిమిచేసేదందు-చలము చేసేదిందు
వలపులుంచేదందు - వచ్చియుండేదిందు
నెలకొన్న మరులందు - నిట్టూర్పులే యిందు
వెలలేని పాటందు - వింతకయ్యము లిందు ॥ఇటు॥

వగలు కులికేదందు - వట్టి సుద్దులిందు
మగువతో లీగుమందు—మత్సరము లిందు
సొగసునవ్వులందు—సోలించేదిందు
తగు సొమ్ములిచ్చేదందు — తగులుచేసేదిందు ॥ఇటు॥

వడిగొన్న మోహమందు—వల్లభుడని పేరిందు
విడె మొసగిమెచ్చేదందు—విడనాడేదిందు
పడుకటింటి హాయలందు-పొన్న శృంగారమిందు
నడవడిక కూడేదందు-నన్నేల దూరేదిందు ॥ఇటు॥"

---

72. 2 అ. కృ. శ. రా. — పు. 3, 4.

[సీ. గి. వేం. - స్వీ. 55] ఈ పదంలో యతి యుండవలసిన చోట శబ్దమూ, శబ్దంతోపాటు అభిప్రాయమూ ముగిసి, పదానికి మనో హారత్వాన్ని చేకూరుస్తున్నాయి. పైగా పదమంతటా 'అందు' అన్న అంత్యప్రాసను పాటించడమే గాక ప్రతి చరణంలోని ఖండార్థాల్లోను 'అందు' అనే అంత్యప్రాసను-లేని శ్రమ కొనితెచ్చుకొని-పాటించడం మరింత అందాన్ని కలిగిస్తుంది. కేవలం ప్రాసయతిని పాటించిన పట్టులూ ఉన్నాయి.

"అనలు కొనలు పారినట్లు—మనసు మనసు నెనసిచాల
పెనలు గొన్న చెలి మన్ననలు-వినము నుతి సేయక
అరువు మురువు గలిగిన చి-త్తరవు నెరవు ప్రతిమవలెను
ఉరవిరవై యున్న చెలిని-మరువవెరవు గానకట"

[సీ. గి. వేం - ప. 61] ఇందు కేవలం ప్రాసయతి కలదు. రెండు చరణాల్లోనూ, చరణాల్లోని ఖండాల్లోనేగాక, ఖండార్థాల్లోను ప్రాస పాటించడం జరిగింది. ఇట్లు క్షేత్రయ్య యతిప్రాసలను చక్కగావాడి తన పదాలకు సొగసును చేకూర్చాడు. క్షేత్రయ్య 'శ—ష'లకు [సీ. గి. వేం - స్వీ. 6]; 'ద—ధ'లకు [సీ. గి. వేం - స్వీ. 154; సా. 42]; 'ట—ఠ'లకు [సీ. గి. వేం - స్వీ. 86] ప్రాసకూర్చాడు. అచ్చటచ్చట యతిప్రాసలకు భంగమైనట్లు తెలుస్తోంది. "మరుని కేళిలో నన్ను - మువ్వగోపాలుడు" [7. అ. వి. - 289—పు. 188] పదంలోని 'మువ్వయే' 'మవ్వ' అని విస్సావారు.[73] కాని అందులో ఉన్నది 'మువ్వ' అనీ, యతి కొన్నిచోట్ల క్షేత్రయ్య పదాల్లో భంగ మైనట్లు చెప్పి గిడుగువారు కొన్నిటిని ఉదాహరించారు.[74] "నా మోవి అదియేమొ - అదిరిందిగదరా"; "పట్టికట్టి వేయకున్న -

73. 7. అ. వి. — పు. 3. 4.  74. సీ. గి వేం.—పు. XXXvi.

అభిప్రాయం ఇది. "బసవపురాణ పండితారాధ్య చరిత్రల ద్విపదల్లో సోమన దేశిచ్ఛందః పరంగా 'జాను తెనుగు' శబ్దాన్ని 'జాను తెనుగు ఛందం' అన్న భావంతో ప్రయోగించా"డనీ "మరి సోమన భాషాపరమైన నిర్వచనం ప్రకారం మాత్రం 'జాను తెనుగు' అంటే ప్రామాణికంగా 'దేశి తెనుగు' మాత్రమే" - అనీ నిష్కర్షగా తేల్చి చెప్పారు.[79]

కొంతవరకు సాంకేతికవివరణకో, భావస్ఫూర్తికోసమో, సందర్భశుద్ధిగా సకృత్తుగా సంస్కృతపదాలు వాడడం క్షేత్రయ్యలో కద్దు.

"పల్లవి : ఇద్దరి హృదయము లేకహృదయమైతే - వద్దనే
వారెవ్వరే ?

అ. ప. : సద్దుసేయక నా వద్దికివచ్చి -
ముద్దుబెట్టుచు మోవి యానుచు - మోదమున నన్నా
దరించుచు ॥ ఇద్ద ॥

అలివేణి ! వినవే ! యీ - యాదిత్యుని పాపము !
బలిగా ఎదురుగా - బట్టైనంచు !
చెలియరో ! వినవో యీ - జలజములలర గలికి
చిలుకల కొలికి ముద్దుల-గులికి నాతో పలుకరింపగ ॥ ఇద్ద ॥

చంద్ర మండలమున - సంకేతమే మేఘ
బృందము బాధించె నటంచు
ఇందీవరముల వికసింపవే భామ! మందగమన! మకరందభాషణ!
సుందర స్వచ్ఛందము మన ॥ ఇద్ద ॥

79. ఆర. గో. కృ. వ. — పు. 166.

చంచల మతి నీవు - చాడి మాటలు విని
వంచనల కొడిగట్టి నా వేమో !
పంచశరుని గన్న ప్రణతార్తిహరుడు మా
కంచివరదుని మంచి తనమున నెన
రుచి కరుణించగ మన ॥ కక్ష ॥

[సీ. గి. వేం. - సా. 18] ఇక్లే [సీ. గి. వేం - సా. 11; వ. 78; స్వీ. 130], మొదలైన పదాల్లో కొంచెం ఎక్కువగానే సంస్కృత పదాలు వాడబడ్డాయి. అయినా అవి ఆయా విషయ వివరణార్థమే— సార్థకంగా ప్రయోగించబడ్డాయి. వ్యస్తంగా చిన్న చిన్న పదాలే గాక రెండు మూడు శబ్దాలతోడి సమాసాలు సైతం వాడబడ్డాయి. అవి లలితమై పదానికి వన్నెగూరుస్తూ, తెనుగుదనాన్ని పరిరక్షించేవి గానే ఉన్నాయి.

కానీ తెలుగు నుడికారంతో సర్వశోభాయమానంగా జాను తెనుగులో రచించడమే క్షేత్రయ్య విశిష్టత.

"పల్లవి : వేళ కాదుర గడియ - తాళుర సామి !
అ. ప. : చాలు చాలు పది - వేలకైన నిది ॥ వేళ ॥

ఊరక నా పైని - నేర మెంచక
పోరుచు మా బావ — గాచున్నా రోయి
కూరిమి నాతోడి - కోడలి పడకింట
చేరిక యందుండ - మేర కాదోయి ! ॥ వేళ ॥

ఒద్దికతో మన - మిద్దరము కూడి
సుద్దులాడుట కిది - ప్రొద్దు కాదోయి !
పద్దుమీరగ నా - పగవారి వద్దనే
సుద్ది విన్నంత - కొద్ది కాదోయి ! ॥ వేళ ॥"

[సీ. గి. వేం. - ప. 86] ఇందులో 'వేళ' అన్న శబ్దం తప్పిస్తే, సంస్కృత శబ్దాల ప్రసక్తిలేక తేటతెలుగు మాటలతో క్షేత్రయ్య ఎంత చక్కటి పదరచన చేశాడో గమనించవచ్చు. "ఊరక, నేర మెంచక, పోరుచు, ఒద్దికతో సుద్దులాడుటకు, పగవారివద్దనే సుద్ది విన్నంత, కొద్దికాదోయి" మొదలైన పలుకుబళ్ల బలమూ, సొగసూ తెలుగుభాష తెలిసిన ఎవరికైనా అవగతమవుతుంది. మరో ఉదాహరణ —

"పల్లవి : ఎవ్వతె నిను బోధించెనో ?

అ. ప. : మువ్వగోపాల ! నాదు ముచ్చట చెల్లనీయక
ముదుగు నడపించుమని - ముమ్మాటికి చలపట్టి ॥ ఎవ్వతె ॥

ఇన్నాళ్లదాక నిరు చెవి - యెరుగనీక
నన్ను గావలసి నీవు - నడచితివి
మున్నున్న దయలేక - మొగనాలని యెంచక
కన్ను మరుగుగాని చోటు - గా చెక్కిలి చీరుమని
॥ ఎవ్వతె ॥

విరి వాసన కూడిన - వితమున నీవు నేను
అరమర లేకయుండే - యందము చూచి
విరస మెందును లేదు - వీరికని తలచి
గురుతుగా నా మోవి - గుమ్మెలు పోనొక్కుమని
॥ ఎవ్వతె ॥

హెచ్చుతమి నీ వద్ద ను - రింత సేపు నే నుండిన
వచ్చి తడవాయి మాట - వచ్చినందువు

కుచ్చితమున మా మువ్వ - గోపాల! నన్ను గూడి
యిచ్చట తెల్లవారుదాక - నింటికి పోనీయవద్దని"

॥ ఎవ్వతె

[సీ. గి. వేం. - ప. 21] ఇందులో ఏ కొన్ని సంస్కృత శబ్దాల తప్ప తక్కినవన్నీ తెలుగు మాటలు. పైని పేర్కొన్నట్లు జా తెనుగుభాష కిది చక్కటి ఉదాహరణ. 'విధము' శబ్దం 'వితము' అని ఎలా తెలుగుభాషలో కలిసిపోయిందో అర్థమవుతుంది. 'వి వాసన' అన్నపుడు 'విరి' తెలుగు, 'వాసన' సంస్కృతం — అ భావమే మనకు కలుగదు. 'విరి' పదం తెలుగులోని చక్కటి శబ్ద ఇందులో తెలుగుదనాన్ని చూపే పలుకుబళ్లకు కొదవలేదు. పల్ల చక్కటి నుడికారంతో ఆరంభమైంది. "నాదు ముచ్చట చెల్లనీక ముమ్మాటికి, చలపట్టి, ఇన్నాళ్లదాక ఇరుచెవి యెరుగనీక మొగనాలని యెంచక, కన్నుమరుగుగాని చోటు, విరివాసన కూడి వితమున, నీవు నేను అరమరలేక యుండే యందము, మాట వచ్చి నందువు" - ఈ పలుకుబళ్లు తెలుగు నుడికారాన్ని, జాతీయతన తెలుగుభాషయొక్క అంతస్తత్త్వాన్ని పట్టిస్తున్నాయి. ఇందులో "వి వాసన కూడిన వితమున నీవు నేను అరమరలేక యుండే యందము అని అంటుంది నాయిక నాయకునితో. ఈ ఔపమ్యం సహృదయ రంజకం; విరి—వాసన; నీవు—నేను; క్రమాలంకారంతో కలిసి ఉపమ లంకారం పొదిగాడీ మహాకావ్య శిల్పి. ఈ నిసర్గ మనోజ్ఞరచన మ ప్రౌఢకవులతో పోటీ పడుతూంది. ఇదే క్షేత్రయ్య భాషా వైభవం ఈ వైభవాన్ని అనంతముఖాలుగా మనం దర్శించవచ్చు.

## 3. 6. 2 సామెతలు :

ఏ భాషకైనా సామెతలు, లోకోక్తులే జీవగర్రలు. ఆ భాష తత్త్వాన్ని ఎంతగా ఒక కవి గుర్తించగలిగిందీ, అతడు వాడే లోకో

క్తులు, సామెతలను బట్టి ఉంటుంది. అతికినట్లు, సందర్భోచితంగా లోకోక్తులను తెలుగులో వాడిన కవి చేమకూర వేంకటకవి అనీ, "అప్పటికున్న సాహిత్యాన్నంతటిని చాలా సున్నితమైన విమర్శతో పరిశీలించిన కుశాగ్రబుద్ధి" అనీ తాపీధర్మారావు గారంటూరు.[80] నిజమే చేమకూర సమకాలికుడైన క్షేత్రయ్య సైతం ఆనాటి భాషా మర్మం బాగా తెలిసినవాడే. అందు కాతడు వాడిన సామెతలే పరమ నిదర్శనం. 'విరవీగుతున్న' నాయికను సఖి పరిహసిస్తూన్న "ఎన్ని పోకిళ్లబోయేవే ..." [సీ. గి. వేం. - సా. 27] అన్న పదంలో క్షేత్రయ్య మూడు సామెతలు ప్రయోగించాడు. ఇవి సహజసిద్ధంగా, సందర్భోచితంగా వాటికవి వచ్చి ఈ పదంలో చోటుచేసుకొన్నాయి. 'అల్పంపట్టాభిషేకం' అన్న సంస్కృతంలోని సామెతను వాడాడుకవి. "అల్పునికి ధరనైశ్వర్యము వచ్చితే అరదరాతిరి గొడుగు బట్టు కొన్నట్లు"; "ఎన్నడెక్కనివాడు గుర్రమెక్కితే ముందువెనుకైనట్లు" - అన్న సామెతలు సహజంగా నిత్యజీవితంలో తెలుగువాడు వాడడంకద్దు. ఇది క్షేత్రయ్య తెలుగు భాషా జీవతత్త్వాన్ని గుర్తించినవిధం. ఇది మహాకవి లక్షణం. ఇట్లే మరికొన్ని సామెతలు మనం ప్రతిదినం వాడేవే కనిపిస్తాయి.

"అరటాకు సామెతయట్లు [సీ. గి. వేం. — స్వే. 128].
ఇంటగెలిచి రచ్చగెలువవలెనను [సీ. గి. వేం. - స్వే. 82]
ఈనినపులివంటి కోపమెందుపోయెనో. [సీ.గి.వేం.-స్వే. 48]
ఏపుట్టలో ఏమున్నదో ఎరుగనైతిని [ " -స్వే. 84]
కలిమి లేములనగ కావడికుండలు [ " -సా. 63]
కాలము పోవును కడకు మాటనిలుచును[ " -సా. 15]

---

80. ధ. రా. తా - పు. 90 - 97

చలియించని నిండుకుండవలె నుండునమ్మ [ " -సా. 97]

చిలుకబూరుగపూనుఫలము కాసించి చింతించినట్లాయెనే"

[ " -స్వీ. 64];

చెరుకు తీపని వేరుతో పెకలించేవు. [ " - ప. 13]

తడయకే నొకటి తలంచితే దైవమొకటి తలచినందుకు

[ " -స్వీ. 49]

తలవ్రాతెవరికి తప్పించవశమే. [ " -ప. 31]

తెల్లని వెల్లపాలు నల్లనివి నీళ్లనుచు [ " -స్వీ. 84]

తోటకూర దొంగవలె తొలగిపొయ్యేవాడవు [ " -సా. 63]

దేవునిమనసున మ్రొక్కితే కనులదీవించినట్లు [ " -స్వీ. 119]

నాపై గలప్రేమ నీటిపై వ్రాలాయెనేమో

[సి.గి.వేం-స్వీ. 64]

పాకములోని పుడకవలెనున్న వితము [ " - సా. 56]

పామాడిజోగివలె పాయెనాబ్రతుకు [ " - స్వీ. 35]

పాలలో పాపిడికాయ పడవేసిన దైవము[ " - స్వీ. 84]

మక్కువ వాక్కున నొకటి మదినొకటి [ " -స్వీ. 131]

మేకవన్నె పులివంటి చెలులే. [ " - స్వీ. 98]

వానకాలమునాటి గరికవలెనే యీ వనితలందరు గలిగిరే

[ " - స్వీ. 64]

వాసిగ నేరుగడచితే పుట్టివానికే పొమ్మన్నమాట నిజమాయె

[ " - స్వీ. 178]

పారిద్రవతపుచెడిన సుఖములేదాయె గదా [ " - ప.64]".

ఇట్టి సామెతలను సందర్భోచితంగా వాడి తెలుగులో తన పదకవితకు ఎంతో విశిష్టతను కొనితెచ్చాడు క్షేత్రయ్య.

### 3. 6. 3 పలుకుబళ్లు :

సామెతలలాగే పలుకుబళ్లు ఆ తరం ఆ భాషాజీవితాలన్నిటిని పట్టి వ్వగలవన్న విషయం పూర్వోక్తంగా నిర్ధారించినాం. పలుకుబళ్లు లేదా నుడికారాలు అన్నవి ప్రతిభాషకూ సహజంగా ఉంటాయి. అవి దాని సొంతం. వీటిని సమంగా ఒక భాషలో నుంచి మరొక భాషలోనికి అనువదించడం చిక్కైన సంగతి. ఇదే ఆ భాష గొప్పదనానికి కారణభూతం. క్షేత్రయ్య తన పదాల్లో తెలుగు పలుకుబళ్లను కోకొల్లలుగా వాడు కొన్నాడు అనడంకంటే అవి ఆయనపదాల్లో వచ్చి చేరాయి అన డమే సముచితం. "బాగాయె నీవగలెల్ల మా-బాగాయెను" [సీ. గ. వేం. —స్వీ. 1] అనే పల్లవి ఉంది. ఇందులో పదంలోని ప్రధానభావం ఇమిడిఉంది. నాయకుడు చేసిన వగలను నాయిక దూరుతుంది. 'బాగాయె' అన్నది తెలుగు పలుకుబడి. ఈనాడు గూడ రాయల సీమపల్లెపట్టులలో 'బాగాయె, మాబాగాయె' అన్నమాటలు విని పిస్తూనే ఉంటాయి; పల్లవి, అనుపల్లవి, తరువాత చరణాంతాల్లో పునరుక్తి చేయడంలో నాయకుని చేష్టలను నాయిక ఎంతగానిందిస్తూందో- ఆ భావసాంద్రతను, గాఢతను, స్ఫూర్తిని స్పష్టం చేస్తూంది. ఇదే ఈ పలుకుబడిలోని గొప్పదనం. అంతేగాక ఆయా పలుకుబళ్లకు, తెలుగుదనాన్ని, జాతీయతను స్పష్టంచేసేసామర్థ్యం ఉంది. అది కవియొక్క భాషామర్మజ్ఞత్వంపై ఆధారపడి ఉంటుంది. తెలుగు భాషాస్వభావాన్ని పట్టి ఇచ్చిన తిక్కన తరువాత క్షేత్రయ్యనే పేర్కొనవలసి ఉంది. క్షేత్రయ్య పలుకుబళ్లన్నిటిని పరిచయించడం ఇచట సాధ్యమయ్యేపనికాదు. అందుకై ప్రత్యేకమైన కృషి, పరిశోధనా అవసరం. అదే ఒక సిద్ధాంతవ్యాసమవుతుంది. కొన్నిం టిని మాత్రమే నేనిక్కడ పేర్కొంటున్నాను. "అంగడిబెట్టుకొను, అడుగులకు మడుగులొత్తిన, అదురుబెదురులేక, అపరూపదర్శనం బాయె, అరటాకు సామెత, అరమరలేక, అరసొంపుమాటలు, అసురు

సురన్నది అడితప్పకు దోసము, ఆనజెట్టి, ఆపదలేమైన కాపురము చేసేనా; అరుదూరు చేసెనే, ఇంటిదోవ తొంగిచూడడాయె, ఇంతింత అనరాదమ్మా, ఇందు పిన్న పెద్దలెవ్వరు లేర, ఇరు చెవిచెరుగనీక, ఇసుమంతయిన తెలియదాయె, ఈ రాయబారమెంతదాక నడిపెదవే, ఉట్టిపడ్డట్లు, ఉన్నదానామీద ఉల్లమునదయ, ఊరక అలిగినానటరే, ఎక్కడిజోలి, ఎన్నాళ్లకెన్నాళ్లకు, ఏ పుట్టలో ఏమున్నదో, ఏమందు బెట్టిరో చెలులు, ఏమోనాటికాయె పోయె, ఐరాదే నేస్తము, కనులపండుగగాను, కనులాన, కన్నీరు కావేరికాలువ సుమీ, కన్నులగట్టినట్లుండు, కన్నులనొత్తుక, కన్నెత్తిచూడడమ్మా కలనైనగాని, కలకల మనినవ్వి, కాళ్లవేళ్ల బెనగుచు, కాళ్లుచేతులు తడబడు, కొండంతకాపురమే, కోపము ముక్కున నున్నది, గుత్తకానివలె, గుసగుసమని, చలించని నిండుకుండవలె, చల్లనాయెనా మనసు, చాలు చాలు పదివేలు, చిటుకునవచ్చెనే, చేతిలోచేయి వేసిన, చొక్కపడిచల్లినట్లాయె, తగవుమాలిన దైవము, తలవాకిలి ఇల్లుసుమీ, తిట్టినతిట్లె దీవెనలంటివి, తేటతెల్లమిగ, త్రోవతప్పి వచ్చితివో, దయగోరంతైన లేదాయె, దాదుఫిర్యాదేది?, దిక్కుమాలిన మోహము, దృష్టితాకు, నవ్వులకైన, నా మనసు పైపై నుండునే, నా మనసు రాయిచేసుకొన్నా, నిలువున నిలువెడు ధనము పోసినగాని, నీకోపము కొల్ల పోవద్దా, నుడువనోరాడదాయె, నూగింతైన నానవియరు, నొసటివ్రాత తప్పదాయె, నోరెత్తనైతినమ్మ, పట్టపగలు, పాలునీరువలెనె కలిసియుండక, పులిపులియైనది, పున్నెమబ్బెనినీకు, పూచిన తంగేడువలెనే, పెదవులు తడపుచు, పైపూతమాటలనేర్పు, పైపోటీచేసి, పొంచులువిని మది లోన పొంగెనట, ప్రొద్దుపోదుగాబోలు, బావిలోనీరు వెల్లువ బొయ్యీనటవే, బుద్ధిచెప్పకుందునా, మందుమాకులు, మనసు విరిచెదరు సుమీ, మగవానికెక్కడి వలపు,లే మీరేమైననార్చేరో

గాకదు, ఎదురెదురు చూచేవు, ఏమోనాటికాయె పోయె, కద్దో లేదో, కలకల నగుతా [కలకల నవ్వుతూ], కావలెనమ్మా వానికట్ల, కుయ్యకుమని, గదిమి, గ్రక్కున దానింటికేగిన తడవ, చులకగా జూచెదవు, చులకన జేసి చూచేపట్ల, చౌకచేసినాడిక, తప్పు మ్రొక్కులు మ్రొక్కుచు, తాళగలను, దేవునాన, నమ్మించుకొమ్మని, నీ కోపము కొల్లపోవద్దా, నేడది చెప్పసక్కెముగాదు, పద్దులేని, పిలువనంప, పుణ్యమయ్యీని, పైనిండ [ఒళ్లంతా] అలది, పలమేమికద్దు, మందు బెట్టి అలవాని నోరుమూసెనే, మందులమారిది, మగవాడు పాలు మారినగాని, మనసువచ్చెనా నేడు, మొన్నటాళనుండి, యాడైనా [ఎక్కడైనా], వంతులువేసి, వల్లెవాటువేసి, వాడీడకు వచ్చే మనసు లేదు, వాని కోసరమై సందెజాము వేళ, సరిప్రొద్దువేళాయె'' — ఇవన్నీ ఈనాటికీ రాయలసీమలో పల్లెప్రజల వాడుకలో మనం విన వచ్చు. ఇలాంటి వాడుకలను, పలుకుబళ్ళను, ప్రయోగాలను గాంచిన డా. టి. కోదండరామయ్యగారు క్షేత్రయ్య రాయలసీమ వాసి కావచ్చునని తలంచుతున్నారు.[81] మొదటి ప్రకరణంలో వివరించినట్లు మొవ్వ నుంచి మధురవరకు, కన్యాకుమారినుంచి గోలకొండవరకు — ఆంధ్రదేశమంతటా యాత్రచేసిన వాడు గనుక అతనిలో ఇలాంటి వాడుకలుండడంలో ఆశ్చర్యంలేదు. అంతేగాకుండా సర్కారుజిల్లాల భాషను, రాయలసీమభాషను - క్షేత్రయ్య భాషతో పోల్చిచూస్తే, రాయలసీమ భాషతోనే ఎక్కువ పోలికలు కలిగిఉన్నట్లు స్పష్టమవు తుంది. కానీ ఈనాడు సర్కారుజిల్లాల భాషలో ఎంతో మార్పు వచ్చింది. రాయలసీమలో ఈనాటికీ పూర్వరూపాలు వాడుకలో ఉంటున్నాయి. తెనుగునాట ఆనాడు వ్యాప్తిలో ఉండిన తెలుగు భాషనే క్షేత్రయ్య వాడుకచేశాడని మనం భావించవలసిఉంది. పైగా క్షేత్రయ్య రాసింది పదకవిత ; ప్రజల భాషలో రాశాడు. అంత

81. (i) భా — [ఆగస్టు — 1951. (ii) ఆ - సం. 11 — పు. 98.

మాత్రంచేత క్షేత్రయ్య రాయలసీమ వాడేమో అనుకోపనిలేదని నా అభిప్రాయం. అయినా మధుర, తంజావూరు నాయకుల కాలం నాటి తెలుగు సాహిత్య ప్రపంచాన్ని పరిశీలించాక గాని ఈ విషయం నిర్ధరించి చెప్పడం కష్టమే !

## 3.6.5 వ్యావహారిక భాష :

క్షేత్రయ్య భాషలో వ్యాకరణానికి లొంగని అసాధు రూపాలు అనేకం కనిపిస్తాయి. ఇలాంటి వ్యావహారిక రూపాలు శృంగార పదాల్లో కనిపించడంలో విప్రతిపత్తిలేదు. శృంగారపదాల్లో గ్రామ్యోక్తులుండవచ్చునని అన్నమాచార్యుల సంకీర్తన లక్షణంలో చెప్పబడ్డది. బహుజనపల్లి సీతారామాచార్యులుగారు, సూర్యారాయాంధ్ర నిఘంటుకారులు క్షేత్రయ్య భాషను ప్రామాణికంగా పరిగణించి ప్రయోగాలు చూపించడం చూడగా క్షేత్రయ్యకు ఎంతటి మహత్తర స్థానం - ఆంధ్ర సాహిత్యంలో—ఇచ్చారో అవగత మవుతుంది. ఇందుచేత క్షేత్రయ్య వ్యావహారిక భాషను వాడుక చేశాడని వ్యాకర్తలు, పండితులు ఈసడించుకో పనిలేదు. నిజానికి అలాంటి రూపాల్లోనే భాషాతత్త్వం, ఆంధ్రజాతీయత స్పష్టమవుతా యనడం అసంగతంకాదు. అంటే ప్రజల భాషను - జీవద్భాషను — ప్రయోగించాడు క్షేత్రయ్య.

"ఏనాటికైనా నీ కెమ్మోవి - విచ్చితివని కోపమా
ఆనీని, చప్పరించీని, - అపహరించీనా !
నే నెంతో విన్నవించిన - నీవు వినవు వినకున్న
మాను మందువల్ల మా - మనసు నొవ్వగ లేదురా".

[సీ. గి. వేం—స్వీ. 105] ఇందులో కెమ్మోవిని 'ఆనీని, చప్పరించీని, అపహరించీనా, అని నాయిక అంటూంది. ఈ వ్యావహారిక రూపాలకు

సరిగా 'అనునా, చప్పరించునా, అపహరించునా, అని ప్రశ్నార్థక గ్రాంథిక రూపాలు వాడితే పై వ్యావహారిక రూపాల్లోని స్ఫూర్తి చెడుతుంది. కారణమేమంటే వాటి ప్రయోగంలో నాయిక యొక్క అలక్ష్యం, గర్వం భాసిస్తున్నాయి. ఆ భావస్ఫూర్తి గ్రాంథిక రూపాలవల్ల సాధించడం కష్టం. అందుచేత లోకంలోని వాడుకనలా వాడినప్పుడే ఆ ప్రయోగానికి బలం, భావనిర్భరమైన శక్తిచేకూరి సహృదయాలను రంజింపజేస్తాయి. ఇట్టివి కోకొల్లలు — "అందేను, అనుకొంటు, అమ్మికొనీనా, అలమీని, ఉండుమనేరు, కలసీని, గుమ్మీని, చింతచేసేను, చూచేవు, చెప్పేరు, చేతునో, తీర్చేరు. పువ్వు బాణమేసి, మళ్లి, మూలదాచీనా, మొక్కీని, వలపనేది, శాన, సేనచేసితే" మొదలైనవి. సంధులు: కలిసేటంతలో, నమ్మికించేటంతలో, పతి యూరి కరిగేటప్పుడు, పైకొనేటంతలో, మాటాడేటంతలో, సరసమాడేటంతలో, పడకింటిలో, తానుసేవించు టూడిగ మెల్ల; మందగమ ననుపేరు [మందగమన + అను పేరు]; ద్వంద్వ సమాసం : "అత్త మామ" [అత్తమామలు అనడానికి] [సీ. గి. వేం—ప. 73]; "పుణ్య పాపము" ['పుణ్య పాపములు' అనడానికి] [సీ. గి. వేం—ప. 39]. ఇలాగా కొన్ని అసాధురూపాలు క్షేత్రయ్య పదాల్లో కనిపిస్తున్నాయి. అవి సందర్భోచితంగా ఆ పదాల్లోని రస భావపుష్టి కుపకరిస్తున్నాయని స్పష్టమవుతుంది. పైని పేర్కొన్న 'సేన' మొదలైనవాటికి గిడుగువారు ప్రయోగాలు చూపించారు.[82]

### 3 . 6 . 6 కొన్ని వింత ప్రయోగాలు :

క్షేత్రయ్య పదాల్లో కొంతవరకు అపూర్వంగానూ, కొంత వింతగానూ ఉన్న ప్రయోగాలు కొన్ని క్వచిత్తుగా కనిపిస్తున్నాయి.

"వాడి వేడి శరీరముల వంటి నా చురుకు మాటలను

వాడుగాగ తీసుకొని వచ్చి నా విడిచెనె" [సీ.గి.వేం ప.48]

ఇందు నాయిక అంటూంది నాయకుని సిగ్గుమాలిన తనాన్ని గురించి. "వాడి వేడి శరీరములవంటి చురుకుమాట" లట! "వాడి శరములవంటి మాట" లనడం సామాన్యమే. కానీ వాటితోపాటు "వేడి" సైతం ఉన్నదట. అవి మొదటే చురుకుమాటలు—వాటికి వాడి, వేడి విశేష ణాలను వాడి క్షేత్రయ్య నాయిక మాటల చురుకుదనాన్ని స్పష్టం చేశాడు.

"ఆసలాడి [ ఆశజెట్టి (సీ. గి. వేం—స్వీ—140) ]; కోపము సేయ వచ్చునా [కోపగింపవచ్చునా ( ,, స్వీ—101) ]; దయవాడవనెనట [దయగలిగివాడవనెట ( ,, స్వీ—157) ]; దాగియుండుకొని [ దాగియుండి ( ,, స్వీ,—37) ]; నను వంటిదట [ నా వంటిది ( ,, సా. 37 ]; పరవాసేయగ [ క్షమింపగ ( ,, స్వీ—154) ]; పొంచులు విని[ పొంచి వినుటలు ( ,, ప,—41 ]; పొగరుమును న్నారు. [ పొగరుతో నున్నారు ( ,, — స్వీ—9]; ఇట్టివే కొన్ని పదాలు : ఘుట్లు [సా. గి. వేం — సా. 55] : ఇవి నగాలని తలంచారు దేవులపల్లి వారు.[83] కానీ బంగారపు ముద్దలు కావచ్చు. "బంగారు ఘుట్లు" అన్న ప్రయోగం ఈనాడు రాయలసీమలో ప్రచారంలోఉంది. తాణన; [ సీ. గి. వేం—సా. 42 ]; జేరం [ సీ. గి. వేం — సా. 155 ] : వీటి అర్థాలు సరిగా తెలియడంలేదు. పెకాసు [ సీ. గి. వేం-సా. 42 ] : బాగుగా అనుకోవలసి ఉంది.

83 రా. రా. దే — పు, 37.

### 3.6.7 అన్యదేశ్యాలు [ Loan Words ]:

చివరిగా అన్యదేశ్యాలగూర్చి చెప్పడం అవసరం; దీనితోనే క్షేత్రయ్య పదాల్లోని అనంతముఖాలైన భాషా వైభవం సంపూర్ణమైన అవగాహనకు రాగలదు. అన్యభాషా సాహచర్యాలవల్ల ఒక భాష ప్రభావితం కావడం, తన్మూలంగా పరిపాలనా విషయంగానూ, సాంస్కృతికంగానూ అన్యదేశ్య భాషా పదాలువచ్చి చేరిపోవడం సర్వసామాన్యమే. అదే విధంగానే క్షేత్రయ్య భాషలో అన్యదేశ్యాలు కొన్ని చోటు చేసుకొన్నాయి. క్షేత్రయ్య మధుర, తంజావూరు, గోలకొండలలో ఆశ్రయం పొందినవాడు గనుక ఆనాటి మహమ్మదీయుల సంపర్కంతో ఉర్దూ, ఫార్సీ మొదలైన భాషా పదాలు క్షేత్రయ్య భాషలో చేరినట్లు స్పష్టం కాగలదు. "కస్తు, జాగా, తంబూర, తురాయి, దట్టి, దాదుఫిర్యాదు, దిమాకు, పటాని, పరవా (ఫర్వా), పావడ, పావాలు, పైఠాణి, బారీ, బుక్కా, బుట్టాలు, బురుసు, రవసెల్లా, రుమాలు, వరాలు, సిస్తు, సీమాటి"—ఈ పదాలు క్షేత్రయ్య భాషలో సందు చేసుకొని చేరిపోయి తెలుగు పదాలో అన్నట్లు ఇమిడిపోయాయి.

పై సుదీర్ఘ పరిశీలనవల్ల క్షేత్రయ్య పదాల్లో కవిత చెప్పినా, ప్రౌఢకవుల కే మాత్రం తీసిపోడనీ; పై పెచ్చు మహాకవికి, మహాకావ్యశిల్పికి ఉండవలసిన లక్షణాలన్నీ కోకొల్లలుగా ఉన్నాయనీ అవగతమయి, మువ్వగోపాలునిపై మోహంగొని "పలుకు బలుకుకు దేనె లొలుక బలుకుచు" - శృంగార పదాలు రచించి, 'ఆంధ్రావళి మోద ముంబొరయ' తనియింపజేసిన నిసర్గ మనోజ్ఞ అమృతకవితా ఝరి క్షేత్రయ్య కవిత అని వ్యక్తమవుతుంది.



# 4. శృంగారం - మధురభక్తి

ఇంతవరకు క్షేత్రయ్య పదాల్లోని కవిత్వాన్ని వివిధ దృక్కోణాలనుంచి పరిశీలించి వైశిష్ట్యాన్ని సుస్పష్టం చేయడం జరిగింది. క్షేత్రయ్య పదాలు శృంగార రసఘుళికలు. శృంగారరసం ఈ పదాల్లో ఎలా పరిపోషించబడ్డదో వివరించి, మధురభక్తి ప్రపూరితుడైన క్షేత్రయ్య ఆత్మనివేదనమెలా చేసుకొన్నాడో సువ్యక్తం చేయడమే ఈ ప్రకరణోద్దేశం.

స్థూలదృష్టికి క్షేత్రయ్య పదాలు లౌకిక శృంగార పూరితాలుగా కనిపించడంలో ఆశ్చర్యంలేదు. కానీ సూక్ష్మంగా పరిశీలిస్తే ఇవి భగవత్పరాలనీ, ఆత్మనివేదనైక దృక్పథాలనీ, మధుర భక్తి మధురమధురంగా మనకవగతమవుతుంది. అయినా రాజాంకిత పదాల్లోను, మువ్వగోపాలముద్రలేని పదాల్లోను మాత్రమేకాక, మువ్వగోపాలముద్రతోగల పదాల్లో సైతం శృంగారం లక్షణానుసారం పరిపోషించబడడం మనం గమనించవచ్చు. అయితే ఇందులోని శృంగారం కేవలం లౌకికం కాదా? అన్న ప్రశ్న తలెత్తుతుంది. కానీ అది లౌకికం కాదనీ, మధురరస పరిప్లావితుడైన క్షేత్రయ్య శృంగార రసాధినేత అయిన గోపాలదేవుని యందు ఆత్మనివేదనం గావించిన విధమనీ స్పష్టం కాక మానదు.

## 4. 1 శృంగార ప్రాధాన్యం :

మొదట క్షేత్రయ్య కేవలం శృంగార పదాలు రచించడానికి కారణమేమన్న ప్రశ్న ఎదురవుతుంది. 17 శ. లో మధుర, తంజావూరు రాజ్యాల కధినేతలైన నాయకరాజులు శృంగారరసాన్ని సమాదరించి, అనేక కవులను పోషించి శృంగార రసపుష్టమైన కావ్య రచనకు దోహదం చేశారు.[1] ఇంతేకాదు. ఆ సమయంలోనూ, అంతకుముందూ—కన్నడ దేశంలో భక్తి ప్రతిపాదకమయిన పద కవిత వెలయగా, తెలుగుదేశంలో శృంగార పదకవితలు రచితం కావడానికి రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు ఇలా సెలవిచ్చారు. "కన్నడమున ఈ వాఙ్మయము భక్తి మత ప్రధానముగా వెలసినది. తెలుఁగులో ఇది శృంగార మయముగా విజృంభించినది. కన్నడమున శృంగార పదములును, తెలుఁగున భక్తి పదములును చాల అరుదని చెప్పునంత గౌణస్థితికి ఆ రెండు రసములు దిగినవి. ఈ వింతకు నిజమైన హేతు వేమో చెప్పలేను. ఒక ఊహ సాహసించి చేసెదను. కన్నడ వాఙ్మయమున అంతకు చాలపండ్లక్రిందనే శైవవైష్ణవ మత ప్రచారకులు రాజాశ్రయము నాశించక సామాన్య జనోద్బోధకమునకై సాహిత్యమును సృజించిరి. తెలుగు వాఙ్మయ మన్ననో మొదటినుండియు రాజులపెట్టుపోతల చేతనే బ్రతికి బైటబడినవి. తెలుగుదేశమున రాజుల సంఖ్యయు ఎక్కువ. రాజులు సహజముగా రసికులు. రమణీ కుసుమాయుధులు. అందును తెలుఁగురాజులు తమ శౌర్యమును పొగడించుకొనునప్పుడు గూడ, శత్రురాజులు స్త్రీలని, తాము పురుషులని చాటించుకొని తృప్తిపడినవారు, 'రాయవేశ్యా భుజంగులు' కాని రాజులు తెలుఁగులో పలువురు లేరు. కాబట్టి వారి యాజ్ఞచే, ప్రోత్సాహముచే పుట్టిన రచనలలో శృంగారము నిండి

---

1. 16. ఆం. సా. అ.— పు. 31

యుండుట వింతకాదు. మఱియు భగవత్ప్రేమే భక్తుని శృంగార ముగా మాఱుట అనేక మతములలోఁ గల సహజ పరిణామమువలు. మఱి దానికి రాజ సన్మానముగూడ లభించెనేని అడుగవలయునా? కావున తెలుఁగున పదములలో పేరు దైవభక్తి యైనను సద్భావము మనుష్య శృంగారమే యైనది.[2]" దీనికి తోడు క్షేత్రయ్య జీవిత రహస్యం, జీవిత తత్త్వం సైతం కారణాలని తలంచవలసిఉంది. ఆతని జీవితం ద్విధావిభక్తమైనట్లు మనం ముందే తెలుసుకొన్నాం. క్షేత్రయ్య పూర్వాశ్రమంలో మహాశృంగార ప్రపన్నైక మతి; తోడు చితంగా రాజాశ్రయాల్లో కేవలం శృంగార ప్రధాన పదాలు చెప్పి మెప్పించాడు. తాను శృంగారజీవితం విచ్చలవిడిగా గడిపాడు. అట్టి వ్యక్తిలో ఈ శృంగార బీజం మహావృక్షమయ్యేసరికి భక్తిమార్గంలో ఒక మహా సంఘటనతో మలుపు తిరిగింది. ఆ మధురభక్తి రసపరి ప్లావితుడైన క్షేత్రయ్యలో వాక్కు, పదజాలం పూర్వవాసనావాసి తమే అయినా పూర్వశృంగారం మాత్రంకాదు. జీవాత్మపరమాత్మలో లీనం కావడానికి పడిన తపన, తహతహ కనిపిస్తుంది. స్థూలదృష్టికి లౌకికంగా కనిపించే ఈ శృంగారం, సూక్ష్మ దృష్టితో పరికిస్తే ఎలా మధురభక్తిగా గోచరిస్తుందో తెలుసుకొందాం.

## 4. 2 శృంగారరసం :

విభావాను భావ వ్యభిచారి భావాల సంయోగం వల్ల రస నిష్పత్తి అవుతుందని భరతుని రససూత్రం![3] ఇట్లే విభావానుభావ సాత్విక వ్యభిచారిభావాలచేత ఆస్వాద్యమానమైన స్థాయిభావమే

---

2. ఆ. కృ. శ. రా. — ఆం. ప (1942–43) పు. 12.

3. 'విభావాను భావవ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః'—నాట్యశాస్త్రం.

రసమని దశరూపకం.[4] స్థాయిఅంటే స్థిరంగా ఉండేది. స్థాయిభావమంటే రసస్ఫూర్తి వరకు సహృదయ హృదయాల్లో నిలిచి ఉండేది. కావ్యపఠనంవల్ల సహృదయుల్లో కలిగే ఆనందమే రసమనబడుతుంది. విభావం—ఆలంబన విభావమూ, ఉద్దీపనవిభావమూ అని రెండు విధాలు. నాయికానాయకులు ఆలంబన విభావం. రసాన్ని ఉద్దీపింపజేసేది ఉద్దీపన విభావం. ఇది సహజమూ, తటస్థమూనని రెండు విధాలు. యౌవనం, భూషణాలు, చేష్టలు మొదలైనవి సహజోద్దీపన విభావాలు. మలయానిలం, చంద్రుడు తటస్థోద్దీపన విభావాలు. విభావం కారణరూపంతోను, అనుభావాలు కార్యరూపంగాను ఉంటాయి. మనోభావాలైన హావభావాదులూ, అయాత్మజాలైన శోభా, కాంతి, దీప్తి మొదలైనవీ, స్వభావజాలైన లీలావిలాసమున్నగునవీ సాత్త్విక భావాలనబడతాయి. ఇతరశృంగార చేష్టలు అనుభావాలనబడతాయి. "నాయికానాయకుల హృదయములం బుట్టు సంభోగవిషయమగు నభిలాషకు (లేక కామమునకు) రతియని పేరు. స్త్రీ పురుషుల అన్యోన్యాలంబనముగల ప్రేమాఖ్యమగు చిత్తవృత్తి విశేషము రతియని రసగంగాధరము. ఈ రతిఅంకుర పల్లవ కలికాప్రసూన ఫలభోగావస్థలయందు ప్రేమ, మాన, ప్రణయ, స్నేహ, రా, గానురాగములను పేర్లతో పేర్కొనబడుచుండును. ఈ యాఱవస్థలలో మొదటివైదును పూర్వరాగమందును, ఆఱవదైనభోగము సంభోగమందును కలుగుచుండును."[5] ఈ శృంగార రసం-సంభోగశృంగారం, విప్రలంభ శృంగారం అని రెండు విధాలు. సంభోగశృంగారం కేవల సురతరూపంలోనేగాక దర్శనం, ఆలింగనం, చుంబనం మొదలైన అనేక విధాలుగా ఉన్నా వీటన్నిటికీ కలిపి

4. "విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాదుత్వం స్థాయి భావో రసస్స్మృతః" - దశరూపకం.

5. 1౬. ఆం. సా. అ — పు. 74.

సంభోగశృంగారం అన్నారు. విప్రలంభమంటే వియోగం. ఇది అభిలాష (అయోగలేక పూర్వరాగ) విప్రలంభం; మాన (ఈర్ష్యా) విప్రలంభం; విరహవిప్రలంభం; ప్రవాస విప్రలంభం-అని నాలుగు విధాలు. మానవిప్రలంభం-ప్రణయమానమూ, ఈర్ష్యామానమూ వని రెండు విధాలు. ఇట్లీ శృంగారరసం ఇన్ని విధాలుగా నిర్వచించబడింది.

పైని వివరించిన శృంగార లక్షణాలన్నిటికి లక్ష్యాభూతం క్షేత్రయ్య పదాలు. మూడో ప్రకరణంలో ప్రసక్తాను ప్రసక్తంగా శృంగారం, విరహాలకు సంబంధించిన కొన్నింటిని వివరించడం జరిగింది. క్షేత్రయ్య పదాలెన్నో అన్నీ కూడ అన్ని ముక్తక కావ్యాలు. వేటికవే స్వయంసంపూర్ణమై రసభావాదులను పరిపోషిస్తూ ఉండడమే వాటిలోని గొప్పతనం. "అమరుక శతకంలోని శృంగారము కామినీకాముకుల గాఢప్రణయమును భాసింపజేస్తుంది. అమరుక దేవు డొక్కడే నాయకుడు. నాయిక ఒకతేకాదు. అనేకలు. అనేక రీతులవారు...కాని తెలుగు పద రచనములో వున్న రమ్యత అందులోలేదు. అందులో ముఖ్యముగా క్షేత్రయ్య పదములలో అట్టి రమ్యత హృదయగోచరం కాగలదు. ఆ రమ్యత సహృదయుని మనస్సులో గిలిగింతలు పెట్టగల సామర్థ్యం గలది."[6] క్షేత్రయ్య పదాల్లో దివ్యశృంగారం వర్ణితం. "నాయకుడు ఒక్కడు భగవానుడు. అతని విషయమై ఆయా పదములలోని నాయికలకు అనురాగమున్నది. ఆ సమయమునందు ఆ నాయిక మనసులో అన్యరాగములేదు....ఆ నాయికయందు నాయకుడు రతిచిత్తము కలవాడు. అందుచేత ఆ నాయికానాయకుల రతిస్థిరము. అదిస్థాయికృతమగును. భావము నుద్దీపింపజేసే సామగ్రి ప్రతిపదములోను

6. భా – (సెప్టెంబరు, 1952), పు 288.

పుష్కలముగా ఉన్నది. నాయకునికి నాయిక, నాయికకు నాయకుడు ఆలంబనము. ఆయా నాయికల హావభావాది శృంగార విలాసాదులు అనుభావములు. నాయికస్థాయి రతిసాగరములో అసూయాదులు, శంకాదులు, ఉత్సాహాదులు లీనములై అనితర శోభను కూర్చు చున్నవి. ప్రియసందర్శనాదులచే వివశయయిన నాయిక సాత్వికస్థితి యుండనే యున్నది...విభావాదుల సంయోగమువలన రతిస్థాయి శృంగారరసమయి ప్రతిపదమునను సహృదయులకు చర్వ్యమాణమగు చున్నది[7]." ఏ పదంలోని శృంగారమైనా ఈపై వివరణకు సరిపో తుంది. ఇంతేగాక "అమరుక కవేః ఏకః శ్లోకః ప్రబంధశతాయతే" అన్నట్లు ప్రతిపదం శతశృంగార ప్రబంధాలతో సమానం. కాని ఉదా త్తాన్విత భావస్ఫోరకమై నిర్మలప్రేమతో గూడిన శృంగారం ఈ పదాల్లో మనం చూడగలం. దీన్నే మనం అమలిన శృంగారం అన వచ్చు. ఒక నాయికనాయకుని ఉత్తమగుణగణాల్ని తెలుపుతూంది.

"పల్లవి : దూరమెంచక యిటుల సామిపై - దూరుతేల బలికేరే ?

అ. ప : తారుమారు మాటలేల నాడేరే? - తరుణులార !
తాళరె ఇక చాలును ॥దూర॥

ఎన్నదగిన చెలులతోడ జెలిమిగ - నెన్నడైన బలికినా?
కన్నెలెందరెన్ని వగలుచేసిన - కన్నులెత్తి చూచినా ?
వన్నెమీర నెవరేమి పల్కిన - విన్నవిననిరీతి నుండుసామి!
చెన్నుమీర నా చెలిని గూడెనని - చిన్నమాటలేల నాడేరే
॥దూర॥

వారి యిండ్లకెల్ల నాసామి - వలసిపోయినాడా?
కోరికోరి ఖేదనములొసంగి - వారి వేడుకొన్నాడా?

---

7. పైదే. పు. ౨౮౹.

వారిజాక్షి తావద్దికి రమ్మని - వలసినోలసి చొక్కితినని
పిలువగ
చేరబోయి దాని జూచి నేనని - మీరి భ్రమసికూడనే పోలు?
తెలియదు ॥దూర॥
కంతుజనకు మువ్వగోపాలు డే - కాంతమునను మును నన్ను
గూడి
కంతుకేళి లోపల బిగికౌగిట - గళలంటి మెలగుచును
వింతవింతవగకులుక-స్వామి యే - యింతికైన, దక్కునా"?
యూరక
రంతులేల జేసేరే? మిక్కిలి రమణులార? వాని మనసు
దెలియక ॥దూర॥"

[సీ. గి. వేం-సా. 61] ఇందులో నాయిక నాయకుని సుగుణాల్ని ఏకరువుపెట్టి చెలికత్తెలను మందలిస్తోంది. మరో నాయిక "అక్కరో! యోర్వనివారు సరసుడు గాడని ఆడుకొంటే ఆడుకొనేరు" [సీ. గి. వేం—ప.1] అన్నపదంలో నాయకస్మరణ, కీర్తన, దర్శనాలవల్ల ఎంతోసంతోషం కలుగుతుందని చెప్పి, అమేయమైన ఆనందాన్ని ప్రకటిస్తుంది. ఇంతకంటె నిర్మలమైన శృంగారం ఎక్కడుంటుంది. "నా మనసు వంటిదే" [సీ. గి. వేం-సా. 62] పదంలో నాయకునిపై గల నిర్మల అనురాగం; "తెలిసి తెలియలేక పలికేరు చెలులు" [సీ. గి. వేం. -స్వా. 115] అనేపదంలో చెలులను మందలించడంవల్ల నాయకునిపై గల ప్రేమా; "ఇద్దరివలెనే గూడి" [సీ. గి. వేం. స్వా 56] పదంలో ఇద్దరి ఒద్దికా - వర్ణించబడ్డాయి. ఇక్కడ నాయకుడు నిర్మలప్రేమానురాగాలు గలవాడుగా కనిపిస్తాడు. "అలిగి ఏలయిందు వచ్చితి", "ఎటువంటి స్త్రీలపొందైన హితవై యుండునా?", "ఏమి సేతుదు మోహమెటువలె దీరును" [సీ. గి.

వేం—స్వీ. 155, 165, 168] మొదలైన పదాల్లో నాయకుని నిర్మల మైన ప్రేమ అభివ్యక్తమవుతుంది. శారీరకమైన కాముక శృంగారం కంటె ఇందులో వ్యక్తమైన నిర్మలప్రేమ మహత్తరమైనది.

అయితే కేవల శృంగారం - సంభోగశృంగారం - వర్ణితమైన పదాలు అనేకం ఉన్నాయి. "నిదురవచ్చునా కంటికి చక్కనిసామి"; "నేరమా కొమ్మా! వాడెందుకే చేరరాడమ్మా": "ఎన్నటికో నా కొమ్మను జూచేది" [సీ. గి. వేం - స్వీ. 123, 179, 77] ఈ మొద లైన పదాల్లో సంభోగ శృంగారం వర్ణించబడ్డది. వీటిలో ఆలింగనం, చుంబనం, కుచగ్రహణం, రతి మొదలైనవన్నీ వర్ణించబడ్డాయి. "మగువ తన కేళికామందిరము వెడలెన్" [ సీ. గి. వేం. - ప. 19 ] పదంలో రత్యనంతరం నాయికాస్వరూపమూ ,"ఒక్క ఘడియకే యిలాగైతే యిదేటి ఘనమే" [ సీ. గి. వేం. - స్వీ 99 ] పదంలో శృంగార సాత్విక భావాలు చక్కగా అభివ్యక్తంచేయడం జరిగింది[8]. ఇలాగా సంభోగశృంగార పదాలు ఎన్నైనా ఉదాహరించవచ్చు.

నాల్గువిధాల విప్రలంభ శృంగారమూ క్షేత్రయ్య పదాల్లో ఉంది. "వినా విప్రలంభేన సంయోగః పుష్టి మశ్నుతే" అని లాక్షణిక మతం. అంటే విప్రలంభం లేకుంటే సంయోగం పుష్టి, తుష్టి పొంద దని అర్థం. ఈ విప్రలంభశృంగారం, సంయోగశృంగారం కంటే ఉదాత్తమైంది. కారణం సంయోగశృంగారంలో అసభ్యత కవకాశ ముంటుందేమోకానీ ఇందులో దానికివీలులేదు. కనుకనే ఇది ఉదాత్తం. మహాకవులీ విప్రలంభ శృంగారాన్ని ఉదాత్తంగా పోషించి అనౌచిత్యాన్ని పరిహరించడం జరిగింది. అదేవిధంగా క్షేత్రయ్యసైతం మనోజ్ఞంగా ఈ విప్రలంభశృంగారం పోషించినట్లు వ్యక్తమవుతుంది; కారణం తానే నాయికగనుక. ఇంతకుముందే

8. 16. ఆం. సా. అ.—పు. 58.

మూడో ప్రకరణంలో విరహావస్థ ననుభవిస్తున్న నాయికానాయకుల మనోవేదనను కొంతవరకు ప్రస్తావించడం జరిగింది. అభిలాష విప్రలంభం:—ఒక నాయిక నాయకునిపై గల అభిలాషను ఎంతో మనోజ్ఞంగా స్మరిస్తుంది; విరహాన్ననుభవిస్తోంది—

"పల్లవి : ఎటువంటి వాడే వాడు ఓయమ్మా వాడు - ఎన్నడును
ఈ వీధిని రాడు

అ. ప. : కుటిల కుంతల మువ్వ - గోపాలుడట పేరు ॥ ఎటు ॥
నల్లని మేను వాడట - నయములెన్నో చేసునట
చల్లగా మాటాడునట - సరసుడు వాని సొమ్మట
కల్లకాదట వాడు — కళలంట నేర్చునట ఓ యమ్మా
వాడు ॥ ఎటు ॥
బంగరు దుప్పటి వాడట - పంతములాడుకొన్నాడట
అంగన లెందరినైన — అలయక కూడునట
సంగీతలోలుడట - చాలా ఈవిగాడట ఓయమ్మా
వాడు ॥ ఎటు ॥
నన్నే లేమన్నాడట - నాదు చిన్నెలు తెలిసినాడట
మొన్న నిందు వచ్చినాడట - మువ్వ గోపాలుడట
చిన్న వయసు వాడట - చెలియ ! అందగాడట ఓయమ్మా
వాడు ॥ ఎటు ॥"

[సీ. గి. వేం — సా. 30] ఈ పదంలో అభిలాష విప్రలంభం అంటే పూర్వరాగం స్పష్టంగా పరిపోషించబడింది. ప్రణయమానం : ప్రణయమాన అయిన నాయికను సఖి ఉపాలంభిస్తోంది క్రింది పదంలో - "ఈ లాగటనే బుద్ధి ? ఇందు బింబాననా" [సీ. గి. వేం —

స్వీ. 63]. ఇందు నాయికా ప్రణయమానం, దానివల్ల విరహావేదన స్ఫురిస్తున్నాయి. ఇట్లే "ఊరకే చలము చేసేవేరా?" "దక్కితినంటే దయసేయవు" [సీ. గి. వేం — ప. 15, 46] పదాల్లో నాయకుని ప్రణయమానం చిత్రించబడ్డది. ఈర్ష్యామానం : ఇంతకంటే ఈర్ష్యా మానం మహాద్భుతంగా వర్ణించబడ్డది. ఇందు కుదాహరణలు కోకొల్లలు. "ఎవతె తాళునమ్మా! యీ నడత-లేమందునేకొమ్మా!" [సీ. గి. వేం—స్వీ. 6] ఇందులో ఈర్ష్యామాన విప్రలంభ శృంగారం ఎంతో మనోరంజకంగా వర్ణితమైంది. ఇట్లే "అడుగరమ్మా..."; "నా దోవకురాకురా" [సీ. గి. వేం—స్వీ. 4, 121] మొదలైనవనే కోదాహరణలీ ఈర్ష్యామాన విప్రలంభ శృంగారానికి చూపించవచ్చు. విరహ విప్రలంభం : ఈ విరహ విప్రలంభ శృంగారానికి సైతం ఉదాహరణ లనేకం ఉన్నాయి. వెన్నెలకాకు గావడం, మలయానిలం మంటలు రేపడం, కోయిల పలుకులు, తుమ్మెదరొదలు కటువు గావడం, శైత్యోపచారాలు మొదలైన ప్రబంధ పద్ధతిలోని విరహ వర్ణన లనేకం ఇందున్నాయి. నాయికా నాయకులు విరహవ్యథా భరితమనస్కులై చెక్కిట చేయిచేర్చి ఉండడం సామాన్యమే. దుర్భర విరహవేదనకు లోనైన నాయిక స్థితి —

"ఇంత విరహము? - పలుక వెరపగు - యింతి తానెటు
సైచునో?
కాంతు డద్భుతడనగ నిన్నన - కారణమేమి? శ్రీవీరరాఘవ
॥ ఇంత ॥

గంధమెందిన గంధవతి కుచ - కలశముల గన్నీటి వెల్లువ
చింది కళపెళలుడికి చెలిపై - జింది మీనై మిట్టి పడినది!
కందెహారము నీలసరమై - కర్పూరము నీ రాజనంబై
యుందనుచు రా చిలుక వెలువడి
మందిరము దెస మరలిచూడదు ॥ ఇంత ॥

చంచలేక్షణ ! పెంచినసంశయము - కాంచనసమ్మన పలుకుల నమ్మగ
కొంచురాగ నూర్పుసెగలను - మించ పొరగను గాంచు మీ
మంచునీరు కషాయముగ నటువంటి - మించుమనతి
వేలుపుచయ్యాకే !
మించునని చెంగలువ చెలి కో — పించిపైచిన సుద్ధగనుమీ
॥ ఇంత ॥

ధ్యానమున నిను జేరి అమృత—పానమున కళలూరి కలయుదు
మేను మరచినదేమొ తెలియదు! - చూన పరవశగతిని ఉన్నట!
నేను కావలసినదె కాక మ - న్నించి కరుణించి అభి
మానమున మా చెలికి ప్రాణ - దాన మొసగు శ్రీమువ్వ
గోపాల ॥ ఇంత ॥"

[సీ. గి. వేం—సా. 11] నాయికా విరహ జ్వరంతోడి వేడితీవ్రత నీ పదంలో కవి వర్ణించాడు. ఇక్కడే పురుషవిరహం సైతం ఉంది. ఇంక ప్రవాస విప్రలంభం : ప్రోషితపతిక అయిన నాయిక చెలితో తన విరహాన్ని గూర్చి "ఏమని తెలుపుదు - నేలాగు తాళుదు - నేమిచేయునే? చెలియా !" [సీ. గి. వేం.-స్వీ. 85] అని చెప్పివాపోతుంది. ఇందులో ప్రవాస విప్రలంభం చిత్రించబడింది. ఇక్కడే "అట్లేయుండేసు సుమీ," [సీ. గి. వేం — ప. 2] పదంలో భవిష్యద్విరహం వర్ణితం. ఇంకా క్షేత్రయ్య పదాల్లో నాయికా నాయకుల అనునయాలూ, దూతీ ప్రబోధమూ, ఉపాలంభనా మొదలైనవెన్నో ఉన్నాయి. ఇలాగా క్షేత్రయ్య సమస్త విధాల శృంగారం అనంతముఖాలుగా దర్శించి, వర్ణించి తరించాడు. "క్షేత్రయ్య పదాలలో ప్రతిపంక్తియందును, ప్రతి పదమునందును శృంగారమే ప్రత్యక్షమగుచున్నది. శృంగార రసమును ఇన్నితీరుల, ఇంత వైవిధ్యముగ, శృంగారనాయికలను ఇన్నిరకాలుగా

ఇంత నిపుణముగా చిత్రించిన ఆంధ్రకవీశ్వరుడు మరొక్కడు లేడని చెప్పిన అతిశయోక్తి కాజాలదు."[9] అయినా ఇది కేవలం స్థూలదృష్టికి దృగ్గోచరమయ్యే లౌకికశృంగారం. కానీ సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే అలౌకిక శృంగారం స్పష్టమవుతుంది. ఈ సందర్భంలో రాళ్లపల్లివారి మాటలుల్లేఖించదగ్గవి. "ఇక 'గోపాలుడు' విశ్వశృంగార నాయకుడు. ఆతని శృంగారము అందరి శృంగారములకును బీజమైన పరతత్వము. ఆంధ్ర రసికులలో అగ్రగణ్యుడైన జగన్నాథపండితరాయడు 'కృష్ణ' అను రెండక్షరములందే అసాధారణమైన తీపున్నదన్నాడు-కృష్ణశబ్దము కంటె "గోపాల" శబ్దము అర్థమందు గొప్పది. నాలుకకు చెవికి అందమైనది. దానికితోడు గోపాలబాలుని కాలి "మువ్వ" కింకిణీ నాదము తరితీపులుగా ఆధారశ్రుతియై యున్నది. మీదుమిక్కిలి కవుడులేని పలుకుల దేసిభావముల స్నిగ్ధత, "వాక్చరీణాం" అని గీతాచార్యుడే పొగడిన స్త్రీ హృదయమార్దవము, రాగతాళముల సాంప్రదాయిక రక్తి, క్రమపరిణతమై నిలిచిన క్షేత్రయ్యయొక్క ఆధ్యాత్మికమైన అవధూతభక్తి - ఇవన్నియు కలిసి మెదిగి ఆయన పదములు తెలుగు తెలిసినవారికి అలౌకిక శృంగారానుభవము నియ్యగలిగి అజరామరములై యున్నవి."[10] ఈ అలౌకిక శృంగారమే మధురభక్తి; ఇది క్షేత్రయ్య పదాల్లో నిండి నిబిడీకృతమై ఉంది.

## 4.3 మధురభక్తి :

క్షేత్రయ్య మధురభక్తిని ఆస్వాదించే ముందు భక్తి, మధుర భక్తులకు లాక్షణికులిచ్చిన నిర్వచనాలేమిటో తెలుసుకోవడం అవసరం. "భక్తి" అన్నది "భజ్" ధాతువునుంచి పుట్టింది; అంటే భజించుట; భగవద్భజనమన్నమాట. సహజంగా చిత్తం పరమేశ్వరుని పాదార

---

9. రా. రా, దే—పు. 2 . 10. 16. ఆం. సా. అ—పు. 24.

విందాల కడకు పోవడాన్నే "భక్తి" అంటాడు శంకరాచార్యులు.[11] నారద భక్తిసూత్రాలలో "సాతస్మిన్ పర (మ) ప్రేమరూపా" (సూ - 2) [ఆ భక్తి పరమేశ్వరుని యెడల పరమప్రేమ రూపంగా ఉంది] అని కలదు. అంటే "ఈశ్వరుని యెడల గల యుత్తమమగు ప్రేమ యేదియో అదియే భక్తి యనబడును."[12] ఇట్లే శాండిల్య భక్తి సూత్రాలలోను "సాపరానురక్తిరీశ్వరే" (సూ. 2) అంటే భగవంతునియెడగల పరమప్రీతి (గాఢానురాగం) భక్తి అని చెప్పబడింది. పరమపూజ్యమైన ప్రీతియే భక్తి-భగవంతుని ఎడగల ఆ పరమ పూజ్యభావమే భక్తి. ఇది తొమ్మిది విధాలు.[13] అందులో మధురభక్తి పరమశ్రేష్ఠమైంది. ఈ భక్తినిరసమని నిరూపించినవాడు రూపగోస్వామి. "భరతుని రససిద్ధాంతమును ఆధారముగ చేసికొని రాధామాధవుల నాలంబముగా జేసి రాధకు కృష్ణునిపైగల శృంగారరూపభక్తి రసస్వరూపమైనదని యా రసజనక ప్రక్రియాసంతతిని సాంగోపాంగముగ నిరూపించుచు రూపగోస్వామి వ్రాసిన గ్రన్థమే ఉజ్జ్వలనీలమణి." "నవరసములకును మూలము మాత్రము భక్తిరసమే యని రూపగోస్వామి యభిప్రాయము[14]." మధురరతియే భక్తిరసమని రూపగోస్వామి సిద్ధాంతం. తరువాత మధుసూదన సరస్వతి తన భగవ

---

11. "అంకోలం నిజ బీజ సంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్,
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తి రుపేత్యతిష్ఠతి సదాసా భక్తి రిత్యుచ్యతే",
(శివానందలహరి — శ్లో. 61).

12. రా. సు. మ — పు. 219.

13. "శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్,
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్ ।"
[భాగవతం — సప్తమస్కంధం]

14. సా. వా.—పు. 458, 457.

దభక్తి రసాయనంలో సముచితంగాభక్తికి రసత్వాన్ని స్థాపించాడు. ఈ ఇద్దరి సిద్ధాంతంప్రకారం "ఈభక్తి రసమునకు నాలంబనవిభావము భగవంతుడు; తచ్చరిత్రలు విభావములు; భగవదాకార చిత్తవృత్తియే స్థాయిభావము. అదియే భగవద్రతి. అనుభావములు తత్కాలమునఁ బుట్టిన నేత్రాది వికారములు. వ్యభిచారులు నిర్వేదశంకాహర్షాదులు. ఇది పరమానంద స్వరూపమగు భక్తిరసముగాఁ బరిణమించును[15]." ఈ మధురభక్తిని వివరించిన పింగళివారి మాటలు పేర్కొనడం ఉచితం. "ఈ ప్రేమమిళిత భక్తియే మధురాతిమధురముగా పరిణమించును. ఆ భక్తుడు తాను ప్రేయసిగా భగవంతుడు తన కౌగిలిలో చేరినట్లు మానసిక సంయోగసుఖము ననుభవించును. ఆ క్షణములో అతనికి సాయుజ్యసుఖము కలుగును. జీవన్ముక్తుడగును. అట్టి భక్తుడు చేసెడిచేష్టలు, పలికెడుమాటలు లోకమునకు విపరీతకృత్యములుగా తోచినను భగవంతునికిమాత్రము మురిపెంపు చెయ్యువేయగును...సారాంశ మేమనగా ఒక్కొక్క భక్తుని మనస్తత్వమును బట్టి భక్తితో ప్రేమకలసియుండునని, అది ప్రణయముగామారి శృంగారముగా పర్యవసించుననియు రత్యాలింగితమైన ఈభక్తినే వైష్ణవసంప్రదాయములో 'మధురభక్తి' అనియు నందురు.[16]" భారతీయేతరులు సైతం దేవతావిషయకమైన శృంగారం భక్తి అని చెప్పారు. "సంవేదనమగు రసచర్వణ శుద్ధము, అక్లిష్టము, స్ఫుటమునగు విశ్వప్రేమయని, ఈ విశ్వప్రేమయే వైశద్యమునంది తీవ్రత్వముతో నభివ్యక్తమై మానవుల విషయమున శృంగారమని, దేవతావిషయమున భక్తియని పిలువబడు చున్నదని కోహెన్ [Cohen] పల్కుచున్నాడు"[17].

15. సూ, శా. స.- పు. 306.

16. 62 అ. పిం.—పు. 164, 165.

17. భా.—(అక్టోబరు. 1954) పు. 236.

ఇలాంటి మధురభక్తి రససముద్రంలో ఓలలాడిన వాడు క్షేత్రయ్య. ఈ పదాల్లో మధురభక్తి సరకోటినందింది. "భాగవద్భక్తిని శృంగారముగా మార్చుకొన్న వారికి ఉపాస్యవస్తువు పురుషుడుగాను, తాము స్త్రీలుగాను అనుభవమునకు వచ్చునందురు.

"సఏవ వాసుదేవోஉ సౌసాక్షాత్పురుష ఉచ్యతే
స్త్రీప్రాయమిత రత్సర్వం జగద్బ్రహ్మ పురస్సరమ్'
'స్వామిత్వాత్మత్వ శేషిత్వ పుంస్త్వాద్యాః స్వామినోగుణాః
స్వేభ్యోదాసత్వ దేహత్వ శేషత్వస్త్రీత్వ దాయినః॥"—

అనుట వారి మతము. కనుక క్షేత్రయ్యకును గోపాలుని యందలి మధురభక్తిచే తనయందు స్త్రీత్వానుసంధానముకలిగి దాని ఫలముగా అన్యాదృశ్యమగు స్త్రీ స్వభావానుభవము కలిగియుండును ......కాని క్షేత్రయ్యకును అట్టి (ఆ కాలపు) భౌతికమగు స్త్రీరూప లావణ్యములకంటె వేయిరెట్లు ఎక్కువ అనుభవమునకు, భావనకు వచ్చినది ఆధ్యాత్మిక మగు స్త్రీ స్వభావము[18]." అనే రాళ్ళపల్లి వారి మాటలక్షరాలా సత్యం. ఇంతెందుకు?. ఈ క్షేత్రయ్యకుపూర్వులు, సమకాలికులూ అయిన ఇతరపదకర్తలు సైతం మధురభక్తిమార్గాను యాయులేగదా? భాగవతంలోని భక్తి మధురం. జయదేవుడు గీత గోవిందంలో మధురభక్తి నేవర్ణించాడు. "కృష్ణసంబంధమైనభక్తిమార్గ ములందెల్ల నగ్రగణ్యము భాగవతభక్తి సంప్రదాయము. భాగవతమునందలి మధుర రసాలంబనములైన గోపికాకృష్ణు లాలంబనముగా వెలసినది వల్లభాచార్యుని పుష్టిమార్గము. వల్లభసంప్రదాయమందుగోపికా కృష్ణుల దృష్టిలోనిడికాని గోపికలకు శ్రీకృష్ణునియెడ గలమధురరసోజ్జ్వల పరిపుష్టమైన భక్తియందలి పరిస్థితిలోని తుట్టతుది

18 ఆం. ప. (1942-43). పు. 17.

స్థాయియైన మహాభావము నాధారముగా జేసికొని రాధాకృష్ణ పరముగ వెలసినది-చైతన్యుని మధురభక్తి సంప్రదాయము[19]." విద్యాపతి తన పదావళిలో ఆత్మపరమాత్మల పరంగా రాధాకృష్ణుల శృంగారం వర్ణించాడు[20]. ఇంక మీరాబాయి—

"పురుషు డెవ్వండిచట ?
పురుషు డాతడొకండె పురుషోత్తముండు
పురుషుడాత డొకండె
పొలతులము మనమంత
దివ్యపురుషుని ప్రేమ
తేజః ప్రదీప్తులము.[21]"- అనే మంజుల మధురభక్తి పారవశ్యం. ఏమైనా భక్తికి ప్రేమ ప్రధానమని పూర్వోక్తమైనట్లు నారద, శాండిల్య భక్తి సూత్రాల్లో స్పష్టం[22]. అన్నమయ్య మధురభక్తి ఈ కోవకు చెందిందే. "భగవంతుడు వెంకటేశ్వరస్వామి నాయకుడు. భక్తుడు నాయిక. వెంకటేశ్వరుడు తానొక్కడు పురుషుడు. మానవ కోటి స్త్రీ. ఈ స్త్రీపురుషుల అనంతశృంగార లీలయే విశ్వము. ఇట్టి అలౌకిక మధుర భావము అన్నమయ్య శృంగార సంకీర్తనములకు బీజమయినది. ఏ తద్భావస్ఫూర్తితో అన్నమయ్య శ్రీ వేంకటేశ్వర లీలలను అనంతముగా శృంగారకీర్తనలతో కీర్తించినాడు. అతడు రచించిన యధ్యాత్మ సంకీర్తనల సంఖ్యకన్నా శృంగార సంకీర్తనల సంఖ్య యధికముగా నున్నది......అన్నమయ్య శృంగార సంకీర్తనములు వేంకటశైలవల్లభ రతిక్రీడా రహస్యములు వెల్లడించునవి[23]."

---

19. సా. వా.—పు. 452.
20. వి. ప.—పు. 6.
21. భా. రా. అ.—పు. 229.
22. J. V. I. (July, Dec. 1950) P. 169, 170.
23. భా. (సెప్టెంబరు, 1952)—పు. 281, 282.

ఇదేపద్ధతిలోనే క్షేత్రయ్య తన పదాల్లో మువ్వగోపాలనాయకుని శృంగారం వర్ణించి తరించాడు. తానే నాయిక; రసరాట్టు అయిన శృంగారాధిదేవత మువ్వగోపాలుడు నాయకుడు. క్షేత్రయ్య ఆత్మనివేదనైక భావముతో భగవంతునిపై బాళిగొని, పరమప్రేమను ప్రకటించి, పరమాత్మయందు లీనంకావడానికై పడినతపన స్పష్టమవుతుంది. ప్రేయసి అయిన క్షేత్రయ్య, ప్రియుడైన మువ్వగోపాలునందు ఐక్యంకావడానికి చేసినప్రయత్నం స్పష్టం. క్షేత్రయ్య నాయికయై నాయకుడైన పరమాత్మునికై మధురభక్తితో విరహం అనుభవిస్తూండగా శారీరకమైన స్తంభన, స్వేద, రోమాంచ, స్వరభంగ, వైవర్ణ్య, అశ్రుప్రలయాందులన్నియు కలిగినట్లు అనుభవించి వర్ణించితరించాడు; తాను స్వీయ, పరకీయ, సామాన్యగాను అయి పరమాత్మునికై ప్రతీక్షించి తన ఆత్మనివేదనను ప్రకటించుకొన్నాడు. ఇంతేగాదు లోకంలోని కన్య, బాలింతరాలునై తన ప్రేమను వ్యక్తం చేసుకొన్నాడు. ఇది మహత్తర సాధనగా, మధురభక్తి మార్గంగా వర్ణించబడింది; ఆర్షసంప్రదాయంలోనేగాక క్రైస్తవమత సంప్రదాయంలోను 'The Doctrine of the Devine spouse'- అనే పేరుతో ప్రచారంలో ఉంది[24]. వివిధరీతుల దర్శించి, ప్రదర్శించిన క్షేత్రయ్య మధురభక్తి సాధన ఎలాంటిదో పరిశీలిద్దాం. అనంతముఖాలైన క్షేత్రయ్య మధుర భక్తిని పరిశీలించేముందు ఒకటి మనం గుర్తించుకోవడం ముఖ్యం. "ఇక ప్రేయసీ భావనలోగాని, ప్రియతమ భావనలోనిగాని, రాధికాగోపికాది భావనలోగాని ఈశ్వరారాధనం జరిగినప్పుడు భక్తునికి ఆయాభావాలకు అనుకూలమైన పరిస్థితి అభివ్యక్తమైనపుడు భక్తుని మానవసహజమైన భావావేశం అభివ్యక్త మవుతుంది"[25]. అదే విధంగా క్షేత్రయ్యలోను ఈలాంటి భావా

24. సం. ఆం. వి. – పు. 157, 158.
25. 1 . ఆం. సా. ఆ. – పు. 828.

వేశం ఉండడంలో అసహజం లేదు. కనుక అయా సమయాల్లో కొన్ని పదాల్లో కేవలం లౌకికశృంగారంగా భాసించడం సైతం గోచరిస్తుంది. పై అభిప్రాయాన్ని మనం గుర్తించుకుంటే సంపూర్ణమైన ఆత్మనివేదనైక భగవత్ప్రణయమే గోచరించి, అలౌకిక శృంగారం మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది. ఇది ఇందులోని రహస్యం. ఈ విషయం గుర్తించుకొని క్షేత్రయ్య మధురభక్తిని పరిశీలిస్తే మనం గూడ పరమానంద భరితులం కాగలం. క్షేత్రయ్య పొందిన మధురానుభూతిని మనం పొందలేక పోవచ్చు; అలాంటి భావనతో మనం సైతం ఆ మధురభావాన్ని ఆస్వాదించవీలుంది.

క్షేత్రయ్య నాయికగా, మువ్వగోపాలుడు పరమపురుషుడుగా అత్యంత మనోజ్ఞమైన భావావేశంతో మధురభక్తికి లోనైన సమయంలో ప్రప్రథమంగా ఆతని నోటినుంచి వెలువడిం దీక్రిందిపదం. ఇది పూర్వోక్తం. క్షేత్రయ్య మధురభక్తికీ, ఆ ప్రారంభదశకూ ఈ పదం ఎంతో సహజమై ఒప్పారుతూంది.

"శ్రీపతి సుతుబారికి నే - నోపలేక నినువేడితే -
కోపాలా ? మువ్వ గోపాలా !
ఏ ప్రొద్దు దానింటిలోనే - కాపై యుండి నీ సరస స -
ల్లాపాలా ? మువ్వ గోపాలా ! ॥శ్రీపతి॥
పై పూత మాటల నేర్పు - జూపు దానిరతిపై నింత
తీపేలా ? మువ్వ గోపాలా ! ॥శ్రీపతి॥
మంపుల నన్యుల దేరి - చూడని నాతో క
లాపాలా ? మువ్వ గోపాలా ! ॥శ్రీపతి॥
నా పొందెల్ల దానికబ్బ - యే పొందులేక యుసురను చే
నాపాలా ? మువ్వ గోపాలా ! ॥శ్రీపతి॥"

[సీ. గి. వేం - ప. 87] ఇందులో పరమాత్మయందు ఆత్మ తల్లీనం కావడానికై పడే మధురవేదన వ్యక్తమవుతుంది. క్షేత్రయ్య నాయికయై ఆ భగవంతునిపొందు అంటే ఐక్యసంధానంకోసం- అనుభ వించే విరహం సుస్పష్టం.

క్షేత్రయ్య నాయికఅయి సర్వమూ తనకాపరమాత్ముడేనని స్పష్టంచేస్తున్నాడీ క్రింది పదంలో—

"ఇంత తెలిసియుండి - యీ గుణమేలరా
పంతమా ? మువ్వగో - పాల ! నా సామిగ ॥ఇంత॥

అలుకచేసి యింటికి రా - వైతివి నెనరైన
చెలికత్తె లున్నారా ? - పిలువవచ్చేరా ?
చెలికత్తెలైన నీవే - చెలువుడవైననీవే
తలచిచూడ నాపాలి - దైవము నీవే ॥ఇంత॥

వింతదానివలె నన్ను - వేరుచేసి రావైతివి
అంతరంగులున్నారా ? న - న్నాదరించేరా
అంతరంగమైన నీవే న - న్నాదరించిన నీవే
చింతించిచూడ నా జీవస్వామివి నీవే ॥ఇంత॥

శ్రీనిధి మువ్వగోపాల ! - చేపట్టి నన్నేలితివి
నా నేర్పులెవరైనా - నానందించేరా ?
నా నేర్పులైనా నీవే - నమ్మిక లిచ్చినానీవే
ఆనగా బల్కుదు నా - యానందమైననీవే ॥ఇంత॥"

[సీ. గి. వేం-స్వీ. 47] ఇందులో క్షేత్రయ్య నాయికఅయి పరమాత్మానుసంధానం పొందేవిధం స్పష్టం. తాను నాయికగాను, భగవంతుని చెలికత్తెగాను, చెలువుడుగాను, తనపాలి దైవంగాను

తలంచాడు. 'నా జీవస్వామివి నీవే' అనడంలో జీవాత్మపరమాత్మల ప్రసక్తి వాటి సమైక్యం సూచించడం జరిగింది. 'నా ఆనందమైన నీవే' అనడంలో పరమానందం అంటే మధురభక్తివల్ల కలిగిన మహదానందం స్పష్టమవుతుంది.

ఇంక "ఇద్దరివలెనే కూడి ఎవరున్నారు ? తెల్పరా !" [సీ. గి. వేం - సీ. 56] అనే పదంలో పురాణపురుషులైన నలదమయంతులు, రుక్మిణీకృష్ణులు, సీతారాములు, రంగనాయకీ రంగేశులు, చంద్రమతీ హరిశ్చంద్రులు, రతిమన్మథులు - అనే జంటలను తెల్పి వారి ప్రేమతత్త్వాన్ని స్పృశించి, వారి ఏకత్వాన్ని సూచించి, నాయిక అయిన క్షేత్రయ్య మువ్వగోపాల దేవుడన్న పరమనాయకునిలో ఏకత్వాను సంధానాన్ని తెల్పడం జరిగింది. "ఎందుకు వచ్చెనో కోపమెవరే మన్నారు" [సీ. గి, వేం.-స్వీ. 73] పదంలో ప్రణయమానం గల నాయకుని నాయిక అనునయించినట్లు స్పష్టం చేయబడింది. ఇందులో నాయికా నిర్మల అనురాగమూ, అరమరిక లేని, కల్లాకపట మెరుగని అమాయకత్వమూ వ్యక్తమవుతున్నాయి. రకరకాలైన భావానుభూతులను పొందిన నాయికామానసికస్థితి విదితమవుతుంది. నిర్మలప్రేమకు పరమనిదర్శనం "అక్కరో ! యోర్వనివారు సరసుడు గాడని - ఆడుకొంటే ఆడుకొనేరు" [సీ. గి. వేం. - ప. 1] అనే పదం. పరమపవిత్రమైన ప్రేమపూర్ణమైన నాయిక - అంటే నాయికాత్వం చెందిన క్షేత్రయ్య - పరమాత్ముని సుగుణసంపత్తిని స్మరించి తరించడం దీనిలోని విశిష్టత. ఇంకా ఇందులో—

"రామ ! వాని దలచినపుడే - రవిక క్రిక్కిరిసి గుబ్బ
లేమో రోమమ్మెల్ల నిండునే - వాని మాటంటే
నా మనసు పైపై నుండునే వానిజూచితే

నవనిధు లబ్బినట్లుండునే..."— అని అనడంలో నవవిధ భక్తు లలో స్మరణ, కీర్తన, దర్శనం అన్న త్రివిధాలైన భక్తులు స్పష్టం. అది పారలౌకిక భక్తి. ఆత్మ పరమాత్మయందు పారవశ్యంతో లీనం కావ డానికై చేసిన ప్రయత్నం విదితం. తరువాతి చరణాల్లో తనను కౌగిలిస్తే పరమానందం కలుగుతుందని చెప్పడం జరిగింది. పరమా త్మాను సంధానంపొందిన ఆత్మపొందే సంతృప్తి "ఎవతెకూడిన నేమి చాలునిది నాతో ననకురే" [సీ. గి. వేం. - సీ. 79] అనే పదంలో సువిదితమవుతుంది. వీటిలో పరశుద్ధాత్మ, నిర్మలభక్తి మొదలైన విశిష్టగుణాలు వ్యక్తమవుతున్నాయి. "నేను మంచిదానను గనుక నీ తప్పు గాచితినిగాని" [సీ. గి. వేం. - ప. 58] పదంలో అడ్డగి స్తే "కొనిపోవు దిక్కుగలరా ? కట్టివేసుకొంటే నిన్ను విడిపించు దిక్కు గలరా ? నిన్ను గూడి ప్రౌఢికెక్కితే దిక్కుగలరా ?"— అంటూ నాయిక నాయకునితో సవాలుచేస్తుంది. ఇందులో ఆత్మకు పర మాత్మపై గల అధికారం మనకవగత మవుతుంది. నాయికాత్వం పొందిన క్షేత్రయ్య ప్రియుడైన భగవంతునితో చేసిన సవాలని తెలుస్తుంది.

గోపీకృష్ణుల శృంగారాన్ని తలపింపచేసే ఈ పదంలో క్షేత్రయ్య తన్నుతానే ప్రశ్నించుకొంటున్నాడు—

"చూడరె అదినడచే హొయలు - సుదతిచేయుజాడలు
ఆడది కులకాంత - అత్తింటి కోడలు
అలగోపాలుని - విడిదికి వెడలెను ॥చూడరె॥
కొండంతకాపురమె కానుపోను - కోమలికందలమె
దండున గెలిచేమగడు—తక్కువేమే
తలవ్రాలెవరికి తప్పించ వశమే ॥ చూడరె ॥

పైటకొంగు జారినను తెలియక—భయమించుకయు లేక
తోటివారు నవ్వు—దురని యెంచక
దోచునటె అది గయ్యాళి బల్ జాణ ॥ చూడరె ॥

అత్త, మామ, బావ, మరదులను దిట్టి—అవమానమును గొట్టి
గుత్తగాను మువ్వ—గోపాల దేవుని
కూడునటే అది మనిషా భ్రమాకా ॥ చూడరె ॥"

[సీ. గి. వే. - ప. 17] ఈ పదం భాగవతంలో సర్వం త్యజించి, శ్రీకృష్ణుని వేణుగానలోలలైన గోపికలు పరుగున పోయిన విధమూ, వారిని శ్రీకృష్ణుడు "ఇలువడి నున్న చేసి—" అన్న పద్యంలో అత్తమామలను, భర్తలను, పిల్లలను వదలివచ్చారే అని ప్రశ్నించిన విధమూ, అందుకా గోపికలు—

"పతిపుత్రాదిక నామమూర్తి వగుచున్ భాసిల్లు నీయందుఁద
త్పతి పుత్రాదిక వాంఛలన్ సలిపి సంభావించుట న్యాయమే"26

—అని చెప్పిన సమాధానమూ స్ఫురింప జేస్తుంది. అంటే సర్వమూ పరిత్యజించి భగవంతునియందే ఆత్మనివేదనం చేయడం మనం గమనించగలం. ఇదే భాగవత సంప్రదాయం. ఇదే గోపీకృష్ణుల—ఆత్మపరమాత్మల—ప్రణయం—అలౌకిక శృంగారం. ఈపద్ధతిలోనే క్షేత్రయ్య ఆత్మపరమైన సర్వమూ నివేదించిన నాయికను పై పదంలో వర్ణించాడు. భగవంతునిపైగల ప్రేమానురాగాలతో తదితరమైన వాటిని మరచిపోయి హొయలు గుల్కు నడకలతో వెడలిందట నాయిక. ఈ పదంలో సారాలంకారముంది. ఉత్తరోత్తరం

26. పో.- దశమ స్కంధ —ప. 976, 986.

ఉత్కర్షను అభివర్ణించడం సారాలంకారం.[27] అనుపల్లవిలో 'ఆకటా' అన్నాడు మొదట; అంటే ఆడదానికిలాంటి సాహసములుగులుగ-నడకలంత మంచిదికాదని అర్థం. తరవాత 'కులకాంత' అన్నాడు. కులకాంతకు తగిన విధం కాదని అర్థం. 'అత్తింటికోడలు' అన్నాడా వెనుక—మరి మగనాలైన అత్తింటి కోడలు చేయవలసిన పనేనా? అని ఒత్తిచెప్పడం. అట్లే మొదటి చరణంలో కొండంత కాపురమనీ, రానుపోను అందలమనీ, దండునగలిచే భర్త కలడనీ—చెప్పడంలో ఇది విశిష్టంగా స్ఫురిస్తుంది. ఈ సారాలంకారంతో పాటు 'తాల వ్రాలెవరికి తప్పించవశమే' అని అర్థాంతరన్యాసాలంకారం వాడబడింది. రెండో చరణంలో 'అటిగయ్యాళి బలేబాలా' అనీ 'అత్త, మామ, బావ, మరదులను దిట్టి, అవమానపరుచుగట్టి' మువ్వగోపాలుని కూడుతుందా అనీ, 'అది మనిషా, భ్రమరా' అనీ చెప్పడంలో ఈ సారాలంకారం పరిపుష్టిని చెందింది. వీటివల్ల ఆనాయిక మానావమానాలు వదలి, అత్తమామలను, బావమరదులను లెక్కచేయక మువ్వగోపాలునకు తన్నుతాను నివేదించుకొన్నదని స్పష్టమవుతుంది. ఇందులో క్షేత్రయ్య నాయిక అయి మధురభావంతోని గాఢతను, సాంద్రతను స్పష్టీకరించడానికి చేసిన రచనా పద్ధతి ఏ పదకర్తకూ కాదుగదా, ప్రౌఢ కవులకు సైతం సాధ్యంకాదంటే అత్యుక్తి కాదు. ఇందుకు సహృదయ హృదయమే సాక్షి! కారణం ఈ మధురభక్తి, ఈ మధురానుభూతి అనుభవైకవేద్యం కనుక! ఇది క్షేత్రయ్య మధురభక్తికి పరాకాష్ఠ!.

ఈ మధుర కవితలో నాయిక దుస్సహవిరహం అనుభవించడం సర్వసామాన్యమే. క్షేత్రయ్య నాయికాత్వం వహించి మువ్వగోపాలునిపై విరాళిగొని, దుస్సహ విరహం అనుభవించినట్లు ఆతని

27. ఆం. చ.— పు. 81.

పదాల్లో అనేక సామ్యాలు అనేక రీతుల్లో మనం చూడవచ్చు. పైగా రాధాకృష్ణ ప్రేమ తత్త్వంలోనే ఈ విరహం సర్వసాధారణమే. గీత గోవిందంలో కృష్ణునికై రాధ విరహమనుభవించింది. చైతన్య స్వామి తాను రాధగా భావించి విరహం అనుభవించడం జరిగింది.[28] ఇది చైతన్యునిలోని మధురానుభూతి. ఇక్కడ ఉజ్జ్వల నీలమణిలో రాధావిరహవేదనను ఎంతో చక్కగా అభివర్ణించాడు రూపగోస్వామి.[29] విద్యాపతి తన పదావళిలో విరహ వ్యథాభరిత అయిన నాయికను వర్ణించాడు. ఆళ్వారులలోను ఇలాంటి విరహవేదనా భరితమైన కవిత ఉంది. ఇంతెందుకు భాగవతంలోని గోపికలు అనుభవించిన కృష్ణపరమైన విరహం అనన్యసామాన్యమే కదా? ఇలాగే క్షేత్రయ్య నాయకాత్వం వహించి మువ్వగోపాలునిపై విరాళాన్ని దుర్భర విరహంతో దోదూయమానమానసుడైనట్లు ఈ క్రింది పదంలో సువిదిత మవుతుంది.

"ఈమేను జీవునకు—ఎంత ప్రియమాయెన్
భామ! మా మువ్వగో—పాలు కౌగిట లేని ॥ ఈమేను ॥

పడతి! నేనొకచోట—ప్రాణేశు డొకచోట
ఎడబాసి మరునిచే—ఇడుములకులోనై
కడలేని విరహాగ్ని—క్రాగియున్నది చాల
పుడమిలో వేఱెజ—న్మము లేదే సుదతి ॥ ఈమేను ॥

మోముజూడ మనసై—మోవియాన నోరూరి
యామ్ముకొన్న ప్రేమచే—నసురుసు రనుచు
సోము కాకల జిక్కి—సొమ్మసిల్లి యీవేళ
కామినిరో! ఎడతెగని—కన్నీట నిటులున్న ॥ ఈమేను ॥

---

28. K. V. R.— P. 581.
29. సా. వా — పు. 460–462.

ఉత్తమ మధురభక్తిగా తలంచడం ఉచితం కాదని అంటూ, దివాకర్ల వారు తమ వాదానికి ఉపబలకంగా కట్టమంచి రామలింగారెడ్డిగారి, "We try to defend this by the aid of allegory and uneasy theories that all these represent the love of Gopis symbolising individual souls, to Krishna, the symbol of Heavenly absolute. It is doubtful whether we are spiritualising sex or sexualising spirit; whether we are sublimating earth to heaven or bringing down the heaven to our muddy levels and depths."[31] అనే మాట ఉల్లేఖించారు. కానీ ఇతః పూర్వమే వివరించినట్లు క్షేత్రయ్య పదాలనుస్వీకరిస్తే అవి తప్పక మధురభక్తి ప్రపూరితాలైనవనడంలో సందేహంలేదు. అంటే మధురభక్తి వ్యక్తీకరణలో మానవ సహజమైన ఆవేశం ఈ పదాల్లో స్పష్టం కావడం సహజమే కదా! క్షేత్రయ్య నాయికాత్వారోపణతో మువ్వగోపాల ప్రియునితో అద్వైత భావం పొంది తరించిన మధురభక్తిపరుడు. ఈ సందర్భంలో జమ్మల మడక మాధవరాయశర్మగారి శ్లోకం ఉల్లేఖనీయం—

"సాహిత్య శ్రీసమున్మేష సంప్రాప్తాద్వైత భావనః
క్షేత్రజ్ఞో జయతి శ్రీమాన్ మువ్వగోపాల నాయకః"[32]

## 4. 4 అశ్లీలతా నిరాసం :

క్షేత్రయ్య పదాల్లో మధురభక్తి లేదని బాధాక్రాంత మనస్కులై, సంక్షుభితాభిప్రాయాల్ని అభివ్యక్తం చేసి, తమ సభ్యతను నిలబెట్టుకోడానికి యత్నించి విచిత్ర విమర్శలు చేసిన కొందరు

---

31. పై (ii) లోనిదే–పు. 51, 52.

32. 7. అ. వి.–పు.– 8.,

న్నారు. క్షేత్రయ్య పదాలు అసభ్యమూ, అశ్లీలమూ అని చెప్పి "మధురభక్తిగాదు, మట్టిగెడ్డలూ గాదు, సానెంపాటి లంజల సంగతి" అనీ, పచ్చి శృంగారం పరవళ్లు తొక్కుతుందనీ" ఒకరూ;[33] రాజ విలాసాలకు తన్ను అమ్ముకొన్నవాడు క్షేత్రయ్య అనీ, ఈ పదా లన్నీ మచ్చుకైన అలౌకిక శృంగారరస స్పర్శ లేనివనీ, కామోద్రేక కారకాలై, వేశ్యావాటికలకు సంబంధించినవనీ అంటూ, ఆతని పద రచనను మెచ్చుకొన్న ఇంకొకరూ[34]; విజయరాఘవుడు పరమాత్మ అనీ, జీవులు స్త్రీ ప్రాణులనీ క్షేత్రయ్య పదాల్లోని వేదాంతంగా నమ్మినవారు వేరొకరూ[35]—ఇలాగా ఎంతోమంది దోషారోపణ చేసిన వారున్నారు. వీరికి సమాధానాలు చెప్పాకోవడం అనవసరం. క్షేత్రయ్య మొదట రక్తుడూ, తరవాత భక్తుడూ నన్నది పూర్వోక్తం; పూర్వా శ్రమంలోని రక్తి జాజ్వల్యమానమై తరవాతి జీవితంలో మధుర భక్తిగా పరిణమించిందనీ ముందే స్పష్టం. ఈ దృష్టితో ఇతః పూర్వ వివరణానుసారం పరిశీలిస్తే క్షేత్రయ్య పదాల్లోని మధురభక్తి మనో జ్ఞంగా దృగ్గోచరమై ఆత్మ ప్రబోధం చేయగలదు. ఇదే మధురభక్తి కాదన్నవారికి సమాధానం. ఇది కేవలం సానెంపాడు లంజల సంగతి అనీ, వేశ్యావాటికల కామకలాపమనీ తలంచేవారికి కూడా ఇదే సమా ధానం. క్షేత్రయ్య తన పూర్వాశ్రమంలో—అంటే రాజాశ్రయంలో ఉన్నప్పుడు—కేవల లౌకిక శృంగారంతోనే కాలం గడిపి ఉంటాడన్న సంగతి పూర్వోక్తం. కానీ ఆ వెనుక మాత్రం నిజమైన మధురభక్తి పరవశత్వంతో పదరచన చేసినట్లు సుస్పష్టం. ఈ భక్త్యావేశంలో అతని పూర్వవిషయాలు మానవసహజరీతిని వ్యక్తమైనమాట నిజం. అంత మాత్రం చేత అవి అశ్లీలమూ, అసభ్యమూ అనీ తలంచడం సము

33. 'సీరపాణి' – ఆం. ప. [1953–54] – పు. 153–163
34. ఆం. ప్ర. – [3–10–1971].
35. సం. ఆం. వి – పు. 163

చితమూ కాదు, న్యాయమూకాదు. ఇంక విజయరాఘవుని పర మాత్మునిగా భావించి క్షేత్రయ్యపదరచన చేశాడన్నమాటలకు అర్థమేలేదు. క్షేత్రయ్య విజయరాఘవుని ఒక రాజుగామాత్రమే సంభావించి తన పదాల్లో అభివర్ణించాడు. ఇది క్షేత్రయ్య జీవితం లోని పూర్వాశ్రమ సంబంధమన్న సంగతి మరవకూడదు.

"అశ్లీలమనఁగా శ్రీకముకానిదియని అర్థము. శ్రియంలాతి-శ్రీనాకర్షించునది శ్లీలము. అదికానిది యశ్లీలము. కపిలాది యగుటవలన రేఫమునకు లకారము. సహృదయ వశీకరణ శ్రీరహిత మని యొకానొక కావ్య కోవిదుడు వక్కాణించె" ననీ, "ఈ న్యాయ మునే తెలుఁగునందును నన్వయింపవలెను. సురతాది పదములు మహా కవి ప్రయుక్తములై, రసవిరుద్ధములై సభ్యవ్యవహార సిద్ధములై యుంటవలన నశ్లీలములుకా" వనీ వివరించారు చెదలవాడ సుందర రామశాస్త్రిగారు.[36] అందువల్లనే మహాకవుల కావ్యాలన్నీ సురత క్రీడలు, కచకుచాది వర్ణనలున్నప్పటికీ సభ్యరచనలుగానే భావించ బడ్డాయి. కాళిదాసాది మహాకవుల రచనల్లోనూ శృంగారం ఉంది. అయినా అది అశ్లీలంకాదు. మన ప్రబంధాల్లో లేని శృంగారం మరెక్కడుంది? క్షేత్రయ్య పూర్వులైన శ్రీనాథపోతనలలోని శృంగారం మాట ఏమిటి? పోతన మహాభక్తుడు. సందేహంలేదు. ఆతనిభక్తిని విశ్వసించనివారు భక్తిఅంటే ఏమిటో తెలియనివారు. అయితే అతని భక్తిలో శృంగారం పరవళ్లు తొక్కుతూంటుందన్న సత్యమందరికీ తెలిసిందే. ఆ భక్తి మధురభావోపేతమైనదని గదా మనం నమ్ముతున్నాం.[37] ఇంతెందెకు? "సంస్కృత వాఙ్మయము నందలి సరస సామగ్రిని దనరచనలో నను సంధానించుచు పరమేశ్వరా

36. ఆం. ప. ప. — [సం. 11, — 1922] — పు. 10—16.
37. రా. రా. దే. — పు. 21.

లంబనముగ శృంగారరస భావముల నావిష్కరించిన యాతని (శ్రీనాథుని) రచనయు భావపర్యవసాయియై యొసలారునొక స్రవంతి[38]" అని మనం నమ్మినప్పుడు అశ్లీలతకు తావెక్కడ? ఇట్టి క్షేత్రయ్యపదాలను అసభ్యమని తలంపవీలుందా? గోపీకృష్ణుల, రాధాకృష్ణుల మధురభక్తిలోనూ, చైతన్యుల, అన్నమాచార్యుల మధురభక్తిలోనూ సంభోగ శృంగార వర్ణనలు లేకపోలేదు. అన్నమాచార్యుల శృంగారకీర్తనలు "వేంకటశైలవల్లభరతిక్రీడారహస్యంబులు" గదా మరి! అవి పరమ శ్రేష్ఠమైనవిగా, మధురభక్తి పరిపూర్ణమైనవిగా తలంచబడినప్పుడు క్షేత్రయ్య పదాలకు వచ్చినదోషమేమిటో? ఇవీ, జయదేవుని అష్టపదులూ ఆడిపాడి అభినయిస్తే దోషంలేదు. కానీ క్షేత్రయ్య పదాలకు దోషముందా? ఇవి అసభ్యమూనా? రామదాసు "నను బ్రోవమని చెప్పవే" అనే కీర్తనలో "లోకాంతరంగుడు, శ్రీకాంతుని నినుగూడి, ఏకాంతమున నేకశయ్యనుండెటివేళ నన్ను బ్రోవుమని చెప్పవే సీతమ్మా!" అనీ, "ప్రక్కను జేరి చెక్కిలి నొక్కుచు చక్కగా మరుకేళిసలుపుచుండెడివేళ—నను బ్రోవమని చెప్పవే సీతమ్మతల్లీ!" అనీ పాడితే అశ్లీలం మనకు గోచరించదు. ఇలాగ ఎన్నైనా ఉదాహరించవచ్చు. ఇంక క్షేత్రయ్యను త్యాగయ్యతో పోల్చగూడదు. క్షేత్రయ్య మధురభక్తిపరుడు. త్యాగయ్య కేవలం ఆధ్యాత్మికభక్తి సంపన్నుడు. కాబట్టి క్షేత్రయ్యది మధురభక్తి అనీ, అశ్లీలం అందులోగాక మన దృష్టిలో ఉందనీ స్పష్టం. ఆవిధంగా చూసే చూపూ, చూడాలన్న ఆసక్తీ ఉంటే తప్పకుండా క్షేత్రయ్య

88. 18. ఆం. సా. అ. – పు. 146,

మధురభక్తి దృగ్గోచరమై మనల్ని పరవశుల్ని చేస్తుందనటంలో సందేహమక్కరలేదు.

పోతే క్షేత్రయ్య పదాల్లో కేవలం 'పచ్చి' ఉందని భావించిన వాళ్లందరూ కొన్ని పదాలే-కొన్ని అంటున్నానెందుకంటే అవి ఉన్నవి కొన్నేకనుక - ఉదాహరిస్తూండటం ఆనవాయితీ అయి పోయింది. "ఒక్కసారికే..", "అత్తవారూరికి అంపేరు...", "చెరగు మాసి యున్నానని"; "సమర్తాడి నెలపూటలాయెరా" [సీ. గి. వేం-ప. 14, 13, 93, 88.] ఈ మొదలైనవి కొన్నిమాత్రంఉదాహరిస్తూ ఉంటారు. కానీ రసనిష్యందులూ, మధురభక్తి పారమ్యములూఅయిన క్షేత్రయ్య పదసముద్రంనుంచి పృథక్కరించి వీటినిమాత్రం ఉదాహరించడం సబబుకాదు. 'పచ్చి' అని తలంచినవారికి చక్కటి సమాధానం రాళ్లపల్లివారి మాటలు! "నిజముగా ఈ పచ్చి మనము భయపడవలసినదే. దీనినే 'మహాశనోమహాపాప్మా' అనియు, 'జ్ఞానికి నిత్యవైరి' యనియు గీతవాకొన్నది. ఈ వైరినేమి చేయవలయును? మూలముట్టుగా చంపుటయొక మార్గము. మనము తల తప్పించుకొని తిరుగుట రెండవది. ఈ రెంటికన్న ఉత్తమమైనది, 'పొసగ మేలు చేసి పొమ్మనుటచాలు' అని వేమనచెప్పినట్లు, ఆ శత్రువును మిత్రునిగాఁజేసికొనుట; అనగా పచ్చిని పండుగా చేసికొనుట. ఉత్తమ సంస్కార లక్షణమది. ... ఇది పచ్చియనుకొనువారి అనుభవవివేకములు పచ్చివి. అంతే! మఱి 'అపక్వబుద్ధులకు, అసంస్కృతులకు దేహమనోవృత్తులను అల్లకల్లోలము చేయుటకివి చాలవా?' అని యడుగవచ్చును నిజమే. కాని దానికి చికిత్స పక్వబుద్ధులుగూడ వీని నిత్యజించుటకాదు. అది బిడ్డలు కసుగాయలు తిందురని పండ్లచెట్లునే

కొట్టివేయుటవంటిది. తెలివిగలవారు చిన్నబిడ్డలను నిప్పుచెంతకు పోనీయరు. ఇంటిలో నిప్పేలేకుండఁ జేసికొని ముడితిండి దిని చీఁకటి బ్రదుకును బ్రదుకరు. అన్నిటివలె బుద్ధికిని పక్వతా సంస్కారము క్రమికపరిణామరూపమే కాని ఆకస్మికము కాదు. అది విద్యావిధానముల ధర్మము, కర్మము. కావున ఈ శృంగార వాఙ్మయమును ఎప్పుడు ఎవరికెవరు ఎట్లు పరిచయము చేయవలెననుట జీవితములోని పెద్ద ప్రశ్నలలో నొకటి; ప్రత్యుత్తరము గూడ పెద్దదే.

'తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ'[39]"



# 5. సంగీతం-అభినయం

క్షేత్రయ్య సంగీత సాహిత్యాలకు సమాన ప్రతిపత్తినిచ్చి అభినయాన్ని జోడించడంవల్ల, సంగీతాభినయాలను గూర్చి గూడ వివరించినప్పుడే అతని పద సాహిత్య పరిశీలన పరిపూర్ణత్వం పొందగలదు. "The uniqueness of Kshetraiah Padas lies in the fact that besides being exquisite musical forms, perfect in technique and replete with ragabhava, they are peerlessly fitted for expression of variegated shades of absorbing intrest not only to music lovers but also to connoisseurs of the dance art[1]" అన్న కృష్ణఅయ్యర్ మాటలు అక్షరాలా సత్యం.

## 5.1 సంగీతం :

ఎక్కువ సాంకేతిక విషయాలను తడవకుండా, క్షేత్రయ్య పదాల్లోని సంగీతాన్ని గూర్చి తెలుసుకొందాం. "గీతం వాద్యం తథానృత్యం సంగీతముచ్యతే"– గీతవాద్య నృత్యాలు మూడింటిని సంగీతమంటారు. కాని "గీత వాద్యోభయం యత్ర సంగీత మితి

---

1. క్షే. గి. వేం.– pxiv

కేచన"— అంటే గీత వాద్యాలు సంగీతమని కొందరి తలంపు. క్షేత్రయ్య సంగీతానికి తన పదాల్లో సాహిత్యంతోపాటు సమాన గౌరవం ఇచ్చాడు క్షేత్రయ్య. క్షేత్రయ్య పదాల రాగతాళాలు మాత్రం తెలుస్తున్నాయి స్పష్టంగా. స్వర ప్రస్తారం మొదలైనవి— అంటే క్షేత్రయ్యకాలంనాటి గాన విధానం— తెలుసుకోవడం సంగీతజ్ఞులకు సైతం కష్టసాధ్యమనే చెప్పాలి. కారణం అవెక్కడా వ్రాసి పెట్టబడ లేదుగనుక. "కాని ఆతని (క్షేత్రయ్య) సంగీతమును ఆతడు సృజించినట్లు పునరుద్ధరింపగలమనుట నాకుఁజూడఁగా పట్టి యాస. మనలో పాటలను స్వరపఱచి వ్రాసికొనుట ఈవలిపద్ధతి. ప్రాచీను లకు పాట వేదమువలె శ్రుతి పరంపరగా వచ్చినది. సాహిత్యము రాగ ములు మాత్రము వ్రాసి గుర్తువేసికొన్నవారును కొందరే. మఱియును వేదమువలె స్థిరములగు మూడునాలుగు స్వరములతో ముగియక, స్థాయిత్రయములు, సప్తస్వరములు, వాని వికృతులు, గమకములు, సంచారభేదములు— ఇత్యాదులతో స్వతంత్రకల్పన కెక్కువ యవకా శముగల కళగావున సంగీతము, మేఘమాలికవలె అనుక్షణము రూపుమాఱుట తప్పని స్వభావము. రాగము, తాళము మొదలగునవి వెల్లి పాటలకు, మనుష్యులకు కులగోత్రములున్నట్లు... నే నెఱిగిన నంతవఱకు సుమారు 40 పండ్ల క్రింద సుబ్బరామదీక్షితులే సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో నాలుగైదు క్షేత్రయ్య పదములను మొట్ట మొదట చిట్టతన సంప్రదాయప్రకారము వ్రాసి ప్రచురించెను. తరు వాత వారెవరును ఇదివఱకును ఆపని చేయలేదు. 2" అంటారు విస్సా రాళ్లపల్లివారు. కానీ ఈ మధ్యకాలంలో క్షేత్రయ్య పదాలకు, కొన్నింటికైనా, స్వరకల్పన జరగడం ఒక విశేషమే. ఈ స్వరకల్పన కారులు మంచాళ జగన్నాథరావుగారు. స్వరం కూర్చబడిన పదాలు

2. అ. కృ. శ. రా.— అం. ప. (1942–43)— పు. 16.

సుమారు 140. అంతకుముందు 1954 లోనే మంచాళవారే 78 క్షేత్రయ్య పదాలకు స్వరాలు కూర్చారు. ఈ మాత్రమైనా క్షేత్రయ్య సాహిత్యంతోపాటు సంగీతాన్ని పరిరక్షించడానికి జరిగిన కృషిని ప్రశంసించక తీరదు. క్షేత్రయ్య రాగాలను గూర్చి మంచాళవారు "క్షేత్రజ్ఞులు 4200 పదములు మువ్వగోపాల ముద్రాంకితములుగా చెప్పిన అన్ని పదములకు నేడు నామ మాత్రముగా 370 పదములకు మాత్రము సాహిత్యమును, వీనిలో సుమారు 150 పదములకు సంగీత ఫణుతులును దొరుకుచున్నవి. దొరికినంతవరకు అమూల్యమగు కర్ణాటక సంగీత సంప్రదాయమునగల కొన్ని రాగముల స్వరూపములు ఇదమిత్థముగా తెలియజేయునట్టివిగా నున్నవి.[3]" అని తెలిపారు. క్షేత్రయ్య సంగీత విశిష్టతను గూర్చి రజనీకాంతరావు గారిలా వివరించారు. "17 వ శ. లో నారాయణతీర్థులు, రామదాసు, క్షేత్రయ్య ఈ ముగ్గురి చేతులలోను మన సంగీతము మూడు మార్గములను తొక్కినది. నారాయణతీర్థుల కృషిలో సంకీర్తనము ప్రధానముగా ఆధ్యాత్మికబోధను ఆదర్శముగా ఉంచుకొని, శృంగారము ఔపచారికము చేసికొని, ఒక ప్రక్క నాట్యాభినయయుక్తములైన యక్షగానమునకు ఉపాంగమౌతూ ఇంకొక ప్రక్క భజన పద్ధతి ప్రాచుర్యానికి దారితీసింది. రామదాసు కీర్తనలు భక్తిరస పరమావధినిపొంది, పామరజనంకూడ భక్తి మార్గాన సాధన చేయడానికనువైన భజన గోష్ఠుల వ్యాప్తికి కారణమైనాయి. క్షేత్రయ్య మార్గము శృంగారమును ప్రధానముగా స్వీకరించి అధ్యాత్మబోధ అంతర్గర్భితముగా సాగుతూ నాట్యమునకు, అభినయము ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చింది.

3. నా. క – (మే. 1973) పు. 44.

క్షేత్రయ్య మిగిలినవారికంటె ఒక అడుగు ముందుకు వేసినది ధాతు కల్పనములో; అంటే సంగీత రచనలో! ఇది తరువాతి వాగ్గేయ కారుల కెందరికో క్షేత్రయ్యను మార్గదర్శిని చేసింది. నేటి కర్ణాటక సంగీతపు రాగాల స్పష్టరూపం కావలెనంటే మనకు తొట్టతొలుతగా క్షేత్రయ్య పదాలలో దొరుకుతుంది.[4]" ఇలాగా సంగీత రచనలో విశిష్ట స్థానంగల క్షేత్రయ్య వాడిన రాగాలు అపూర్వం. గిడుగువారి ప్రతిలో పొందుపరచిన ప్రకారం అత్యధిక పదాల్లో కాంభోజిరాగం వాడబడింది. కాంభోజి— 42, భైరవి—40, ముఖారి—27, కల్యాణి 26, సావేరి—17, తోడి, యదుకుల కాంభోజి—16, పంతువరాళి, కేదారగౌళ, ఆనందభైరవి—13, మోహన, మధ్యమావతి, బిలహరి- 11, శంకరాభరణం, ఆహిరి, ఘంటారావం—10, పున్నాగవరాళి— 9, సౌరాష్ట్ర, ఉసేని—8, బేగడ-6, సురట, నవరోజు, అఠాణా, సైంధవి, సారంగ—5, కన్నడ, ధన్యాసి, ఘంట, అసావేరి, నీలాం బరి—4, కాఫీ—3, నాదనామక్రియ, శ్రీరాగం, మారువ, శహాన-2 పదాలలో వాడబడ్డాయి. వసంతభైరవి, నాగ గాంధారి, వరాళి, ఖండె, గౌళిపంతు, ఫరజు, గౌరి, భూపాల, మంగళకైశికి, దర్బారు, పున్నాగ, రేగుప్తి, బేహాగ్, కేదార— అనే రాగాలొక్కొక్కటి ఒక్కొక్కపదానికి వాడబడ్డాయి. వీటితోపాటు "సింధుపదం, లలిత పంచమం, అనే రెండు ప్రయుక్తమయ్యాయి. మొత్తంమీద 49 రాగాలు క్షేత్రయ్య వాడినట్లు తెలుస్తూంది."[5] విస్సావారు క్షేత్రయ్య 39 రాగాలు వాడినట్లు చూపించారు.[6] అప్పటికి వారికి లభించినపదాలకు వాడబడినరాగాలువారిచ్చారు. క్షేత్రయ్య రాగాల మహాత్మ్యాన్ని గూర్చి చెప్పిన మంచాళవారి మాటలు ఉట్టం

4. 16 ఆం. సా. ఆ—పు. 61.

5. జ. మం - నా. శ. (జనవరి, 1978) – పు. 52

6. 7. అ. వి. - పు. 65.

కించ దగ్గవి. "క్షేత్రజ్ఞులు నలభై తొమ్మిదో, యాభయ్యో రాగా లనే వాడారు. అందులో కాంభోజిరాగంలో ఎక్కువపదాలున్నాయి. తరువాత శంకరాభరణం, భైరవి, తోడి, ముఖారి, ధన్యాసి, ఘంటా పున్నాగవరాళి, ఆహిరి అంటే సున్నితములైన స్వర సందర్భాలు, గమకవరికాదులువున్న రాగాలలో మధురమైన భావాలు వ్యక్తీక రించడానికి ఎక్కువ అవకాశం ఉంటుందో ఏమో మరి అందుకే ఈ రాగాలు వాడిఉండవచ్చు. ప్రతి మధ్యరాగాలలో కల్యాణి, వరాళి, సారంగ ఈ మూడురాగాలే ఎక్కువగా కనబడతాయి. అన్నట్లు ఇక్కడ ఒక ముఖ్యమైన సంగతి చెప్పాలి. క్షేత్రజ్ఞుల యాభై రాగా లలోను సుమారు 35 పైగా భాషాంగరాగాలే."[7] క్షేత్రయ్య అపూర్వ రాగాలలో ఆహిరి, గౌరిపంతు, ఘంటారాగాలు లక్షణ కారులు చెప్పిన లక్షణాలకంటే విలక్షణంగాను, సామంతం, ఉసేని, సైంధవి, నవరోజులు లక్షణాన్వితంగానుఉన్నాయనీ, ఖండె, సింధూ రతిలక మొదలైనవాటికి లక్షణాలు చెప్పనేలేదనీ మంచాళవారు తెల్పుతున్నారు.[8]

ఇంక క్షేత్రయ్యవాడిన 'తాళం' గురించి చెప్పడం ముఖ్యమే. త్రిపుట తాళంలో ఎక్కువపదాలు రచించినట్లు తెలుస్తుంది. "సుమారు -380 క్షేత్రయ్య పదాలలో 140 త్రిపుటతాళంలోను, 118 ఆదితాళంలోను, 59 చాపులోను, 24 అటతాళం, 22 జంపె, 13 రూపకం, 2మఠ్యతాళం, 1 మిశ్ర, 1 ఏక తాళంలో నడిచాయి".[9] త్రిపుటతాళంలోనే ఎక్కువ పదాలు క్షేత్రయ్య రచించ డానికి గల కారణం మంచాళవారిట్లు పేర్కొన్నారు. "క్షేత్రజ్ఞులు

7. పై 5. లోనిదే.

8. పైదే — పు. 51. 52.

9. ర. రా. జా. — పు. 65.

ముఖ్యంగా విలంబకాలంలో వున్న త్రిపుటతాళంలో ఎక్కువపదాలు చెప్పారు. ... త్రిపుటతాళంలో ఇరవై ఎనిమిది అక్షరాలలో మిశ్రజాతివదలి తక్కిన నాలుగు జాతుల విడుపులతో కూడిన సంచారాలు తెచ్చుకోడానికి అవకాశం ఉంది గనుక అభినయానికి ప్రాధాన్యం ఇచ్చారు. కాలప్రమాణానుసారంగా సంగీతాన్ని గమక వరికాదులతో రాగభావాన్ని అర్థపుష్టిని తెలియజేస్తూ పాడాలి గనుక ఎక్కువ పదాలు త్రిపుటతాళంలోనే క్షేత్రజ్ఞులు చెప్పి ఉంటారు".[10] ఇలాగా క్షేత్రయ్య ఉపయోగించిన రాగతాళాల విశిష్టత మనదనగత మవుతూంది. కర్ణాటక సంగీతానికి క్షేత్రయ్య చేసినసేవ అనన్య సామాన్యం!

## 5. 2 పదాల్లో సంగీత ప్రసక్తి :

క్షేత్రయ్య తన పదాల్లో పదరచన, పాడే పద్ధతి, సంగీతం మీద గల ఆసక్తి స్ఫురింపచినట్లు తెలుస్తూంది. "ఏల పదముపాడుచు"; "పదము పాడగవినేవా"; "వలరాజు మీదను పదము పాడు కొనుచు"; "వెన్నెల బైట సంగీతము విననట్టి వేడుకేటి వేడుకే; పన్నుగదాని వర్ణింపలేనట్టి పదము లేటిపదములే"; "జోడుకుండి తోడిరాగము పాడుచు" [సీ. గి. వేం.సా. 76, 26, 79, స్వీ. 185, 77] అని ఇలాగా సంగీతంమీద అభిమానం, పదంపాడడం మొదలైన సంగతులను క్షేత్రయ్య వ్యక్తం చేశాడు. అంతేగాదు ఇంకెక్కడా ఏరాగాన్ని ప్రస్తావించని క్షేత్రయ్యతోడి రాగాన్ని పేర్కొన్నాడొకే ఒకచోట. అందుకే "రాగములలోఁ దోడిరాగమున్న క్షేత్రయ్యకు మక్కువ ఎక్కువ. జోడుగూడి పాడుటకు తోడిరాగ మెత్తినదని యతని యభిప్రాయము.[11]" అని అంటారు కోదండ

10. ఆ. మం. — నా. క. (జనవరి 1978). పు. 52
11. భా. — (సెప్టెంబరు, 1950) — పు. 294.

శామయ్య గారు. ఆ రోజుల్లో వీణ, తంబూర, పిల్లనగ్రోవి మొదలైన వాద్యాలుండేవని మూడో ప్రకరణంలో తెలుసుకొన్నాం. కేవలం పదాలను గాత్రంతో పాడుకోవడమేగాక, వాద్యాలతో పాటు పదంపాడడం ఉండేదని తెలుస్తూంది. "పిల్లనగ్రోవి చేతబట్టి... చిటికెనగోరు చిమ్ముకొంచు చిటిపాటి పదములు చేరి పాడుచు", "వేటుగజ్జెలే తంబూర మీటి వింతపదాలే, మీటుజాతులెల్లా మెలత" [సీ. గి. వేం-సా. 52, 44] అని చెప్పబడింది. పదాలుపాడే పద్ధతి సైతం గలదు. "సొంపున వానిపై పదము పాడి వీణ సొలపుగ మీటుదునే", అనీ "అందమైనవీణ చేతబూని అనురాగములే మీటి పొందుగాను పదకవిత్వము పలుకనేర్చునా ?" [ సీ. గి. వేం — సా. 88, 59 ] అనీ స్పష్టంగా వీణమీద అనురాగాలు పదాలలో పాడే విధానం ఇందులో చక్కగా పేర్కొన్నాడు క్షేత్రయ్య. ఆడిపాడడం గూడా ఉంది. "సంతోషముగా నాడునా? తంబురా మీట సంచుపాట పాడునా" [సీ. గి. వేం - సా. 8.] అనడంవల్ల పై విషయం తెలుస్తూంది. విజయరాఘవుని రసికత వెల్లడిస్తూ తన పూర్వాశ్రమంలో చెప్పినపదంలో పదపద్య కవితలను గూర్చి, ఆట పాటల గూర్చి, తంబురమీటి, రాగమాలపించే విధానాన్ని గురించి ఎంతో చక్కగా వర్ణించాడు క్షేత్రయ్య.

"సామాన్యముగాదె! వానిపొందు-సామాన్యముగాదె!
ఏమననేరని భామలు వాని కాసించి రేమందు
విజయరాఘవుడే సామి సుమ్మి!
భూమియందు వాని గుణములెన్న జనులకు
వీనులవిందు ఓ చెలియరో! ॥ సామాన్య ॥

ప్రాయపు పొంతకారి కావలె! - వాని పదపద్య రచన
సేయనుత్తర — మీయవలె! వానిముద్దుకవిత తా

వ్రాయచదువ నేర - వలె! ఈ నగలందుండు
గాయకురాలు - గావలె! ఓ చెలియరో! ॥ సామాన్య ॥

ఆటకు మేటి గావలె! తంబుర
గోటమీట రాగమనవలె! దానిపై సొగసు
పాటలు వినిపించవలె! వాని మనసు తెలిసి
మాటలాడ నేరవలె! ఓ చెలియరో! ॥ సామాన్య ॥

కప్పురబాగాలీయవలె! సంతరగు చేసి
చిప్పిల్ల నగమాకీయవలె! తమి హెచ్చే వేళ
తప్పక మోవి నొక్కవలె! విజయ రాఘవుని
అప్పుడె పైకొని కూడవలె! ఓ చెలియరో! ॥ సామాన్య ॥"

[సీ. గి. వేం - సా. 96] ఇలాగా క్షేత్రయ్య తన పదాల్లో అక్కడక్కడ తన పదకవితను, పాడే విధానాన్ని గురించి చెప్పుకొన్నాడని మనం తలంచవచ్చు.

## 5.3 సంగీతరచనా వైశిష్ట్యం :

పదరచనకారులు అన్నమయ్య క్షేత్రయ్యలు వాడిన రాగాలకు గల భేదాన్ని, క్షేత్రయ్యలోని విశిష్టతను రజనిగారిలా వివరించారు. "తాళ్లపాకవారి నాడు ప్రచారంలో ఉండిన పాడి, సామంతము, ఆబాలి, అమరసింధు, రాయగౌళ, కొండమలహరి, [illegible] వంటి అపూర్వరాగాలు క్షేత్రయ్యనాటికి అంతరించిపోయాయి. అన్నమాచార్యులు వాడిన ఆహిరి, కాంభోజి, కేదారగౌళ, ధన్యాసి, భైరవి, మధ్యమావతి, ముఖారి, రామక్రియ (లేక) పంతువరాళి, శంకరాభరణము, సావేరి, సౌరాష్ట్ర రాగాలను క్షేత్రయ్యకూడా వాడినాడు. అన్నమాచార్యులవారు ఈ రాగాలను పాడేపద్ధతి యేమో

అప్పుడు వారి సంగీత రచనలను స్వరపరచి వ్రాయుటకై పద్ధతి ఉండేదో లేదో స్పష్టంగా తెలియదు".[12]

క్షేత్రయ్య పదాల విశిష్టతను, సంగీత సందర్భాన్ని మొట్టమొదటిసారిగా లోకానికి వెల్లడించిన సుబ్బరామదీక్షితుల మాటలు పేర్కొనదగ్గవి. "ఇతని పదములవలె శృంగారరసము ఒలుకునట్లు కైశికీ రీతిగాను, మృదుపదములుగాను, నాయికానాయక లక్షణములు దప్పకను, అర్థపుష్టితోను, సందర్భాలకు తగినట్టి వాక్యములతోను, ధాతువులతోను ఇతనికి మునుపుగాని వెనుకగాని పదములు జూడదగిన వారెవరును లేరని నిశ్చయముగా చెప్పవచ్చును. ఈతనిపదములు శబ్దార్థముల చక్కగానెఱిగి రసానుభవముతో నెవడు (చౌకముగా) విలంబముగా పాడుచున్నాడో ఆ పదములు రాణించును. ధాతువులను వ్రాసిజూచితే వచ్చినదే వచ్చినట్లుండును. ఇట్లుండుటయే పదసాహిత్యముల శయ్య. ధాతువులు వచ్చినది రాక యుండుట కీర్తనములశయ్య.[13]" ఇది క్షేత్రయ్యపదాలలోని ధాతు ప్రయోగ విశిష్టత. కానీ విలంబకాలంలో క్షేత్రయ్య పదాలు పాడాలన్న అభిప్రాయంతో రాళ్ళపల్లి వారేకీభవించ లేదు. పై పదముల రచనలలో క్షేత్రయ్య ప్రతిభసాహిత్యమందు ప్రకాశించినంతగా సంగీతమందున్నట్లుతోపదని నావినీతాభిప్రాయము ...... ఈవల కొందరు గాయక విద్వాంసులు పదగానము విలంబకాలమందే పాడవలయునని శాసించుచున్నారు. తాళలయ ప్రమాణమును పెంత ఈడ్చి పాడుదుమో అంతరాగరచనకు, గమకముల స్ఫురణకు, అవకాశమెక్కువలభించునని వారి యాశయము. నిజమే. కాని కూర్పులో ప్రధానమైన సాహిత్యరచన చాల భాగము తెగసాగి, తునిగి, అక్షర

---

12. ర. రా. బా. – పు ౨51.

13. సు. దీ. – పు. 9.

వాక్యముల పరస్పర సాపేక్షత అంతరించును. విలంబము, పాడే వారికన్న నర్తకులకెక్కువ అవశ్యకము. నర్తకులు ఒక్కొక్క శబ్దమునకును లయబద్ధమైన ముద్రతో అర్థము నభినయించి భావమును ప్రదర్శింపవలసినవారు. కనుక సాత్వికముగా, ఆంగికముగా వారు స్పష్టముగా అభినయమును సాగించుటకు వాచకమునకు కొంత విలంబిత విన్యాసము ముఖ్య సాధనము. పదవాక్యముల యర్థము విలంబముచేత కొంత స్పష్టత పోగొట్టుకొన్నను ఆ లోపమును అభినయముచేత తీర్చు అవకాశము వారికున్నది. కనుక సభ్యులకు రస భావాస్వాదమునకు కొరత యుండదు ... పాడేవారి గొడవవేరు. పదముల సాహిత్యరచనయే వారికి జీవాతువు. కనుక పదములకు, వాక్యములకును గల సంబంధము చెడనీయక సభ్యులకు భావము లందిచ్చుటకు విళంబకాలము గాయకులకంతగా ప్రయోజనపడదు."14 పదగాయకులందరూ చాలవరకు విలంబకాలంలోనే పాడాలన్న అభిప్రాయమే కలిగి ఉన్నారు. సుబ్బరామ దీక్షితులలాగే మంచాళ వారూ తలంచుతున్నారు. "కొందరు పెద్దలు అభినయం చేసే టప్పుడు మాత్రం విలంబకాలంలో పదంపాడిన ఫరవాలేదుకాని కచ్చేరీలలో పాడేటప్పుడు అంతమరీ కాలప్రమాణం దించేస్తే ఏమి బావుంటుంది? అని అనడం నేను విన్నాను. కాని కచ్చేరీకి ఒక లాగా, అభినయానికి ఒక లాగా పదంపాడడం అనేది మా గురువులు మాకు చెప్పలేదు. కొన్ని పదాలు ప్రత్యేకంగా 'ఆటపదములు' అని నృత్యా నికి పనికివచ్చే విధములైన సంచారాలు, సందర్భాలు కలిగి ఉండడం మాత్రం మాకు చెప్పారు. అందుకే కొన్ని పదాలు ఆటపదాలని, కొన్ని పదాలు అభినయపదాలని అనడంకద్దు." "విలంబకాలంలో క్రియకు 4 అక్షరములచొప్పున త్రిపుట తాళంలో ఎక్కువగా పాడు కొనవలసిన పదములు చాపు తాళంలో మధ్యమకాలంలో పాడు

14. 16. ఆం. సా. అ. — పు. 24–26.

కొంచెం, ఏనుగుని గుర్రంలా పరిగెత్తించడమే అవుతుంది. ఇది గాయకులు తమ అనుభవంతో తెలుసుకొని పాడివినిపించాలి.[15]" పదంలోని మాటలకు తగిన విధంగా, రసభావాల కనుగుణంగా రాగ స్వరూపం రూపొందించడంలో క్షేత్రయ్యకు అతడే సాటి. సంగీత రహస్యాన్ని బాగా గుర్తించిన ప్రౌఢుడు కావడమే దీనికి కారణం. "కరుణరసంలో బాహ్యమాత్రమైన దుఃఖమూ, ఉపశమించుకోగల దుఃఖమూ, దుర్భరమైన దుఃఖమూ, హృదయవిదారకమై హాహాకారమనే విలాపంతో కూడిన దుఃఖమూ, ఈ వివిధ దుఃఖావస్థలూ గల పదాలకు ముఖారి, ఘంటా, నాదనామక్రియ, పున్నాగవరాళి, కాంభోజివంటి రాగాలను వాడుకొన్నాడు. ప్రస్తారానికి పూర్తి అవకాశములేని ఆహిరి, ఘంటా, సైంధవి, కర్ణాటకకాపి, నవరోజు వంటి రాగాలను గూడ బహు సూక్ష్మప్రయోగాలలో వాడి, ఒడలు ఝల్లుమనిపించగలిగిన మహాశిల్పి. ఇతని ప్రతిపదంలోను రాగభావం మీగడవలె పైని తెరకట్టి ఆచ్ఛాదించి ఉంటుందని విద్వాంసుల అభిప్రాయం. ఒకపదము పూర్తిగా పాడునప్పటికి దానికి జతపరచిన రాగము పూర్తిగా అన్య గతులను ప్రసృతమవుతుంది.[16]" ఇలాగే క్షేత్రయ్య పదాల్లోని సంగీతౌన్నత్యాన్ని గూర్చి విశిష్టంగా ప్రశంసించారు సాంబమూర్తిగారు.[17] ఇట్లే క్షేత్రయ్య సంగీతవైవిధ్యాన్ని బట్టి, సౌలభ్యాన్ననుసరించి 'క్షేత్రయ్య పద సంగీత పితామహు'డని కీర్తించిన శ్రీ పాదగోపాలకృష్ణమూర్తిగారి మాటలు అక్షరాలా సత్యం.[18]

---

15. నా. క. – [జనవరి, 1978] – పు. 52.
16. ర. రా. భా. – పు. 251.
17. 7. అ. వి. – పు. vi, vii.
18. భా. – [అక్టోబరు, 1963] – పు. 63.

సాహిత్యంలోనే గాక సంగీతంలోనూ ప్రత్యేకతా, ఒక విశిష్ట స్థానమూగల క్షేత్రయ్యపదాలు స్వరసహితంగా ఆంధ్రప్రదేశ్ సంగీత నాటకఅకాడమీ ప్రకటించి, క్షేత్రయ్య సంగీతంకలకాలం నిలిచిఉండే అవకాశం కలిగించింది. సంగీత సాహిత్యాలతోపాటు తన పదాల్లో అభినయాన్ని జోడించి అభినయకళకు ప్రాణంపోసిన మహానుభావుడు క్షేత్రయ్య. జయదేవుని అష్టపదులు మొదలైన వాటితోపాటు క్షేత్రయ్య పదాలు కూచిపూడి నృత్యంలో అతిముఖ్యంగా ప్రయోగించబడుతూ ఉండడం సర్వసామాన్యమే. పదాభినయానికి క్షేత్రయ్య చేసిన సేవ అమోఘమూ, అనన్య సామాన్యమూను- ఈ అభినయాన్ని గూర్చి తెలుసుకొనేముందు, అలంకార శాస్త్రానికి లక్ష్యంగా క్షేత్రయ్య పదాలు రచించిన తీరును గమనిద్దాం.

## 5.4 అలంకార శాస్త్రలక్ష్యం :

విస్సాఅప్పారావుగారి పరిశోధనవల్ల క్షేత్రయ్య పదాలెలా అలంకారశాస్త్రానికి లక్ష్యాలుగా ఉన్నాయోవ్యక్తమైంది. 1550 ప్రాంతంలోని భానుదత్తమిశ్రునిచేరచితమైన 'రసమంజరి' అనే అలంకారగ్రంథాన్ని 'శృంగారరసమంజరి' అనే పేరుతో ఒకానొక అజ్ఞాతలాక్షణికుడు తెలుగు చేసి మూలంలోని లక్ష్యశ్లోకాలను వదలి వాటికి మారుగా క్షేత్రయ్యపదాలను పొందుపరచడం జరిగింది[19]. రసమంజరిలో అలంకారశాస్త్రం, నాయికా నాయక భేదాలు మొదలైనవన్నీ ఉన్నాయి. ఈ "రసమంజరి ననుసరించియే ప్రతిలక్షణమునకు సరిపోవు రసయుక్తములగు పదరూపములో క్షేత్రయ్య వ్రాసియుండెనని ఈ శృంగారరసమంజరి స్పష్టపరచుచున్నది.[20]" అని విస్సా వారితీర్పు. కానీ మహాకవి వాక్కులా విధంగా లక్ష్యభూతాలయ్యా

19. 7. అ. వి. – పు. 51, 58.

20. పై దే – పు. 54

యని తలంచడమే సముచితమేమో! కాబట్టి క్షేత్రయ్య పదాలను, ఈ శృంగారరసమంజరి కర్తలక్ష్యాలుగా ఉదాహరించాడనే తలంచవచ్చు.

అముద్రితమైన ఈ "శృంగారరసమంజరి"ని విస్సావారు క్షేత్రయ్య పదాల్లో అనుబంధంగా ప్రకటించారు. క్షేత్రయ్యపదాల లక్ష్య వైశిష్ట్యాన్ని గూర్చి జమ్మల మడక మాధవరాయశర్మగారిలా వివరించారు. "క్షేత్రయ్య పదాలు సర్వలక్ష్యములు. ఆ లక్ష్యము లన్నియు మువ్వగోపాలాంకితములు. రసమంజరీకర్త భానుదత్తునిలో గోచరించని విశేషము తెలుగు క్షేత్రయ్యలో గోచరించును. ఆలంకారికుల లక్ష్యములు శృంగారమును సూచించునవియే యయినను అందలి కామచరిత్రము అస్పష్టము, అజ్ఞేయమునై దూరదూరమైనది. ఇందు అది అదూరమైన తంత్రము. అమరుకశతకములోని గూఢ సూచనలు కామినీకాముకుల గాఢ ప్రణయమును భావింపజేయును. అందఱకు అమరుక దేవుడొక్కడే నాయకుడు. నాయికలనేకలు, నానా నాయికల తృప్తి సంతృప్తులు, బాధావ్యథలు, ఎడమోము పెడమోములు అందున్నవి. కాని క్షేత్రయ్య నిరూపించిన రమ్యతకలవై లేవు. క్షేత్రయ్య పండించుకొన్న సొత్తు క్షేత్రయ్యది.[21]" ఇంతే గాకుండా మూడు నాలుగు ప్రకరణాల్లో వివరించినట్లు శృంగారం, మధురభక్తిని పోషించడంలోను వివిధనాయికానాయక భేదాలను స్పష్టం చేయడంలోను క్షేత్రయ్య తన విశిష్టతను నిలబెట్టుకొన్నట్లు సువిదితమే. నాయికస్వీయ, ముగ్ధ, నవోఢ —

**రసమంజరి :**

'హస్తేధృతాపి శయనే వినివేశితాపి
క్రోడీకృతాపి యతతే బహిరేవగన్తుమ్

21. పైదే — పు. 83, 84.

జానీమహే నవవధూ రథతస్స్వవశ్యా
యః పారదం స్థిరయితుం క్షమతే కరేణ ॥'

**శృంగార రసమంజరి :**

"చ. కరమున గట్టినం గుసుమకల్పిత తల్పమునందు జేర్చి నం
దరముగ గౌగలించినను దత్తర మందును బైలుదేరగా
నిరవుకొనంగ జాదరస మెవ్వడు చేతను నిల్పువాని కిం
దరమగుగా నవోఢ నెదదార్పగ జిందులు ద్రొక్కు-
చుండగన్"·

**క్షేత్రయ్య పదం :**

"నన్నేటికి బొమ్మనేరే - వాని వద్దికి ?
మిన్నక వాని వద్దికిని - మీరే పోరే చెలులార ! ॥ నన్నేటికి॥

పడతి ! నేనందుబోను - పలుమారు దన నోటి
మడుపందునయముచేసి - చేపట్టి నన్ను
పడకింటికి రమ్మనెనే - నే రానంటె
కడువెరపించి హుమ్మనెనే - అమ్మ! నేవెరతు ॥ నన్నేటికి ॥

మచ్చకంటి యిపుడిపుడు - వచ్చిన లేతచన్నులను
నొచ్చెననగా బట్టెనే ! - వద్దంటే వినక
మచ్చరాన గోరుబెట్టెనే ! - వచ్చెద నంటె
ముచ్చువగల దోవగట్టెనె - అమ్మ ! నేవెరతు ॥ నన్నేటికి ॥

నెలత నమ్మికలిచ్చి - యల మువ్వగోపాలుడు
చెలిమితో నను దీసెనే - కుయ్యోకుమని
బలిమి నోరు మూసెనె - పరవశమై
తెలియనైతి నేమేమో చేసెనే - అమ్మ ! నేవెరతు
॥ నన్నేటికి ॥"22

22. పైదే – పు. 54, 55.

వీటిలో రసమంజరి, శృంగార రసమంజరులకంటే క్షేత్రయ్య పదం చక్కటి లక్ష్యంగా గోచరిస్తూంది. స్వీయ, ముగ్ధ, నవోఢ అయిన నాయికకు ఇది చక్కటి ఉదాహరణ. మొదటిరోజు శయ్యా గృహంలో నాయకుడు బలాత్కారంచేయగా, తరవాతిరోజు శయ్యకు బోనొల్లనని సఖులతో తెలియజేసిన దనుటచే నవోఢ అని సిద్ధాంతం.[23] ఈ లక్షణానికి అతికినట్లు సరిపోయేలక్ష్యం పై క్షేత్రయ్య పదం. కనుకనే శృంగారరసమంజరికర్త దీనినే లక్ష్యంగా చూపించాడు.

మరో ఉదాహరణ : స్వీయ, ప్రౌఢ, మధ్యమ — అయిన నాయిక నాయకుని మనోభావం తెలుసుకొని పూర్వవర్తన నాయకునితో ప్రత్యక్షంగా చెప్పి, మళ్ళీ ఓదార్చె[24] దన్న లక్షణానికి ఈ క్రింది క్షేత్రయ్య పదం చక్కటి లక్ష్యం.

"ఎందుకొచ్చెనో కోప - మెవ రే మన్నారు ?
అందుకిందుకు సరి - యాయెరా! మువ్వగోపాల ॥ఎందుకు॥"

[7. అ. వి — 89] ఇందులో నాయికా నాయకులు పరస్పరం కోపగించుకోవడం, నాయకుడు మరింతగా అలగడం, ఆ సమయంలో నాయిక అతఃపూర్వమే జరిగిన విషయాన్ని ప్రస్తావించి, నాయకుని ఓదార్చడానికి ప్రయత్నించడం ఉంది. కనుకనే చక్కటిఉదాహరణ. ఇట్లే ఏ ఉదాహరణ గ్రహించినా అదెంతగానో ఆ లక్షణానికి లక్ష్యభూతమై ఉండడం గమనించదగ్గది. ఇదే క్షేత్రయ్య పదాల్లోని అలంకార లక్ష్యరచనా వైభవం. ఈ సందర్భంలో గిడుగు సీతాపతిగారి మాట ఉల్లేఖించడం సముచితమే. "నాయికా నాయకుల లక్షణములు, వారి యవస్థలు నెన్నెన్ని విధములుగా నుండునో లెస్సగా

23. పైదే — పు. 240. 24. పైదే — పు. 241.

పరిశీలించిన రసజ్ఞుడు గనుక, మనమెట్టి నాయికా నాయకుల, యెట్టి యవస్థలను దలంచుకొన్న నందుకుఁ దగిన పదము క్షేత్రయ్య గదన లందుగనఁబడగలదు. అట్టులనుటవలన నితఁడు లక్షణశాస్త్రముఁ దుటఁ బెట్టుకొని యొక్కొక్క లక్షణమున కొక్కొక్క లక్ష్యముగాఁ సీ పద ములను రచించెనని చెప్పుట యొప్పు కాదు. క్షేత్రయ్య వంటి యుత్తమ కవులెప్పుడు అట్టి పని చేయరు. లక్షణములకి లక్ష్యములను బొందుపరచుట పండితుల పని. శృంగార రసమంజరిలోని లక్షణములకు క్షేత్రయ్య పదములనుండి లక్ష్యము లాస్థలములందు సమన్వయింపఁ జేసిన వారిటీవల పండితులు"25.

## 5.5 అభినయానుకూల్యం :

అలంకార శాస్త్రానికీ, నాట్యశాస్త్రానికీ అవినాభావ సంబంధం ఉంది. క్షేత్రయ్య పదాల అభినయానుకూల్యాన్ని గూర్చి తదనుభవ జ్ఞానపరినిష్ఠుతులైనవారు తెలిపిన అభిప్రాయాలను సైతం తెలుసు కొందాం. ఆంగికం, వాచికం, ఆహార్యం, సాత్త్వికమూనని అభి నయం నాలుగువిధాలు. వీటిలో సాత్త్వికాభినయం చాలా ప్రధానమూ, విశిష్టమూను. సత్వమంటే మనస్సు; తత్సంబంధి సాత్త్వికం. సాత్త్వికాభినయం పదంలో ప్రాధాన్యం వహిస్తుంది. అభినయానుకూల్యాన్ని గూర్చి "క్షేత్రయ్యకు పూర్వంగాని, తరువాతగాని నాట్యమునకు సంపూర్ణముగ అనుకూలించే రచనలు లేవని నా యభిప్రాయ"26 మంటున్నారు విస్సా అప్పారావుగారు. ఇలాగే రాళ్లపల్లి వారు "దక్షిణదేశమందలి భరతనాట్య కళలో కేంద్ర స్థానము వహించిన వీ పాటలు. పదముపాడి అభినయం పట్టుట నర్తకుల పరాయణము. ఆ పనికి వలసిన రాగతాళముల రసభావముల

---

25. సీ. గి. వేం-పు. XLIII
26, 9. అ వి. – పు. 28.

విస్తర సౌకుమార్య గాంభీర్యములు క్షేత్రయ్య పదములందున్నంత మరెందును ఉండవు."[27] అని ముక్తకంఠంతో పేర్కొన్నారు. "తన పదకవితతో ఒక నూతన అభినయ కళాసృష్టిచేసి, దేవదాసీల అభినయ కళపై ఒక "నూతన వెలుగు" ను ప్రసరించి అమరమూర్తియైనాడు క్షేత్రయ్య."[28] అన్నారు నటరాజ రామకృష్ణగారు.

క్షేత్రయ్య పదాలను అభినయించే పద్ధతినిగూర్చి చెప్పినవారు తక్కువే. విస్సావారి ప్రతిలో కూచిపూడి వేదాంతం లక్ష్మీ నారాయణశాస్త్రిగారు "ఒక్కసారికే యీలాగైతే — నోహో! యిదేటిరతిరా" అన్న పదానికి రాసిన వివరణ ప్రకటించబడింది.[29] గిడుగువారి ప్రతిలో స్వీయ, పరకీయ, సామాన్య-నాయికాభేదాలను అనుసరించి ఒక్కొక్క నాయికకు పది పదాల చొప్పున మొత్తం ముప్ఫై పదాలకు నాయికా నాయక లక్షణాలతోపాటు పదంలోని రసభావాలు, స్థాయి, సంచారి భావాలు మొదలైనవాటితో ప్రకటించడం జరిగింది. ఈ వివరణలు దేవులపల్లి వీరరాఘవమూర్తిగారు రచించి ప్రకటించిన అభినయ స్వయంబోధినిలోనివి.[30] వేదాల తిరువేంగళాచార్యులు సైతం కొన్నింటికి వివరణ రచించడం జరిగింది.[31] సమర్థవంతంగా అభినయం పట్టగల నాట్యాచార్యులు 'తాండవకృష్ణ'గారు. క్షేత్రయ్య పదాభినయ నిపుణులు నటరాజ రామకృష్ణగారు. దాదాపు పదేండ్ల కృషి, సాధన, పరిశోధనల ఫలితంగా వీరు రచించిన క్షేత్రయ్య పదాభినయ వ్యాఖ్యాన సంబంధి

27. ఆం. ప. (1942–43) — పు. 61.

28. నా క — (నవంబరు. డిశంబర్ 1967) — పు. 20.

29. 7. ఆ. వి — పు. 69, 70.

30. సీ. గి. వేం — పు. XXXV, XXXVI.

31. సం. ఆం. వి — పు. 158–162.

వ్యాస పరంపర 'నాట్యకళ'లో ధారావాహికంగా ప్రకటించి ఎంతో సేవచేశారు.[32] ఇది ప్రశంసార్హమైన సంగతి.

క్షేత్రయ్య పదాలు రచించి, పాడి, అభినయించి రసానందానుభూతిని పొంది తరించాడనడంలో సందేహం లేదు. కానీ ఈ పదాల అభినయానుకూల్యంలో తరతమ భేదాలున్నాయంటున్నారు విస్సా వారు. "నాయికా నాయకుల స్వవచనములైన పదములు ఎక్కువగా అభినయింప అనుకూలములు. సఖివాక్యములంతగా అనుకూలపడవు. కొన్ని పదములు వర్ణచిత్రణకు, చదివి భావములు అనుభవించుటకు ఎక్కువగా బాగుండును. కొన్ని పదములలో నర్తకియొక్క ప్రతిభను చూపించుటకు వీలైన చోట్లుండును. "మువ్వగోపాలు డెన్ని నేర్చె నాడమ్మా; తళుకు బెళుకు వగలు" మొదలైనవి.[33] కనుక క్షేత్రయ్య పదాల్లో కొన్ని అభినయానికి మిక్కిలి ఉపకరించగలవు. ఈ అభిప్రాయంతోనే కొన్ని క్షేత్రయ్య పదాలను పింగళి లక్ష్మీకాంతం గారు వివరించారు. అభినయంలో రసభావాలు ప్రధానం. "ఆ రస భావముల ప్రదర్శనము, పాత్రారోపణమున్నపుడేజరిగి యవస్థానుకృతి యనిపించుకొనును. కవివ్రాసిన యేవర్ణనాత్మక కీర్తననో స్వీకరించి, అందలి శబ్దముల అర్థమును ప్రదర్శించెడి యభినయము నృత్యాభినయము ... రసభావాశ్రయమైన అభినయము అభినేత, తానొక పాత్రయై రసవంతముగా ఆ భావమును ప్రదర్శించుట. ఇదే యథార్థమైన అభినయము ... అభినేతగాని, అభినేత్రిగాని పాత్రకు సంబంధించని కవి వాక్యములను అభినయించుట నృత్యమే యగును గాని అవస్థానుకృతి కాజాలదు. అట్లుగాక కవి ఒక పాత్ర నోట పలికించిన వాక్యములను అభినయించుట పాత్రారోపణ సహితమైన అవస్థాను

32. నా. క. – (నవంబరు–మే, 1967, '68.)

33. పి. అ. వి. – పు. 33, 34.

కరణాభినయము. క్షేత్రయ్య 'మగువ తన కేళికామందిరము వెడలెన్' —అని తెలతెలవారుచుండగా శయ్యాగృహమును వీడి వచ్చెడి లక్ష్మీ దేవిని వర్ణించెను... ఈ వర్ణన యంతయు కవి వాక్యమేగాని పాత్రోచ్చారితము గాదు. ఈ పదమును అభినయించు అభినేత్రి ఇందలి శబ్దార్థములను అభినయించి చూపవలెనేగాని ఆ యవస్థను తాననుకరింపగూడదు. లక్ష్మీదేవియొక్క సోలింపులు, తూలింపులు తానభినయించినచో, ఆయనుకరణము అప్రస్తుతమును, అనుచితమును అగును. కేళికామందిరమును వెడలిన మగువ ఒక వ్యక్తి. ఈ అభినేత్రి ఇంకొక వ్యక్తి, ఆ మగువ తానే కాదగిన పాత్రారోపణము చేసికొన్ననేగాని ఆ అనుకరణము సాధ్యముగాదు. ఇచట పాత్రారోపణము కుదరదు. మరి

"ఇంటికి రానిచ్చేనా ఈ మేనితో - ఇంతివాని దలచేనా
గొంటుకాడు మువ్వ - గోపాలరాయడు
తంటాలు జేసితే - దండించక విడిచేనా ॥ ఇంటికి ॥

ఇతనికి వెరచినే — నిక లంచమిచ్చేనా
ఇన్నాళ్ళవలె ననుస—రించేనా
బతిమాలి నే రాయ — బార మంపించేనా
పతి యని మునుపటి — భక్తి దయ లుంచేనా ॥ ఇంటికి ॥

ప్రేమదలచి తన - మోమైన జూచేనా
ఏమి చెప్పిన నిజ — మెంచేనా
రామా! అయినదె గాని – రచ్చకు వెరచేనా
ఆ మాట సభలోనే — ననక విడచేనా ॥ ఇంటికి ॥

ఎనసిన మొకమాట - మెంతైనజూచేనా
ఎంతోవేడిన మన - సిచ్చేనా

వనిత ! పట్టిన పట్టు - వట్టిదనిపించేనా
పనిబూని "మువ్వగో - పాలా!" యని పిలిచేనా ॥ ఇంటికి ॥"

అని క్షేత్రయ్య వ్రాసిన ఇంకొక పదములో నున్న వాక్యములు ఖండిత నాయికవి. అభినేత్రి యా నాయికాత్వమును తన కారోపించుకొని అందలి శబ్దార్థములనుకాక రసభావములను ప్రదర్శించి నపుడు సార్థకమైన అవస్థానుకరణము జరుగును."[34] ఇలాగా క్షేత్రయ్య పదాలను అభినయించడంలో అభినేత్రిగాని బహు జాగరూకత వహించవలసి ఉంటుంది.

నటరాజ రామకృష్ణగారు క్షేత్రయ్య పదాభినయాన్నిగూర్చి చెప్పిన వాటిని సంక్షిప్తంగా స్పృశించి ముగించడం సముచితం. అభినయం — ఆహార్యం, వాచికం, ఆంగికం, సాత్వికమూనని నాలుగు విధాలన్నది పూర్వోక్తం. ఆహార్యం : "ఒక్కొక్క పదములోని భావమునకు, నాయికకు సరిపడినట్లు ఆభరణములు, వస్త్రములు, కేశాలంకారములు, ముఖమునకు రంగు, రంగాలంకారము మొదలైన విషయములలో శ్రద్ధవహించనిచో ఈ నాయికయొక్క వాతావరణమును సృజింపలేము. కనుక ఆహార్యము నాయకాభినయమునందు ముఖ్యము"[35] వాచికం : "పదములను భావపూరితముగ అభినయించుటకు వాచికము చాలముఖ్యము. పాటరుడు పాడునప్పుడు రాగతాళములకే ప్రాధాన్యమివ్వక, ఆ పదములోని భావమునకు తగినట్లు కంఠమును హెచ్చు, తగ్గులు సవరించుచు, ధ్వనిలోని మాధుర్యమును కనబరచుచు,పదములోని భాష ప్రేక్షకులకు అర్థమగునట్లు [Emotional type of music] పాడవలెను."[36] వీటికంటే

34. 62. ల. పిం – పు.233–235.
35. నా. శ. (మార్చి, 1968) – పు. 58.
36. పైదే

గూడ ఆంగిక, సాత్వికాభినయాలు చాలా ప్రధానం. "పదములు కొన్ని ఆంగిక ప్రధానమైనవిగా నున్నవి." "ఆంగిక ప్రధానమైన పదము—

"ఏ తీరున రమణిని గెలిచి నీ—వెట్లు రూపొదువో ?
చూతము రారా ! మదన నీ
చేతి బలిమి మా చెలియ బలిమి ॥ ఏ తీరున ?"

ఇందు సాత్వికమునకన్న ఆంగికభావమే (హస్తాభినయమే) ప్రాధాన్యం వహించునని పదము చదివినంతనే తెలియుచున్నది."37 సర్వోత్తమమైనది—పదాభినయంలో — సాత్వికాభినయమే. "సాత్విక ప్రధానమైన పదరచనలు :

"అక్కరో ! యోర్వనివారు సరసుడు గాడని
యాడుకొంటే యాడుకొనేరు" —

ఈ పదాభినయమందు సంచారులయొక్క, ఆంగికముయొక్క అవసరమెక్కువగా ఉండదు. సాత్వికభావము (స్తంభము, స్వేదము, రోమాంచము) మొదలైనవానిపై ఈ నాయిక అభినయమాధారపడి యుండును. "రామ వాని దలచినపుడే" — ఇచ్చట అభినయము ఉచ్ఛ్వాస నిశ్వాసములతో ప్రారంభమైనను ; శరీరముయొక్క పొంగును ప్రదర్శించుటకు సాత్వికమే శరణ్యము. అట్లే పదమంతయు సాత్వికభావములయొక్క ప్రదర్శనపై నాధారపడియున్నది."

"కేవలము సాత్విక సంచారులయొక్క సహాయముతోనే ప్రదర్శించుటకు చక్కని అవకాశమున్న పదములు మరి కొన్ని—

"ఎందు దాచుకొందు నిన్ను - ఏమిసేతు నేను ?
అందమైన నీ మోము - అయ్యలూ ! ముద్దుగులుకుచున్నది".

ఈ పదములో 'ఎందు దాచుకొందు నిన్ను' అన్నప్పటి ఆత్రుత, అసహాయత, కంగారు మొదలైనవి ప్రదర్శించినప్పుడును,

37. పై దే. పు. 64, 65.

"అందమైన నీ మోము అయ్యలూ! ముద్దుగులుకుచున్నది" ఇందు ప్రదర్శించునట్టి ఆనందమునకు ఆంగికముయొక్క అవసరము ఎంత మాత్రము నుండదు. ఆనందము, ఆత్రుత, కంగారు నేత్రముల యొక్క గతిద్వారా ప్రదర్శించును."[38] ఇలాగా అనుభవపూర్వకంగా రామకృష్ణగారు వివరించారు. ఇంక "శ్రీపతి సుతుబారికి" — అన్న పదానికి, అంతకంటే "ముందటివలె నాపై" అన్న పదానికి రామ కృష్ణగారు చేసిన అభినయ వ్యాఖ్యానం అనన్యసామాన్యం. ఈ సందర్భంలో "ఇటువంటి వ్యాఖ్యలను వ్రాయు వారు తాము స్వయంగా పాడి అభినయించగల శక్తిసంపన్నులై వుండవలె...అటు వంటి స్థాయికి చెందే రచనగా రూపొందించాలని కృషి సల్పినాను. రచన సాగించినాను. నా కృషి ఫలించిందని ఆశిస్తున్నాను".[39] అన్న వీరి మాటల్లో సత్యముంది. సంగీత సాహిత్యాభినయాలకు పట్టు గొమ్మలు క్షేత్రయ్య పదాలు. ఆ మహత్వాన్నిగూర్చి రామకృష్ణ గారిలా పేర్కొన్నారు. "పాట సులభశైలిలో నడవాలి; పదాడంబర ముండకూడదు ... భాష భావగర్భితమై యుండవలె; మాటలు తక్కువగా ఉండాలి. రాగములో మిళితమైపోయే రీతిని అక్షరముల కూర్పు వుండవలె; ధ్వని ప్రాధాన్యంకల్గి వుండవలె. ఇన్నింటిని ఒప్పించగల్గిన రచనయే సాత్వికభావ ప్రకటనకు ఉపకరించును. అట్టి వానియొక్క అభినయమే పండిత జనరంజకం, పామరజన ప్రబోధ కముగా నుండి, రసభావముల జిప్పిలజేయును. ఇవన్నీ గూడిన రచన చేయగల్గువాడు, తాను స్వయముగా గాయకుడు, నర్తకుడునై యుండి కావ్యరచన చేయగల్గువాడై యుండవలె. అట్టి మహనీయుడే క్షేత్రయ్య."[40]

---

38. పైదే – పు. 64.
39. నా. క. (నవంబరు, డిశంబరు 1967) – పు. 21.
40. పైదే – పు. 20.

# 6. క్షేత్రయ్య సేవ

సంగీత సాహిత్యాలతో సముచితంగా అభినయాన్ని సమ్మేళన గావించి పదరచనచేసిన క్షేత్రయ్య అనంతముఖాలైన ప్రతిభా సంపద పూర్వ ప్రకరణాల్లో సుస్పష్టం చేయడం జరిగింది. చివరిగా సంగీతాభినయాలకు, పదకవితకు, వీటి మూలంగా తెలుగు సాహిత్యానికి క్షేత్రయ్య చేసినసేవ ఎలాంటిదో పరిశీలిస్తే ఈ సిద్ధాంత వ్యాసం పరిపూర్ణం కాగలదు.

## 6.1 పదకవితా జనకుడు:

తేట తెలుగు పలుకుల సొంపుతో, తెనుగుదనం ఉట్టిపడేట్లు చక్కటి జానుతెలుగులో పదరచనచేసి అత్యున్నత స్థానం ఆక్రమించుకొన్నాడు క్షేత్రయ్య. ఆ మార్గంలో అతని కతడేసాటి. పదాలనే రచించినా మహాకావ్య శిల్పిగా క్షేత్రయ్య నిరూపించుకొన్న సంగతి పూర్వోక్తం.

క్షేత్రయ్యకు పూర్వం 'ఆంధ్రకవితా పితామహుడూ,' 'పదకవితా పితామహుడూ' ఉన్నారు. క్షేత్రయ్య తరువాత 'ఆంధ్ర నాటక పితామహుడూ' చారిత్రక నాటక పితామహుడూ'ఉన్నారు. క్షేత్రయ్య 'పదకవితాజనకుడు'అంటున్నారు రాళ్ళపల్లి వారు. "తెలుగు

పదకవితా కన్యకు పితామహుఁడు తాళ్ళపాక అన్నమయ్యగారంటిని. కాని జనకుఁడే క్షేత్రయ్య. తాత మొదలుపెట్టిన పనిని తలపొలము దాఁక ఈడ్చిన తండ్రి యితఁడు... ఇతనికి ముందుగాని, వెనుకఁగాని తెలుఁగు సాహిత్యములో—ఒక్క తిక్కన్నను వదలితిమేని — ఇంతటి రసికుఁడు, సహృదయుఁడు, భాషా మర్మజ్ఞుఁడు, ప్రతిభాశాలియగు కావ్యశిల్పి ఇంకొకఁడు పుట్టలేదు. ఎట్లును నాయెఱుకకు రాలేదు."[1] ఈ మాటలు ప్రత్యక్షర సత్యం.

పూర్వులను అనుకరించినా తన విశిష్టతను నిలబెట్టుకొని, తరువాతి వాగ్గేయకారుల కెందరికో మార్గదర్శకుడైన మహా మనీషి, దార్శనికుడు క్షేత్రయ్య. తన పదకవితలో శిల్పాన్ని పరిరక్షించిన మహాకావ్యశిల్పి. తన పూర్వుడూ, పదకవితా పితామహుడూ అయిన అన్నమయ్యలో లేని శిల్పాన్ని తన పదకవితలో పొదిగినవాడు క్షేత్రయ్య. ఓ ఉదాహరణ. ఇది చర్వితచర్వణమే అయినా పునః పరామర్శ తప్పదు. "పలుకు దేనెల తల్లి పవళించెను

కలికి తనముల విభునిగలిసినది గనుక..."

అనే అన్నమయ్య పదాన్ని క్షేత్రయ్య అనుకరించాడు. ఇది పూర్వోక్తం.

"మగువ తనకేళికా మందిరము వెడలెన్

వగకాడ! మాకంచి వరద! తెల్లవారెననుచు..." ఈ పదంలో కావ్యశిల్పాన్ని ఎంతగానో క్షేత్రయ్య నిర్వహించి ఉండడం గమనించదగ్గది. ఇందుకు సహృదయహృదయాలే సాక్షి! ఈ సందర్భంలో "అన్నమాచార్యుని శృంగార సంకీర్తన రచనాంశము క్షేత్రయ్యగాను, అధ్యాత్మ సంకీర్తన రచనాంశము త్యాగయ్యగాను

1. ఆం. ప. [1942–43]–పు. 16, 17.

నవతారము దాల్చెననఁ జెల్లును."[2] అని చెప్పిన వేటూరి ప్రభాకర శాస్త్రిగారి మాటలు సమంగా సరిపోతున్నాయి. మరి కొందరు జయదేవుడే క్షేత్రయ్యగా అవతరించినట్లు తలంచుతున్నారు.

క్షేత్రయ్య పదకవితా మాధుర్యానికి వలచి ఆతని సమకాలికులూ, తరువాతి వారూ ఎందరో వాగ్గేయకారులు అనుకరించారు. సమకాలికులైన విజయ రాఘవ నాయకుడు, రంగాజమ్మ, కామరసు వేంకటపతి ప్రభృతులూ, తరువాతి వారైన మునిపల్లె సుబ్రహ్మణ్య కవి,[3] సారంగపాణి,[4] మాతృభూతయ్య,[5] పరిమళ రంగడు మొదలైన పదకారులూ క్షేత్రయ్యను మార్గదర్శకునిగా గ్రహించి పదరచన చేశారు. అయినా క్షేత్రయ్య పదాలలోని శిల్పమూ, ఉదాత్తతా రసభావాలను వ్యంజితం చేయడంలోని ప్రతిభా వీరెవ్వరికీ పట్టుపడ లేదంటే ఆశ్చర్యంలేదు. దీనివల్ల వాగ్గేయకారునిగా క్షేత్రయ్య విశిష్టతా, ప్రత్యేకతా గోచరించి, అతడొక సమున్నత పీఠస్థుడైనట్లు స్పష్టంగా మన కవగతమవుతుంది. అతడు నిజంగా పదకవితా చక్రవర్తి!.

## 6.2 పదసంగీత పితామహుడు :

సాహిత్యంతోపాటు సంగీతంలోను క్షేత్రయ్య విశిష్టస్థాన మాక్రమించుకొన్నాడన్న సంగతి పూర్వోక్తం. పదకవితా పితామహుడు అన్నమయ్యే అయినా, అతడు వాడిన రాగాలు పరిమితమైనవి. కానీ క్షేత్రయ్య అపూర్వరాగాలను వాడి వాటికి సొగసును కూర్చాడు. "క్షేత్రయ్య పదములలోని పల్లవి, అనుపల్లవి,

---

2. 46. ప్ర శా. వే.–పు. 96.
3. ర. రా. ఞా.–పు. 269–272.
4. (i) పై దే–పు. 319–327; (ii) పై 1లోనిదే–పు. 18.
5 పై 1. లోనిదే–పు. 20.

చరణములలో క్రమముగా రాగవృద్ధి ఎట్లు చేయబడినదో, ఒకేరాగ మందలి వివిధ పదములలోని సర్వసంచారములు, గమకభేదములు, అలంకారములు, పదముయొక్క భావానుగుణముగా రసము పోషించుచు ఎట్లుండునో, ఎన్ని భావభేదములకు, ఒకే రాగమే, ఎన్ని విధముల వాడబడినదో బాగుగా పరిశీలించినచో క్షేత్రయ్య సంగీతానుభవము ఎంత ప్రతిభావంతమైనదో వ్యక్తము కాగలదు. ఎత్తుగడ, తరువాత నడక, సర్వసంచారములు, పోకడలు రాగము యొక్క జీవకళలను పదగమనములో చిప్పిలచేయుచుండును."[6] ఇంకా ఈ పదరచనకొక సౌష్ఠవం చేకూర్చి అనుపల్లవిని అనుసంధానించాడు క్షేత్రయ్య. "గేయములకు పల్లవితోపాటు అనుపల్లవి చేర్చు సంప్రదాయమునకు క్షేత్రయ్యయే మార్గదర్శకుడైనాడు."[7] అని రజనిగారంటే రాళ్ళపల్లివారు "అట్లే అనుపల్లవి పురందర దాసుల కీర్తనలలో ఎన్నిటికోయున్నది." అంటూ, కనకదాసు లోనూ, అన్నమయ్యలో ఒకటి రెంటికీ అనుపల్లవి ఉన్నట్లు వివరించారు.[8] కావచ్చు, కానీ తెలుగులో అనుపల్లవి వాడుక క్షేత్రయ్య కాలంనుంచే ప్రబలప్రచారంలోకి వచ్చిందనడంలోనూ, దానికి సంపూర్ణత నిచ్చినవాడు క్షేత్రయ్య అనీ తలంచడంలోనూ అసామంజస్యం లేదేమో! ఇంకా ఈ అనుపల్లవిని గూర్చి శ్రీపాద వారిలా అన్నారు. "క్షేత్రయ్య తనపదాలను అన్నమయ్య పదాలనే అనుసరించి రచించాడు. కాని నృత్యాభినయాలలో వినిపించవలసినవి కనుక చౌకకాలములో సంగీతమును ధారాళముగా ప్రవేశపెట్టి, అన్నమయ్య సంకీర్తనలలో సమ్మర్దము బలసి గొంతులో గళగళ మంటూ అడ్డుపడే అక్షరాలను తగ్గించి అందము చేకూర్చాడు.

---

6. 7. అ. వి -పు. 66.
7. ర. రా. బా. – పు. 251.
8. పై దే–పు. 10.

ఈయన కాలానికి అనుపల్లవి పల్లవి పాదవుకు రెండు రెట్లు పొడవైంది. చరణాలలోని చివ్వరి రెండు పాదాలు అనుపల్లవి స్వరాన్ని అవలంబించాయి. పల్లవికీ చరణాలకీ సంగీతబంధము ఎక్కువైంది. అనుపల్లవికి చక్కని హోచావచ్చింది."[9] క్షేత్రయ్య సంగీత మహాత్మ్యాన్ని తెలిపి, అతడు 'పదసంగీత పితామహు'డని కీర్తించిన శ్రీపాదవారి మాటలు ఈ సందర్భంలో స్మరించదగ్గవి. "అన్నమయ్య పదకవితాపితామహుడు. క్షేత్రయ్య పదసంగీతపితామహుడు! ఈయన పదసంగీత మాధుర్యమే సంగీత రచనను శంఖలీల, సింహతాళము వంటి తాళభేషజాలనుంచి పదములవైపు తిప్పినదేమో అనిపిస్తూన్నది...ఎవరి పదములు తంజావూరులో, మధురలో, కంచిలో ముఖరితములైనవి? ఎవరి పదముల శక్తి విజయరాఘవ నాయకుని కాలపు యక్షగానాలలో అన్నిటిలోను ప్రతిధ్వనించింది? అతడే పదసంగీత పితామహుడు క్షేత్రయ్య. ఈయన తరువాత సంగీత రచన నిబంధపదములనుబట్టి పెరిగినది. త్యాగయ్య రచనలు ముప్పాతికమూడు పాళ్ళు నిబంధపదాల్లే." "క్షేత్రయ్య కర్ణాటక సంగీత వికాసకాలములో భేషజాలులోపించి మాధుర్య మకరందము చిందించే శుభసమయానికి ఉషస్సువంటివాడు... సాహిత్యము ఒక్కొక్కచోట సభలలో వినిపించరానంత లాలసను తరుచు భరిస్తున్నా సంగీతమాధుర్యము ఆ గండాశ్మములను ముంచి నిండుగా ప్రవహిస్తుంది క్షేత్రయ్య పదాలలో. అవి ఇక్షుఖండాలు. సాహిత్యము కాదు వాటి జీవము, మరి సంగీత మధుర రసము."[10]

సంగీతానికి క్షేత్రయ్య గావించిన సేవనుగూర్చి విస్సావారిలా అన్నారు. "క్షేత్రయ్య రాగస్వరూప చిత్రమతి సుందరము,

---

9. భా.–[సెప్టెంబరు, 1961]–పు. 91.

10. భా.–[అక్టోబరు, 1963]–పు. 63, 64.

మనోహరము, అదివరకెవ్వరును రాగమునకట్టి అందము తీర్చిదిద్దిన వారులేరు. ఇట్టి రాగరచనచేసి రాగమునకు రససిద్ధిని కల్పించి రాగము యొక్క సంపూర్ణ స్వరూపమును నిరూపించి సంగీతములో రాగమునకుగల ఉన్నతస్థానమును క్షేత్రయ్య నిర్ణయించి తరువాతి వాగ్గేయకారులకు సంగీత వేత్తలకు మార్గదర్శియైనాడు. ఈ పోకడలనేబట్టి త్యాగరాజస్వామి ఎన్నో నూతనరాగములకు ప్రధానముగ స్వరూపమును చిత్రించియున్నాడు. సైంధవి, ఘంటారావము, ఆహిరి, ముఖారి, బేగడ, సౌరాష్ట్రి మొదలగు రాగములకు నేటికిని క్షేత్రయ్య పదములే మాతృకలు, ప్రమాణములు. అందలి రాగముల జాడలనే ఇతర వాగ్గేయకారులు నడచియున్నారు."[11] ఈ విధంగా క్షేత్రయ్య సంగీతానికి చేసినసేవ అనన్య సామాన్యమని విదితమౌతుంది.

## 6.3 అభినయాచార్యుడు:

సంగీత సాహిత్యాల్లో సముచితరీతిని తన పదాల్లో అభినయాన్ని సమ్మేళనం చేసిన అభినయా చార్యుడు క్షేత్రయ్య. "క్షేత్రయ్య నాట్యవిద్యా విశారదుడు. కైశికీ విద్యా ప్రధానమగు నాట్యకళయందు— అభినయ కళయందు, శృంగారరస నిలయములగు, నాయికా నాయక లక్షణములయందు సంపూర్ణప్రజ్ఞ నేర్చినవాడని చెప్పవలసియున్నది. ఈతడు పదములను పాడి, భావము నభినయించుచు ఆడి, నృత్యగీత వాద్యాత్మకమగు సంగీతమును అనుభవించి రససిద్ధి పొందిన సంగీతవేత్తయని చెప్పుటకు ఏమియును సందేహమక్కర

11. 7. అ. వి.— పు. 66, 67,

లేదు."[12] ఇదేవిధంగా క్షేత్రయ్య అభినయ విశిష్టతను తెలిపిన నటరాజ రామకృష్ణగారి మాటలుల్లేఖించడం సముచితం. "క్షేత్రయ్య ఆంధ్రుడు, కృష్ణభక్తుడు, మధుర భక్త్యుపాసకుడు, కవి, గాయకుడు, సంగీతశాస్త్రజ్ఞుడు, నర్తకుడు, అభినయకళావేత్త, పండితుడు, విద్వాంసుడు, భారతీయ అభినయకళను 'నూతన వెలుగుల'తో తీర్చిదిద్దిన సకల కళాపూర్ణుడు, ఏకైక పదరచయిత; అట్టివాడు అతనికిముందు పుట్టలేదు. ఇకముందు పుట్టబోడు." "తన పదకవితలో ఒకనూతన అభినయకళాసృష్టిచేసి, దేవదాసీల అభినయ కళపై ఒక 'నూతన వెలుగు'ను ప్రసరించి అమరమూర్తియైనాడు క్షేత్రయ్య."[13]

క్షేత్రయ్య అభినయానికి చేసిన సేవనుగూర్చి విస్సావారిలా పేర్కొన్నారు. "వివిధ నాయికా నాయకులయొక్క చిత్తవృత్తులను, అవస్థలను, రసభావములను ప్రత్యక్షమగురీతిని క్షేత్రయ్య పదములను పాడి ఆడెను. నాటినుండి సాత్వికాభినయమునకు మహోన్నతస్థానమేర్పడినది. భరత శాస్త్రమునందలి రసభావ అధ్యాయముల యందు వివరింపబడిన సర్వవిషయములకును లక్ష్యములుగా పదములుండుటచేత తల్లక్షణములన్నియును శాస్త్రమునందెంత దూరము చెప్పియున్నాడో అంతదూరము వఱకు అభినయించి చూపుటలో క్షేత్రయ్య పదములు వీలుగానుండెను. అందుచేత దాక్షిణాత్య నాట్యకళలో నొకగొప్ప అధ్యాయము నాడు ప్రారంభమైనది. ఇది కూచిపూడి వారి నాట్యకళ చరిత్రలో వసంతోదయము వంటిది. వీరు, తంజావూరు ప్రాంతము

12. 8. అ. వి.– పు. 112.
13. నా. క.– [నవంబరు, డిశంబరు 1967]– పు. 19 20.

వారందరు ఈ నూతన విద్యను చేర్చిరి. నాటినుండి అభినయ కళకు పట్టుకొమ్మలైనవి."[14] ఈనాడుగూడ అభినయంలో దక్షిణదేశంలో క్షేత్రయ్య పదాలకే ప్రాధాన్యముంది.[15] దీనివల్ల క్షేత్రయ్య అభినయ కళకు చేసినసేవ అపూర్వమూ, అసదృశమూనని స్పష్ట మవుతుంది.

పర్యాప్తమయిన ఈ పరిశీలనవల్ల సంగీత సాహిత్యాలను తన పదాల్లో పొదగడమేగాక, అభినయం జోడించి ఉత్తమ వాగ్గేయ కారుడుగా సమున్నతస్థానం ఆక్రమించుకొన్నాడు క్షేత్రయ్య; మధుర భక్త్యుపాసకుడుగా అనితరసాధ్యమైన ఆత్మానందానుభూతిని పొంది తరించాడు క్షేత్రయ్య; ఈ విధంగా సంగీత సాహిత్యాభి నయాలలో ఎందరికో తన పదాల ద్వారా మార్గదర్శకుడయ్యాడు క్షేత్రయ్య! చేసింది పదరచనే అయినా పదకవితా చక్రవర్తిగాను, అత్యుత్తమ మధురభక్త్యుపాసకుడుగాను తన ప్రత్యేకతనూ, వైశిష్ట్యాన్నీ, మౌలికతనూ నిలబెట్టుకొన్న మహోన్నత మనీషి, అమరుడు క్షేత్రయ్య! "క్రియాసిద్ధిస్సత్వే భవతి మహతాం నోపకరణే."



14. 9. అ, వి.– పు. 275, 276.

15. సీ. గి. వేం.– పు. XIV.

# సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసింది |
|---|---|---|---|
| 1 | 10 | ఆనందించిదగినది | ఆనందించదగినది |
| 2 | 1 | ముందుకుకరిగినవాడు | ముందుకరిగినవాడు |
| 3 | 17 | ఆకారాది | అకారాది |
| 4 | 6 | ఉల్లేఖంచినట్లు | ఉల్లేఖించినట్లు |
| ,, | 20 | క్షేత్రజ్జుడు | క్షేత్రజ్ఞుడు |
| 7 | 3 | మొవ్వ్యయే | మొవ్వయే |
| 10 | 25 | మనపిచేసుకొనుము | మనవిచేకొనుము |
| 11 | 17 | సంకేత | సంగీత |
| 12 | 5 | మోవనాడుకదిలిన | మోవనాడుకలిగిన |
| 20 | 21 | ధువా | ధ్రువా |
| 25 | 23 | సాళఅతిమ్మా | సాళువతిమ్మా |
| 26 | 4 | నిషేష్య | నిషేవ్య |
| ,, | 7 | సంగీతసుధా | సంగీతసుధ |
| 34 | 4 | దేవతనాశ్రయించ యున్న | దేవతనాశ్రయించి యున్న |
| ,, | ,, | దక్కదనికయతడు | దక్కదనియతడు |
| 54 | 7 | శైవ్వమతానికి | శైవమతానికి |
| ,, | 10 | దేవనామము | దేవరనామము |
| 56 | 10 | గానగంధర్వములను | గానగాంధర్వములను |
| 76 | 2 | ఎవరివల్ల డుడుకు | ఎవరివల్ల దుడుకు |
| 80 | 24 | ధ్రువార్థేషునిబద్ధంచ | ధ్రువార్థేషునిబద్ధంచ |
| 87 | 11 | రాయబకార | రాయబయకార |
| 90 | 23 | మాలుబాపన | మాలుబాసబాపన |
| 91 | 15 | నిరసర్గమాధుర్య | నిసర్గమాధుర్య |

| పుట | పం_క్తి | ఉన్నది | ఉండవలసింది |
|---|---|---|---|
| ,, | 19 | ఉండంవల్ల | ఉండడంవల్ల |
| ,, | 20 | ఉండండంవల్ల | ఉండడంవల్ల |
| 92 | 7 | నెపుణ్యాన్ని | నైపుణ్యాన్ని |
| 95 | 9 | వెన్ను వకీల్జడ | వెన్నునకీల్జడ |
| 101 | 22 | కానిరాక | కనరాక |
| 103 | 8 | Imageries | Imagery |
| ,, | 13 | ,, | ,, |
| 106 | 7 | సొమ్ముశేల | సొమ్ములేల |
| 114 | 6 | తరలాక్షి! ముత్యాల | తరలాక్షీ ముత్యాల |
| 120 | 12 | వాజ్మి | వాగ్మి |
| 122 | 22 | అలసతినే | అలసితినే |
| 139 | 5 | కురికుంభముల | కరికుంభముల |
| ,, | 6 | విరిగొన్న | విరిగొన్న |
| 140 | 2 | నకళ్లన్న | సమూనాలన్న |
| 152 | 22 | తడవాయి | తడవాయె |
| 155 | 13 | పాకములోని | పానకములోని |
| 166 | 3 | సన్మానముగూట | సన్మానముగూడ |
| 167 | 10 | అయాత్మజాలై న | అయత్నజాలైన |
| 171 | 16 | వినా | నవినా |
| 175 | 12 | వాక్చరీణాం | వాక్చనారీణాం |
| 176 | 6 | రసాపరానురక్తిరీశ్వరే | సాపరానురక్తిరీశ్వరే |
| ,, | 19 | సిధుస్సరిద్వల్లభమ్ | సింధుస్సరిద్వల్లభమ్ |
| ,, | 20 | తష్ఠతి | తిష్ఠతి |
| 178 | 11 | అన్యాదృశ్యమగు | అన్యాదృశమగు |
| 194 | 8 | విజిజిజ్ఞాసస్వ | విజిజ్ఞాసస్వ |
| 195 | 14 | తథాన్నృత్యం | తథాన్నృత్యం త్రయం |
|  |  | సంగీతముచ్చతే | సంగీతముచ్యతే |
| 196 | 13 | స్థాయిత్రమములు | స్థాయిత్రయము |

డా॥ ఎస్. గంగప్ప

*ఇతర రచనలు :*

అచ్చయినవి :

**కోలాచలం శ్రీనివాసరావు**

(జీవితం, నాటకాల విమర్శ)

**సుహాసినీ హాసం**

(సాంఘిక నవల)

**[illegible]గు సాహిత్యం,**

**నాటకసాహిత్యం,**

**జానపద సాహిత్యాలపై** వివిధ **పత్రికల్లో** సుమారు 40 వ్యాసాలు ప్రకటితం.

అచ్చులో :

**తెలుగు జానపద గీతాలు**

**సాహిత్యసుధ**

(వ్యాససంపుటి 1, 2 భాగాలు)

